ఈ తంబిగాడు ముందుగా గవరయ్య ఇంటికి వెళ్ళినందుకు చిరాకు పడ్డాడు హరిశ్చంద్రుడు. గవరయ్యనీ, తంబినీ ఇద్దరినీ కలిపి చంపెయ్యా లన్నంత కోపం వచ్చింది.

తను సంపాదించుకోవడం పని చూసి ఏం వేళాకోళంగా వుంది? "నువ్వేంపని చేస్తావు?" అని అడిగాడు తంబిని. చచ్చేదాకా బ్రతుకుతాను, అన్నాడు తంబి. నీకు పనీ పాటూ లేదు?"

అన్నం తినడం, చుట్టూ చూడడం. కళ్ళు నెప్పిపెడితే పడుకోడం- అవి చేస్తాడుట.

"ఏదైనా పని చేసుకొని నాలుగు రాళ్ళు సంపాదించుకోరాదూ!"

తనకి పనంటే పడదుట. కొందరు చేసేవారు; మరికొందరు చేసినదాన్ని చూసి విలువకట్టి ఆనందించేవారు - అన్నాడు తంబి.

హరిశ్చంద్రుడికి మరో భావం స్ఫురించింది. అతని మెడ వంచి, చెవులో ఏదో చెప్పాడు. రైట్ - ఇంతేనా - అన్నాడు తంబి. ఎగిరి గంతేశాడు. నవ్వాడు - తను రోజూ చేసే "పనిదా - అదీ" అన్నాడు.

ఇంతలో గవరయ్య ఇంటికి చేరుకున్నారు. సంజ్ఞలతో ఆహ్వానించి, దొడ్డివైపు మండువాలోకి తీసికెళ్ళాడు గవరయ్య. ఒక పాత చాపతీసి దులిపి, పరిచి కూర్చోమన్నాడు.

హరిశ్చంద్రుడు, గవరయ్య వొకరికేసి వొకరు చూసుకున్నారు కాని మాటల్లేవు. తంబి స్వగతంలా చెప్పుకుపోతున్నాడు. తాను యాత్రీకుడుట; ఎక్కడి కెడతాడో తెలీదుట; అస లెక్కడనుంచి వొచ్చాడో కూడా తెలీదుట. రామేశ్వరంలో ఆలయం వర్ణిస్తున్నాడు. కన్యాకుమారిలో సూర్యోదయం సౌందర్యం గురించి చెప్పాడు. వర్ణిస్తుంటే అతని కళ్ళల్లో తడి మెరిసింది. మండువా చూరులో కంతలున్నాయి. ఆ కంతల్లోంచి, చివరి కిరణాలు అతని నుదుటిమీద పడి, తంబి మొహాన్ని మరింత వింతగా వెలిగించాయి - ఎఱుపు కాలి, ఇంకా ఎఱుపైనట్లు! పసుపు తడిసి ఇంకా పసుపైనట్లు?

శివసముద్రం జలపాతం. శ్రీరంగపట్నంలో టిప్పుసుల్తాన్ వంతెన గురించి చెబుతున్నాడు. పుదుచ్చేరి కోట, అరవిందాశ్రమం, జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావడం గురించి ప్రస్తావిస్తున్నాడు.

"తినేదానికేం లేదా ?" అన్నాడు తంబి. మధ్యలో ఆగి.

గవరయ్య పెద్దమ్మాయి అరిటాకులో అటుకులు తెచ్చి మంచినీళ్ళ బిందె, గ్లాసులు దగ్గరలో వుంచి వెళ్ళింది. ముగ్గురూ అటుకులకేసి చూస్తున్నారు. ఎవ్వరూ తినడంలేదు. వారిద్దరినీ పుచ్చుకోమన్నట్లు తల పంకించాడు తంబి. వాళ్ళేమీ తినే యత్నం చెయ్యకపోవడం చూసి, తినడం మొదలెట్టాడు. పైమీద గుడ్డతీసి, చీదిన ముక్కు తుడ్చుకున్నాడు తంబి. విశ్వంలో పదార్థం అంతా ఒక ముద్దలా వుండేదిట. ఆరంభంలో - చీమిడి ముద్ద లాంటిదిట. అదే పరమాత్మట. ఉబుసుపోక ఒక్కమారు చీదాడట పరమాత్మ. అవి కోటానుకోట్ల ప్రాణులుగా మారిందట.

ఈ సిద్ధాంతం గవరయ్యకి నచ్చినట్టుంది. "అందుకనే మనుషులంటే రోత. చచ్చిపోదామనిపిస్తుంది" అన్నాడు.

"నాకును" అన్నాడు హరిశ్చంద్రుడు. పోటీ కోసం అన్నమాట, కాని అది నిజంగా ఆ సమయంలో అనుకుంటున్నది కాదని అతనికి తెలుసు.

మనుషులంటే రోత అనకండి, ఏ ఒక్కమనిషోనంటె రోత అనండి అన్నాడు తంబి; తప్పకుండా చచ్చిపోదాం-చావు విషయంలో మన నిర్ణయం అంటూ లేదు. కాని చనిపోయే ముందు, హిమాలయాలలో నందాదేవి శిఖరం ఒక్కసారి చూసి ఆపైన చనిపొండి - అన్నాడు తంబి.

"అంత బాగుంటుందా ?" అన్నాడు హరిశ్చంద్రుడు. ఇంతలో గవరయ్య పెద్దమ్మాయి తేగలు తెచ్చింది. తాయారు కత్తిపీట తెచ్చింది, ముక్కలుగాచేసి తామరాకులో వేస్తోంది. తంబి గవరయ్య పెద్దమ్మాయి కేసి చూశాడు.

అందం అనేది ఒక స్థితి—దానికి వ్యక్తిత్వం లేదన్నాడు. వివరించమన్నాడు గవరయ్య.

మీ అమ్మాయిని చూడండి - ఎంత అందంగా వుంది! ఆమె నుదురు పడమటి ఆకాశం - కళ్ళు - నక్షత్రాలు. శ్వాస తీస్తుంటే మెడలో నరాలు వీణతీగెలు - ఆమె హృదయం ప్రేమతో సముద్రంలా వూగిపోతోంది. యౌవనంలో ప్రాణి ఒయ్యారంకంటె అందమైనదేముంది? నందాదేవిది నిత్య యౌవనం. సూర్యకిరణానికి, కన్నీరొలికినట్లు శిఖరంనుండి మంచు జారుతుంటే, భారం తగ్గినందుకి మధురంగా కళ్ళు తుడుచుకున్న క్షణంలో తప్ప నందాదేవికి చిరాకులేదు. తాను ఎందరెందరో స్త్రీలను చూశాడుట తంబి. స్త్రీ సౌందర్యం - ఒకే క్రమంగలది. తనని శిఖరం పైకి తీసుకెళ్ళిందిట- కింద పడేసిందట. తను లేచి ఒళ్ళు సర్దుకొని పక్కకు చూసేసరికి, సౌందర్యం ముసుగేసుకొని నవ్వులుగుతోందిట. అందుకనే అతను పారిపోయి ఒచ్చేశాడుట. అంతకంటే గొప్ప సౌందర్యం దైవంట. దాన్ని వెతుక్కుంటూ దేశయాత్రకి వెడుతున్నాడుట తంబి.

చుట్టముక్క కావాలన్నాడు. హరిశ్చంద్రుడు, గవరయ్య ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. తాయారుని పంపాడు గవరయ్య పుగాకు తీసుకురమ్మని.

"నేను కాల్చడం మానేశాను" అన్నాడు గవరయ్య. చాలా పొరబాటన్నాడు తంబి. దైవాన్ని తిలకించడానికి పుగాకు మంచి సాధనం అన్నాడు. కిందికి చూశాడు: అటుకులు లేవు - తనే తినేశాడు: అటుకులు కూడా చిట్టాలో వెయ్యండి అంతరాత్మ శోధనకు అనువైన సాధనం అని - సూచించాడు తంబి.

హరిశ్చంద్రుడికి నవ్వొచ్చింది.

"నేను బీడీలు కాల్చేవాడిని - అతను మానేశాడని నేను మానేశాను" అన్నాడు.

"నా జోలెత్తకు." అని వారించాడు గవరయ్య.

"నీతో అనలేదు." అన్నాడు హరిశ్చంద్రుడు. నిదానించమన్నాడు తంబి. "ఇప్పుడు మించిపోయిందీ లేదు - హాయిగా ముగ్గురం పొగ పీలుద్దాం" అన్నాడు తంబి. మీరు చుట్టలు కాల్చకూడదు అన్నాడు. మీకు భార్యలున్నారు. ఆ వాసన గిట్టదు. మిమ్మల్ని అసహ్యించుకుంటారు - సిగరెట్లు త్రాగమన్నాడు.

"ఒక పాకెట్ తెప్పించేదా ?"

హరిశ్చంద్రుడు "ఓ" అన్నాడు. డబ్బిమన్నాడు తంబి. "నాదగ్గర విషం త్రాగేటందుకు కూడా డబ్బులేదు" అన్నాడు హరిశ్చంద్రుడు, నేను నమ్మను అంటూ అతని చొక్కా జేబులో చెయ్యిపెట్టి తడిమాడు. అతను వారించబోయ్యాడు. కొంత పెనుగులాట జరిగింది. చొక్కాకింద పంచి మడతలో చెయ్యిపోనిచ్చి ఒక సీసా పైకి తీసాడు.

"అదేమిటో తెలుసా ?"

ఎవ్వరూ మాట్లాడలేదు.

"అది విషం. జీవితం మీద విరక్తి పుట్టింది. మరీ దుర్భరమైనప్పుడు మింగుదామని ఎప్పుడూ దగ్గర పెట్టుకుంటాను." అన్నాడు హరిశ్చంద్రుడు. గవరయ్య నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

ఆ సీసా తంబి తన గూడ కట్టుపంచి ఒడిలో బిగించాడు. ఆ విషం తనకి అవసరం అన్నాడు. తను ఏకాకి. తన మృతివల్ల ఎవరూ చిక్కుపడరు. తనవల్ల లోకానికి ప్రయోజనమూలేదు - దాని అందం చూసి ఆనందించేవారి సంఖ్య తగ్గుతుంది - అదొక్కటే నష్టం. యాత్రలో అడుగడుక్కూ, "మీలాంటి మిత్రులు. ఉదారులు" తటస్థపడి తిండికి లోటు లేకుండా జరుగుతుంది. అది జరగని పక్షంలో విషం సీసా శరణు" అన్నాడు తంబి.

గవరయ్య సంబోధించాడు. "మీరు చచ్చిపోతామన్నారు - మార్గం ఆలోచించారా ?" అన్నాడు తంబి.

గవరయ్య జేబులోంచి ఒక సీసా తీశాడు. "నువ్వొక్కడవేనా ఏమిటి చచ్చేది మహా. - నేనూ చస్తాను." అన్నట్టుగా హరిశ్చంద్రుడి కేసి చూస్తూ.

"ఇదిగో గరళం." అన్నాడు గవరయ్య సీసాముందు పెట్టి. అది విషం కాదని తెలుసు హరిశ్చంద్రుడికి. తాను మధ్యాహ్నం తాయారుకిచ్చి పంపిన తేనెసీసా.

"ఇట్లా తే - నేను త్రాగి చస్తాను" అని దాన్ని చటుక్కున లాక్కున్నాడు. మళ్ళా కొంత పెనుగులాట జరిగింది. తంబి స్వాధీనం చేసుకున్నాడు ఆ సీసాని. కుడివైపున పంచి ఒడిలో బిగించాడు."

"తనకే విషం సీసాలు అవసరంట. హిమాలయాలలో కొందరు యోగులున్నారట - గరళంలో మరికొన్ని ద్రావకాలు కలిపి, ఏ లోహా న్నైనా బంగారంగా చేసెయ్యగలరుట. అందుకని తనతో తీసుకుపోతా" నన్నాడు. విషంకాక త్రాగేటందుకు ఏమీలేదా ? అని అడిగాడు తంబి.

గవరయ్య లోపలికెళ్ళి గ్లాసులో మజ్జిగ తెచ్చాడు.

మజ్జిగ త్రాగాడు తంబి. జీవితం అంటే ఏమిటని ప్రశ్నించాడు. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. అదొక్కటే సమాధానం లేని ప్రశ్న అన్నాడు. డాక్టర్ దృష్టిలో హాస్పిటల్ - లాయర్ దృష్టిలో కోర్టుగది. ఉపాధ్యాయుని దృష్టిలో పాఠశాల. న్యాయం దృష్టిలో జైలు - స్త్రీ దృష్టిలో తనని ఆటవస్తువుగా చూసిన పురుషశాల, పురుషుడి దృష్టిలో పురిటిగది. విషం త్రాగి చావాలన్న వారి దృష్టిలో యుద్ధభూమి.

మరి దైవదృష్టిలో ? దైవంలో ఐక్యం కావడం కోసం కొట్టుకునే గుండెకాయ. అది పగిలి ఐక్యమవుతుంది. అది జీవితం పగిలి ఐక్యం కానంతవరకూ యుద్ధభూమిగా, స్మశానంగా వుంటుంది. ఆ క్షణంలో తాను విషం త్రాగి వారిముందు మరణిస్తే పరస్పరం ద్వేషించుకుంటున్న వారిద్దరూ ఆప్తమిత్రులుగా మారతారు. ఎందుకు ? వారిద్దరూ ఏకమై

తనని హత్య గావించినట్టు నేరం మోపుతారు. దాన్నుండి తప్పించు కునేందుకు వారిద్దరూ ఏకమవుతారు. ఎవరి గుండెకాయ నగిలినట్టు ? ఏది ఎందులో ఐక్యమైనట్టు ? జీవితం అంటే ఏది ?

తాయారు పుగాకు తెచ్చింది. తంబి గబగబ చుట్టచుట్టి వెలిగించాడు.

మరికొంచెం మజ్జిగ పుచ్చుకున్నాడు. మజ్జిగ లాభం లేదన్నాడు. మంచి మంచి "నిషా" మైకం కలగజేసే ద్రావకం కావాలన్నాడు. అదీ పడితే చనిపోవాలన్న భావం రాదన్నాడు.

హరిశ్చంద్రుడు, గవరయ్య - ఒకరితో ఒకరు, ఇద్దరూ కలిసి పంచుకోలేని భావం కలిగిన వారల్లే "తప్పు" అన్నట్టు సంజ్ఞచేసి, తమ అసమ్మతిని వెల్లడించారు. తంబి అర్థమైందన్నట్టు నవ్వి, బైటికిపోయి పుచ్చుకుందాం పదండి అన్నాడు. ముగ్గురూ లేచారు. వైకుంఠపాళి బల్ల, దీపం, ఆట సామాను, తాయారు కప్పగించి చెఱువుగట్టు కేసి ప్రయాణ మయ్యారు.

ఆకాశం అంచున పొగ పొరకమ్మి నక్షత్రాలు మసగగా మెరుస్తు న్నాయి. ఏమిటో సిగ్గుపడ్డట్టు ఒంపు తిరిగి మేఘం వెనక ఒత్తిగిలింది. ఇరుప్రక్కలా చెట్లు, ఒకే బంతిలో తలంటుకోసం జుట్టు విరబోసు కున్నట్టు, కదలక, గుబురుగా, అడ్డంగా నిలబడ్డాయి.

దూరంగా చెఱువుగట్టు - నిశ్చలంగా నీళ్ళు అవులించినప్పుడు ప్రేవులు బైట పడ్డట్టు రెండు మూడు పొడుగాటి కెరటపుటంచులుగా ఒడ్డుకు ప్రాకుతున్నాయి.

"మరి - డబ్బు ?" అన్నాడు తంబి.

"త్రాగుడికా ? బాగుంది." అన్నాడు హరిశ్చంద్రుడు. గవరయ్య కూడబలుక్కున్నట్టు.

"అందరం పుచ్చుకుందాం."

"ఇదోటా పైగా—రాత్రికి కూటికి లేదన్నావు," అన్నాడు గవరయ్య.

అందులో "మజా" వర్ణించాడు తంబి. అది చైతన్య రాహిత్యం - పరమాత్మలో ఐక్యం అవడంలాంటిది. కృష్ణుడు వేయిమంది గోపికలతో జలక్రీడలు సల్పినట్లు; తపస్సు ఫలించినట్లు, నేపుల్స్ పట్నం చూపినట్లు, ఎల్లోరాలో శిల్ప సౌందర్యం తిలకించినట్లు, కజురాహోలో నగ్నసుందరి ప్రాణం తెచ్చుకుని ప్రాధేయపడినట్లు—మీరింకా చూడలేదు; మీ కర్మ— ఒకర్ని ఒకరు ద్వేషించుకుంటూ, హత్య, ఆత్మహత్య గావించుకుంటూ, మృత శిశువుకన్న పురిటిమంచాలల్లె తమకి జీవితం, ఏం తెలుసు ? దిల్వారా గుడి, భువనేశ్వరం, గ్వాలియర్‌కోట, లేపాక్షి బసవన్న, ఎలెఫెంటాలో త్రిమూర్తి, టిబెట్‌లో దాలైలామా ఆధ్యాత్మిక సంపద, రాజస్థానం అడవుల్లో పులివేట, స్విట్జర్‌లండ్‌లో సింప్లాన్ గుహ గుండా రైలు ప్రయాణం—అంతుందా ఈ అందానికీ, ఈ అందానికి—అవి సాధ్యం కావాలంటె కళ్ళుండాలి, చెవులుండాలి, కొట్టుకునే గుండె వుండాలి - ఇంద్రియాలు సజీవం కావాలి. ఒక సీసాతో అవన్నీ సజీవమౌతాయి.

హరిశ్చంద్రుడు ఊహలో వూరేగుతున్నాడు. ఒక్కొక్కమాట ఒక్కొక్క చిత్తరవుని కళ్ళముందు ప్రదర్శిస్తోంది - తంబి లేడు, గవరయ్య లేడు. తాయారు లేదు. భార్య లేదు, వీధిబడి లేదు. అసలు తనే లేడు. జగత్తులో మాయ తన నీడని తుడిచేసినట్లయింది. అప్రయత్నంగా జేబులోంచి నోటు పెల్లగించి తంబి చేతిలో పెట్టాడు గవరయ్య. తనజేబులోంచి ఒక నోటుతీసి అతని చేతులో పెట్టాడు.

"ఇంకేమీ అడగొద్దు"

తంబి వెళ్ళాడు-ఇప్పుడే వస్తానని. తాయారు దీపం చెరువు గట్టున పాకలో పెట్టింది. పైకుంఠపాళీ బల్ల సిద్ధం చేసింది.

గవరయ్య తాయారుని పిలిచాడు.

"చూడు తంబికూడా వెళ్ళి: ఏం చేస్తున్నాడో, ఏం చేస్తున్నాడో చూసిరా-అతనికి తెలీకుండా వెళ్ళు" అన్నాడు. ఆమె వెళ్ళింది.

పాకలో దీపం చుట్టూ పురుగులు మూగాయి. రక రకాల కీటకాలు. వాటికేసి చూస్తున్నాడు గవరయ్య. ఇదివరకెన్నడూ అట్లా పరిశీలించలేదు. పురుగులు దీపం చుట్టూ ఒక క్రమంలో తిరుగుతున్నాయి - లెక్కల పుస్తకంలో బొమ్మలకి మల్లే సున్నాలుగా తిరుగుతున్నాయి. అవి వెలుగుని తింటాయా? అది ఆటా? అది అన్వేషణా? ఎందుకు అట్లా తిరుగుతాయి? తంబి సమాధానం ఏమిటో?

గడ్డిలో కూర్చున్నాడు. చల్లగా మెత్తగా తగుల్తోంది. చెయ్యి జాచి, వేళ్ళ సందుల్లోంచి చందమామకేసి చూస్తున్నాడు. నక్షత్రాలు లెక్కపెడుతున్నాడు! చెరువులో కెరటం ఆకృతి చూస్తున్నాడు. దూరంగా ఒక్క చేప ఎగిరిపడింది. తన గుండెలు కొట్టుకోవడం తెలుస్తోంది. శ్వాస తియ్యడం గమనించాడు. కడుపులో ఆకలివల్ల అయ్యే చప్పుడు తెలుస్తోంది. తను మరో ప్రాణయ్యాడు.

దూరంగా—మూడుగజాల దూరంలో హరిశ్చంద్రుడు, పాక దగ్గర పాతిన వెదల్పు కొయ్యకి వెన్ను ఆనించి చెట్లకేసి చూస్తున్నాడు. అతని మనసులో స్థలాలు, దృశ్యాలు, స్థూలంగా మారినట్లు, ఆలోచన ఘనీభవించినట్లు, నిశ్చలుడై కూర్చున్నాడు. గాలికి కాని కదలని చెట్లు - ప్రేమకి కాని చలించని హృదయం-కళ్ళంట నీరు త్రోసుకొస్తుంది, చెరువులో పిల్ల కెరటంలా. ఎందుకు? తనకి తెలీదు. తను తాను కాదు, మరోడు. మాటలు లేవు—శిథిలాలయంలో స్తంభాలల్లే. అంత దగ్గరగా కలవక, రాళ్ళగా మారిన జిజ్ఞాసా వర్షపు ధారల్లా అల్లా వుండిపోయ్యారు.

పైకుంఠపాళీ? విషమా? మృత్యువా? అరగంట - గంట - గంటన్నర........

తాయారొచ్చింది.

"బస్సెక్కి వుడాయించాడండీ" అంది.

పాకలో దీపం వొక్కసారి పెద్దదయి ఆరింది - చుట్టూ తిరుగు తుస్తున్న పురుగులు లయతప్పి "బప్" మని చప్పుడు చేసి చెల్లాచెదరైనాయి. తాయారు దీపం తీసుకొని వెళ్ళింది. తొందరగా నడుస్తూంది. చీకట్లో మాయమైంది:

హరిశ్చంద్రుడూ, గవరయ్యా అటుకేసి చూస్తున్నారు. వారి చూపులు కలిశాయి. ఒక్కొక్క అడుగే ముందుకి వేస్తూ నడుస్తున్నారు. దగ్గర కొచ్చేశారు. ఒకరి భుజంపైన ఒకరు తలలు ఆనిచ్చి, గట్టిగా కౌగలించు కుని అర్థంలేని కేకవేశారు. అది ఏడుపుగా పరిణమించింది. కన్నీరు సన్న గిల్లింది; నిల్చింది. ఎక్కడనుండో గాలి సణుగుతూ చెట్లని లేపుతూ, నీటిని చక్కిలిగింతలు పెడుతూ వారిని కదిపి కవ్వించి ఏకం చేస్తూ వీస్తోంది.

మేఘం తెల్లబడి, విడి, చందమామని బైటపడేసింది. నక్షత్రాలు స్ఫుటంగా, నిద్రనుండి లేచినట్లుగా మెరుస్తున్నాయి. ప్రకృతి సంతోషంతో మూలుగుతోంది.

వారిద్దరూ పట్లు వొదిలేశారు-ఒకరు మొహంకేసి వొకరు చూడలేక చూస్తూ మధ్య నిలిపి, తిరిగి చూసి, చూడనట్లు చూసి, చూసినట్టు చూస్తూ నిలబడ్డారు. కూర్చున్నారు. నవ్వుకున్నారు. ఎండిన ఆకులు గాలి గిలిగింతలకి తట్టుకోలేక త్రుళ్ళిపడుతున్నాయి. చెరువు నీరు, ప్రేమికుల జంటలుగా కెరటాలై గట్టుని పీడిస్తున్నాయి.

తిరణాల కెళ్ళినప్పుడు పాములవాడిదగ్గర, విషానికి మందు కొందా మనుకున్నా, 'వాడు కబుర్లు చెబుతూ; ఫలాన ఆయన విషం కొన్నాట్టు చెప్పాడు. నన్ను చంపుదామనే! నేను అందుకే కొన్నాస్మా" అన్నాడు గవరయ్య.

"చావడానికి విషం కావాలని తాయారుని పంపావుగా — అప్పుడే గ్రహించాను" అన్నాడు హరిశ్చంద్రుడు.

"తంబి కిచ్చింది విషం సీసా కాదు. దాన్ని వేరే భద్రంగా దాచాను. వాడికిచ్చింది తేనె సీసా. ఇంటికి వెళ్ళగానే పారెయ్యాలి" అన్నాడు గవరయ్య.

"నిన్ను చావదన్నమని తంబికి డబ్బిచ్చాను" అన్నాడు హరి శ్చంద్రుడు.

"నీదగ్గఱా లాగాడు? ఆపనే నిన్ను చేస్తానని నా దగ్గర కొంత లాగి నీ ఇంటికేసి బయలుదేరాడు. భలే కిల్లాడివాడే."

"ఏమిటో తంబిగాడి కబుర్లు, ధోరణి విన్నాక, నాలో మార్పొ చ్చింది. మనం ఎంత, మన పట్టింపులు స్పర్థలు ఎంత అనిపించింది. చూడ వల్సింది చెయ్యవల్సిందీ ఎంతో వుంది. మనం ఎప్పుడూ ఇల్లాగే వుందాం."

"త్రాగుడు మాత్రం వొద్దు - మా ఆవిడ చంపేస్తుంది" అన్నాడు గవరయ్య.

ఇంతలో తాయారు దీపం వెలిగించి తెచ్చింది.

"అమ్మగారు చప్పున భోజనాలకి రమ్మన్నారండి" అంది. వారి కళ్ళల్లో తడి, పెదవులపై చిరునవ్వు చూసి ఆశ్చర్యపడింది తాయారు. తనెన్నడూ ఎరగని సంతృప్తి ఆమె కళ్ళని వెలిగించింది.

"ఈ పూట మా యింట్లోనే భోజనం" అన్నాడు గవరయ్య

"మా ఆవిడ చంపేస్తుంది."

"నేను మా ఆవిడా, తోడొస్తాంగా" - నడుచుకుంటూ వెళ్ళారు ముగ్గురూ.

# వా  కొమ్మలు

ఎందుకో ఆ గులాబి మొక్కను చూసినప్పుడల్లా హృదయంలో వేళ్ళు పాతుకున్నట్లు సూర్యకాంతమ్మ శరీరంలో నరాలు కదలిక మానుకొంటాయి. ఆ మొక్కని చాలారోజుల కిందట ఆమె చెల్లెలి మొగుడు చంద్రకాంతం పంపించాడు. మొక్క వేళ్ళేమో పాకుతుంది కాని ఎదుగూ బొదుగూ లేదు. ఎంత జాగ్రత్తగా పెంచినా లాభం లేకపోతోంది. ఆ మొక్క తాలూకు గులాబి గులాబిని తల్లో పెట్టుకోవడం కోసం చాల రోజుల్నుంచి పూలుకొనడం గూడ మానేసింది. రాత్రంతా దాన్ని గురించే ఆలోచనలు, కలలు; సూర్యోదయం కోసం ఎదురుచూస్తూ, ఆలోచిస్తూ, ఆవులిస్తూ, భర్త గుర్రుని పరీక్షిస్తూ, నిద్రలేక మొహం వాపుతో, కళ్ళ మత్తుతో దొడ్లోకొచ్చి, ఎంతెదిగిందో చూసేసరికి, అంతే వుంది—ఎదుగూ లేదు, బొదుగూలేదు. రోజూ గంటపేపేనా దానికోసం బాధపడడం ఆమెకి అలవాటైపోయింది. ఆ వాడిపోతూ లేవలేకపోతున్న లేత ఆకులు అతని నిద్రతో బరువెక్కి, బద్దకించి, వాలిపోయిన కనురెప్పలలోని స్థిరత్వాన్ని స్ఫురింపజేస్తూ ఎంతకాలం ఆమెని కలవరపెట్టడం ?

“ఆ మొక్క పీకెయ్యండు. దానికేదో జాడ్యం పట్టింది. అది పాకిందంటే మిగతా మొక్కలుగూడ చస్తాయి. తెలిసిందా ? పంపినవాడు మంచివాడైతే అది నిక్షేపంలా ఎదుగును. మిగతావన్నీ బతకలా ? నీ చెల్లెలి మొగుడు తాలూకు విషం దానికీ పట్టింది.” అని రెండు మూడుసార్లన్నాడు ఆమె భర్త బసవయ్య. ఈ గుడ్డి నమ్మకాన్ని గెంటేసి శాస్త్రీయ సమ్మతమైన కారణం తెలుసుకోవాలని నవలలు చదవడం మాని, ’హార్టికల్చర్’ గ్రంథాలు చదవడం మొదలెట్టింది. తోట్లోకి బసవయ్య చక్కావొచ్చాడు. అతను బకాసురిడిలాంటి పెద్ద విగ్రహం. శరీరం ఆకారంలేని మాంసం ముద్దలికి చర్మం తొడిగినట్లుగా ఉంటుంది జుట్టుకి కనుబొమలకి మధ్య

సరిహద్దులాగ కాస్తంత మదురు. కనుబొమలు పొదలా ఎదిగి చెవులదాక పాకినట్లుంటాయి. కందిరీగ కుట్టినట్లు కుడికంటి కింద వాపు. తేనెటీగల పట్టుమాదిరి అర్థంలేని వొంకరులు తిరిగి వృథాగా అల్లుకున్న క్రాఫింగ్. గాలికి వూగులాడే ముసలివృక్షం కొమ్మలాంటి చేతులు. నవ్వినపుడు నవ్వునే వెక్కిరించే వెడల్పు పెదవుల వెనక ఐక్యతలేని పళ్ళవరస. ఇంటర్ కాగానే, భార్యలాగే చదువుచాలించి 'ఇన్స్యూరెన్స్' ప్రపంచంలో కృషిచేసినందుకు అధికారులు మెచ్చుకొని, తుదకు మేనేజర్ పదవి— దాంతోపాటు కారూ యిచ్చారు. ఆ కారుకి సరిపడ్డ నిండైన విగ్రహం. "ఈ మొక్క ఇంకా పీకలా? దీనికేదో పురుగుపుట్టింది. మీ చెల్లెలి మొగుడిలో కుళ్ళు దీనికీ పట్టుకుంది."

ఇట్లా చంద్రకాంతంపై భర్త ద్వేషం ప్రకటించడం ఆమెకి మొదటిమాటుగాదు. అతనితో ఎప్పుడో పెళ్ళిలో తప్ప, బసవయ్యకి పరిచయం కూడా లేదు. లేమినల్ల జనించిన అసూయ బురదలా ఎక్కడ పడితే అక్కడే వుంటుంది. భర్త ద్వేషానికి అసూయ కారణం అవడానికి అవకాశాలు లేవు. చంద్రకాంతం గొప్ప హోదాలో లేడు, అతనికసలు ఉద్యోగమేలేదు, అతనంత ఆస్తిపరుడూ కాడు, గొప్ప పండితుడూ కాడు—వొందలమంది మాదిరి అతనూ వో గ్రాడ్యుయేటు, కాంగ్రెసులో పావలా మెంబరుగూడ కాడు. మరెందుకు ద్వేషం? భర్త మనసు కాంతానికి అర్థం కాలేదు.

"ఎప్పుడూ చెల్లెలి మొగుడేనా? మీకు తోడల్లుడన్న విషయం మరిచిపోకండి. పాపం, అతనేం చేశాడు? వాళ్ళ వూర్నించి ఎవరో వొస్తే ఈ పూలమొక్కని మా చెల్లెలితో చెప్పి పంపించాడు." అంది సమర్థిస్తూ. కాంతం బ్రహ్మచారి గుండెలో తుఫాను లేవగొట్టేటంతటి చక్కంది కాదు గాని, మాట్లాడేటప్పుడు ఆకర్షణీయంగా వుంటుంది. ఛాయ నలుపే— పూర్ణిమనాటి మెత్తటి మెరిసిపొయ్యే నలుపు. మాటలతో ప్రకటించలేని

భావాలను పెద్ద కళ్ళ కదలికలో చూపిస్తుంది. 'ప', 'వ', "ఎం" మొద లైన గొంతు ముందుభాగంలోంచి వొచ్చే అక్షరాలను ఉచ్చరించినపుడు పెదవులు కొత్తపొందికని తెచ్చుకుంటాయి. మాట్లాడినప్పుడే ముక్కు-పక్కని గీత బుగ్గని కెరటంలా లేవదీసి తెరచాప చుక్కానిలాగ పెదవులకీ, బుగ్గకీ లయ కల్పుతుంది ! మొహంలోని అమాయకత్వానికి నాజూకైన బట్ట, వేషధారణ కొంత కుటిలత్వం కల్పిస్తాయి. 'ప్రీమియమ్‌లు' 'బోనసులు' 'డివిడెండ్లు' ఈ లోకంలోంచి భర్తని విముక్తి చేసే శక్తి గులాబి మొక్కకి ఉందని ఆమెకి తెలుసు. అదీ కొంత మెరిగే.

"తోడల్లుడని చెప్పుకోవడం నాకు సిగ్గుగా ఉంది. ఏదేనా ఉద్యోగంలో ప్రవేశించరాదూ ?"

" 'లా' కెడతాడట. ఏదీ—మొన్ననేగా బి.ఎ. పూర్తిచేసింది ? అందరికీ పుట్టగానే ఉద్యోగాలొస్తాయా ?"

" 'లా' కాదు. బల్ల. నా ఆఫీసులో గుమాస్తాపనికోసం లక్షమందీ గ్రాడ్యుయేట్లు సిద్ధంగా ఉన్నారు. వీళ్ళంతా దేశానికి బరువుచేటు."

"అతని ఉద్యోగం సంగతి మనకెందుకు లెద్దురూ? వాళ్ళ తంటాలు వాళ్ళు పడతారు." అంది కాంతం. చంద్రకాంతాన్ని గురించి భర్త మాట్లాడ్డం తనకి కొంత సంతోషం యివ్వకపోలేదు. ఇన్‌స్యూరెన్స్ డబ్బా మోతకంటె బోలెడు నయం. ఉద్యోగంలోపడ్డ తర్వాత మొగాడికి ఆ ఉద్యోగం గోడవే చంద్రకాంతంలాంటి నిరుద్యోగికి ప్రవర్తనా స్వేచ్ఛ, మానసిక వైశాల్యం ఉంటాయి.

"మనకెందుకేమిటి— మనకే. ఫలానా ఆయన తోడల్లుడు సందు లమ్మట తిరుగుతున్నాడంటే, సాకే నామర్దా, ఊరకే పగలంతా ఊరమ్మటా, రాత్రంతా సినిమాల చుట్టూ తిరిగి, ఉన్న రెండెకరాలూ కాస్త సిగరెట్ల ద్వారా ఊదెయ్యడం బదులు నన్నడిగితే ఏదో తంటాలుపడి 'ఖాళీ' చెయ్యిస్తాను—నా ఆఫీసులో గుమాస్తాగా చేరడం మంచిదంటాను."

"ఇప్పుడు మిమ్మల్ని ఎవరూ అడగలేదు. వెళ్ళండి, ఎవరో వచ్చినట్లున్నారు"—అంతటి మనిషినీ తన గుప్పెట్లో ఉంచుకొని, గాలిలో పూదెయ్యగలనని కాంతానికి తెలుసు. ఆ నమ్మకం ఆమెలోని ఆకస్మిక చైతన్యానికి, మార్పులకి కారణం.

భర్త బైటికెళ్ళేక కారు చప్పుడయింది. కాంతమ్మ లోపలకొచ్చి హార్టీకల్చర్ పుస్తకం బీరువామీద గిరవాటేసి, చెల్లెలి పెళ్ళి ఫోటో ముందు పెట్టుకొని కూచుంది. అందులో భర్తలేడు. ఆ కారణంచేతనే దాన్ని చూడడానికి ఇష్టపడొచ్చు. అల్లా అనిపించినందుకు నీరసంగా నవ్వుకొంది. ఈ చంద్రకాంతంలో భర్త ద్వేషించేటంతటి విశేషం ఏముందో తెలుసుకోవాలనుకొంది. పెళ్ళినాడే అతన్ని గురించి అంతా చిత్రంగా చెప్పుకొన్నారు. తనూ ఎన్నో వింది, చెల్లెలికి ఏమీ తెలియదు, అమాయకురాలు. అడిగితే ఏమీ తెలియదంటుంది. ఈ గాథల పుట్టుపూర్వోత్తరాలు భావికాలంలో మరుగుపడ్డాయి. వాటిని తవ్వి చూసేందుకు ఎవ్వరూ—భర్తకూడ—సాహసించలేదు. ఈ గాథల సారాంశం యేమిటి ? అతను తుంటరి; చెడ్డవాడు; స్త్రీ లోలుడు; నైతిక నియమాలులేని; సంఘ కట్టుబాట్లు, బాధ్యత మొదలే లేవు: రోగాలపుట్ట, మహాపాపి. వీటికి తార్కాణం అతను నిరుద్యోగి కావడమే. ఇవేమీ ఆమె అతనిలో చూడలేదు. ఆరోగ్యం అంతా అతని మొహంలో వెలుగులోనే వుంది. అతనిముందు నిలబడ్డ కాసేపూ వాతావరణం చీకటైపె, మైమరుస్తారు. బుర్ర పనిచెయ్యదు. అతనితో చెప్పేటందుకు మాటలు కన్పించవు. కుట్ర, కల్మషం, నీతి, సంఘం, మతం—అన్నీ వాటి నిరంతరయుద్ధాలని ముగించి, శాంతికోసం తడుములాడి, అతని నేత్రాలలో ఐక్యం అవుతాయి. అతను మితభాషి. గుర్రం పిల్లలోని శక్తి చాంచల్యం, మూగబలం — అన్నీ అతనిలో చూడగలిగింది. ఏవో పుస్తకాలు చదువుకునేవాడు, ఏవో బొమ్మలు గీసుకొనేవాడు, సైకిలు మీద వెళ్ళి రాత్రి పదింటికొచ్చేవాడు—అత్తారింట్లో దరఖాస్తు పెట్టమంటే,

నవ్వి సరే అనేవాడుకాని, పెట్టేవాడు కాదు. తనికి తెలియకుండా అతన్ని ఆదర్శపురుషుడుగా ఎంచుకొంది శాంతం. వెనక, ఆమె చెల్లెలు ఏదో బొమ్మ తీసుకొచ్చి "బాగుందా, మా ఆయన వ్రాశాడు" అంది. ఆ బొమ్మ తనదేనని తెలుసుకొంది, నమ్మింది. "ఎవరే ఈ బొమ్మ?" "నాదే" అంది చెల్లెలు. పిచ్చిది. వెర్రిబాగుల్ది. ఎప్పుడో, యెక్కడో తనకీ అతనికీ మూగ బాంధవ్యం కుదిరి ఉంటుంది. అతన్ని అర్థం చేసుకుంది. అర్థం చేసుకొన్న వాళ్ళే అనుభవించడానికి అర్హులు.

భర్త అతన్ని గురించి చూసిన అసూయలోనూ, ద్వేషంలోనూ, హేళనభావం, తాత్కాలిక హాస్యం పైకి ఉన్నా, వాటి వెనుక నిజమైన ఉద్రేకం, 'కసి' ఉంది. దానికి కారణం ఏమిటి? ఈ ఆలోచన్లు ఆమెను బాధిస్తున్నా ఆ బాధలో ఆనందం కూడా ఉంది. కాని దానికి ఆకారం లేదు, పరిపూర్ణత లేదు. ఎవళ్ళకీ చెప్పుకోడానికి లేదు. అవి ఏకాంతాన్ని కోరతాయి. రహస్యాన్ని కాపాడతాయి. ఎంతకాలం ఈ చీకటి, రహస్యం? కాపాడతాయి. ఎంతకాలం ఈ చీకటి, రహస్యం? ఆ మోహం ఆమెని పదేపదే కలవరపెట్టడానికి కారణం ఆమె దాని నిజాన్ని గురించి నిర్ధారణకు రాకపోవడం. ఏదో ఓ నిమిషం అనుకోవడం, దాన్ని తోసెయ్యడం. బలవంతంగా మరిచిపోవడం, అది మళ్ళా గంటలోనే ఒత్తిడి కల్గించడం సగం సగం సాగించినా ఆలోచనా, నిర్ధారణకుగాని కార్యం - యివి మనుష్యులని పీడించుకుతింటాయి. ఇందులోనించి బయటపడాలంటే బాధించే విషయాన్ని పూర్తిగా వొకసారి బ్రద్దలుకొట్టడం ఒకటే సాధనం. ఆ ఫోటోలోని మొహాన్ని బాగా పరీక్షించింది. దానిలోని లోపాలు, చెడ్డ లక్షణాలు ఏరి వల్లెవేస్తే అతని ప్రతిమ వొత్తిడి కలిగించదు. గడ్డం బాగా లేదు. బుజాలు బాగాలేవు. చెవులేం బాగున్నాయి? మీసాలు తీసేసి — ఆడ దానిలాగ — అసలు బాగాలేడు. ఇది నిజం. దీన్నే గుండెకు నొక్కి,

నిబ్బరం చేసుకోవాలి. కాంతం నిట్టూర్పు విడిచింది—ఎడారిలాగైంది మనసు. ఫోటో గోడకి తగిలిచ్చి, గూట్లోనుంచి హక్స్లీ రాసిన "వాడిన కొమ్మలు" అన్న నవల తీసింది. మళ్ళా కొమ్మలు, వాడిపోవడం....తన మీద కోపం వొచ్చింది. బయట సాయిబు 'గులాబిపువ్వులో' అని కేక వేస్తూ అమ్ముకుంటూ పోతున్నాడు. పుస్తకం గిరవాటెట్టి తలుపుతీసి, మళ్ళా చప్పుడయ్యేటట్లు మూసింది. మళ్ళా ఆమె మనస్సు ప్రాచీనశక్తుల వైషమ్యాలకి నిలయం ఐపోయింది.

* * *

చంద్రకాంతం భార్యని ఆస్పత్రిలో పరీక్ష చేయించడం కోసం విశాఖపట్నం రావలసి వొచ్చింది. అక్కగారింట్లో దిగుదామని భార్య అతన్ని చంపుకుతింది. సంఘంలో తనకి స్థానం స్థిరపడేంతవరకూ బంధువులూ, మిత్రులూ లేరని అతనెంత చెప్పినా ఆమె వినిపించుకోలేదు. పైగా, ఆ ఊరొస్తున్నారని తెలియగానే బసవయ్య తప్పకుండా వాళ్ళింట్లోనే దిగాలని ఉత్తరం వ్రాసి, వొచ్చే సమయం తెలుసుకొని స్టేషనుకి కారుకూడ పంపించాడు.

భార్యని ఆస్పత్రిలో చేర్పించిన తర్వాత అతను రోజంతా అక్కడే గడిపేవాడు. డాక్టర్లు రోజుకు 4 గంటలు మాత్రం భార్య దగ్గర ఉండేందుకు వొప్పుకొన్నా, ఎల్లాగో అక్కడే గడిపేసి, సాయంత్రం బీచివొడ్డున దిరిగి, క్లబ్బులో చీట్లాడి, రాత్రి పదిగంటలకు ఇంటికి చేరుకునేవాడు. అతనికి మేడమీద మూలగది ఇచ్చారు భోజనాల దగ్గిర మాత్రం అందరూ ఆస్పత్రి సంగతులు మాట్లాడుకొనేవారు. భోజనం కాగానే బసవయ్య కారు మీద వెళ్ళిపోతూ, చంద్రకాంతాన్ని ఆస్పత్రి దగ్గర దించేవాడు. ఇట్లా అయిదురోజులు గడిచాయి.

కాఫీ తీసుకొని మేడమీద గదిలోకొచ్చింది కాంతం. చంద్రకాంతం మంచంమీదనుంచి లేచి తటాలున కుర్చీలో కూర్చొన్నాడు. తెల్లటి

పైజామా, కంటిమెడచొక్కా, పెద్దతువ్వాలా, చిందరవొందరజుట్టూ—అప్పుడే కమ్యూనిష్టుల సమావేశం నుంచి వొచ్చినవాడిలా ఉన్నాడు.

"నాక్కూడా లేవాలా కాంతం?" అంటూ కాఫీ కప్పు బల్లమీద పెట్టింది. అతనేమీ మాట్లాడలేదు. సిగరెట్ ఆర్పేందుకు "ఆష్ట్రే" కనిపించక అటూ ఇటూ చూస్తున్నాడు. కాంతం తలవొంచింది. గుమ్మం లోంచి గిరవాటెట్టాడు.

"కాఫీకిముందే కాల్చాలా ఆ వెధవ సిగరెట్టు!"

అతని పెదవులకేసి చూసింది, సిగరెట్టు కాల్చకుండా ఉంటే అవి నిజంగా గులాబిరేకుల్లా ఉండుననుకొంది.

"సిగరెట్టు నా పాలిట దైవం. అది లేకపోతే నాగరిక ప్రపంచంలో క్షణం బ్రతకలేం—"

"ఎందువల్ల?"

"పొగ, దుమ్ము, క్లోరోఫారం, తారువాసన—నేటి లోకంవేగంతో సమంగా వెళ్ళలేక క్రుంగిపోతున్న నరాలకి జీవంపోసే నిప్పుకణం."

"సరే—ఇవన్నీ నీకొక్కడికేనా యేమిటి? మావారు కాల్చరేం?"

కాఫీ చప్పరిస్తూ ఆమెకేసి కోలగా చూశాడు. "మీ ఆయన మహానుభావుడు. మానవీనత్వం అనే జబ్బు తగల్లేదింకా. అతనికి సమస్యలు లేవు. సందేహాలు లేవు. నోరులేని బాధలూ లేవు, సంసారం హోదా, సంఘంలో స్థానం, మంచి పెళ్ళాం, కారు, ముఖ్యంగా డబ్బూ - అన్నీ ఉన్నాయి. అవి నాకు లేవు గాబట్టి, సిగరెట్టుతో తృప్తిపడతా."

కాంతాని కిట్లాంటి మాటలు విని చాల కాలమైంది. ఎప్పుడో కాలేజీలో ఉపన్యాసకుడి ద్వారా వింది. 'మంచి పెళ్ళాం' అనడంలో తను పెళ్ళాంగా మంచిదో, వ్యక్తిగా కోరదగిందో అతని తాత్పర్యం బోధపడ లేదు ఆమెకి.

"మా చెల్లెలు మంచి పెళ్ళాం కాదూ?"

"మొగుడు మంచివాడైతేనే పెళ్ళాం మంచితనం లెక్కలోనికొస్తుంది."

క్షవరం దుకాణం చాపమీద పరిచాడు.

"మానవత్వాని కివన్నీ ఉపకారాలు."—కాంతం వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తీసుకొచ్చింది.

"మీకెందుకీ శ్రమ ? బంట్రోతు తెచ్చునుగా ?"

"చంద్రం ! నన్ను మీరనడం దేనికి ?"

"ఒదినగారు—అందులో చదువుకొన్నవారు."

"చాల్లే—నీదంతా చిత్రం. అయితే నీ నవీనత్వంలోకి నేనూ వొస్తానా ?"

"మీరట్లా అడిగితే చెప్పలేను. నవీనత్వానికి లక్షణాలు చెపుతాను. అందులో ఉన్నారో, లేరో మీరే చూసుకోండి. మొదటిది - ఫలానా పనీ అని ఉండగూడదు. ఏ వొక్కదాంట్లోనూ సంపూర్ణమైన పాండిత్యం ఉండగూడదు. మతం, దైవభక్తి అసలు పనికిరావు. సంప్రదాయాలు, ఆచారాలు, పెద్దలు, ఆధ్యాత్మిక పిచ్చి—వీళ్ళు నూకు శత్రువులు. చరిత్రని చింపిపారేశాము. పొందిన వొస్తువుతో తృప్తిపడగూడదు, అనుభవించగూడదు. మార్పు మా మతం. ఈనాడున్న ఆదర్శాలు రేపుండవు. జీవితపు విలువలు లేవు. ఏదో ఆశిస్తాం—అదేమిటో నొక్కిచెప్పలేం. ఏవో బాధపడతాం, అదెవ్వరికీ అర్థం గాకూడదు. తొందర, తమాషా, తారుమారు, తాత్కాలిక తన్మయత...."

కాంతం ఆవలించింది. నవ్వింది. ఇది సిద్ధం చేసిన ఉపన్యాసంలా ఉందికాని, సహజమైన వాక్కా ! అతని తెలివిని, చమత్కారాన్ని తను ప్రదర్శించాలని యత్నిస్తున్నాడా ? అట్లా యత్నించడంలో ఉద్దేశ్యం ? ఏదో ఆమెలో కొత్త ఆశ ఉద్భవించింది. ఈ ఆశాభవనానికి పునాదుల నిర్మాణం ప్రారంభించాలి. ఏం చెయ్యాలో ఆలోచించడానికి దిగి వెళ్ళి

పోయింది. అతను భోజనం కాగానే వెళ్ళిపోయి, రాత్రి భర్త వొచ్చింతర్వాత కాని రాలేదు.

మొర్నాడు ఉదయానే లేచి బసవయ్య రాత్రికి రానని చెప్పి వెళ్ళిపోయాడు. శాంతం, ఏడింటికి కాఫీ కప్పుతో మేడమీద గదికి వెళ్ళింది. అప్పుడే స్నానం చేసిన తడి ఆ తెల్ల సిల్కుచీరలోంచి చల్లదనాన్ని వెదజల్లుతోంది. సూర్యకాంతి మధ్య పాపిడిగుండా నుదుటిమీద గీతలా పడింది. ఆకలి, సంతృప్తి—రెండూ ఆమె బాల్యపు సౌందర్యం మొయ్యలేని శక్తితో కళ్ళద్వారా కలత కనపరుస్తున్నాయి. ముడుచుకొన్న పెదవుల మడుగులో సంకల్పం వుంది.

"ఎప్పుడు తీసుకొస్తావు మా చెల్లెలిని ?"

"రేపే—ఏమీ భయపడవలసిన జబ్బు కాదన్నారు డాక్టర్లు."

"నువ్వింకా లేవలేదేం."

అతను మంచం మీదే వోరగా కూర్చొని దిండ్లమీద మోచెయ్యి ఆనించాడు. నిద్రలేక ఎరుపెక్కిన కళ్ళు, యాత్ర సాగించి, మోసపోయి, విరాళం పొందిన మొహవర్చస్సు—అతను వ్యాధిగ్రస్తుడు.

"నా కివాళ వొంట్లో ఏమీ బాగలేదు."

"అయ్యో, పాపం! హాస్పిటల్ నే వెళ్ళి చూసొస్తాలే....ఏం తలనొప్పా ?" దగ్గరగా వొచ్చింది. మంచం బద్దీమీద ఆనింది.

"ఫలానా అని చెప్పలేను. మగతగా వుంది - తిండి మానేస్తే అదే పోతుంది లెండి."

కాసేపు నిశ్శబ్దం."

"ఆ కుర్చీమీద కూర్చోండి. మీరల్లా నిలబడ్డం నా కిష్టంలేదు" అన్నాడు నీరసంగా. కూర్చుంది. పాదాల పైకి లేచిన చీర కుచ్చెళ్ళను కిందకు లాగింది. చెంపకింద చెయ్యేసుకొని అతని కళ్ళలోకి దీర్ఘంగా చూసింది. అదరిపాటుతో అతను దృష్టిని మరల్చుకొన్నాడు.

"ఐతే చంద్రం....మా చెల్లెలు వొక బొమ్మ చూపించింది. అదీ నాదే....నేను వెయ్యడగ్గ—అబ్బ! ఎల్లా అనాలో రావడంలేదు-వేసేటందుకు కాదు—వేసేటంతటి—బాగా ఉన్నానా? సిగ్గుతో కనురెప్పలు వాల్చింది. అతను నవ్వాడు.

"అదా—అది మీదికాదు. మీ చెల్లెల్ని వేద్దామనుకొంటే అట్లా తయారైంది."

"నువ్వు ఏ ఉద్దేశ్యంతో వేస్తే అల్లా తయారైందరో"

"చెప్పాగా నా కుద్దేశాలూ, అభిప్రాయాలూ, లేవని."

"కాదు, నాదే వేద్దామని సంకల్పించావు."

"కావొచ్చు. నాకు తెలీకుండా నా ఆంతరంగికం అనేక పన్లు చెయ్యిస్తుంది. వాటిలో ఇదీ వొకటి కావొచ్చు."

"నీ ఆంతరంగికంలో అప్పుడు నే వుండి వుండొచ్చు."

"సుప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త ఫ్రాయిడ్‌గారి శిష్యురాలిలా వున్నావు."

"నాకు గులాబిమొక్కను పంపించావు. ఈ రెండు కూడితే ఏం తేల్తాంది?" అని ప్రశ్నార్థకంగా చూసింది.

"విషమ పరీక్ష. డాక్టర్ వాట్‌సన్‌గారి నీడ గాలి....బొమ్మ నా సృష్టి. గులాబి ప్రకృతి సృష్టి."

"ఈ రెండూ నన్ను గురించి....నాచే ఆకర్షించబడ్డ సృష్టి...."

అతను పక్కకు తిరిగి సిగరెట్టు ముట్టించాడు. ఇదంతా నిజమై వుండవొచ్చునన్నట్లుగా తెల్లబొయ్యాడు. నీరసంతో మూలుగుతూ దిండు మీద తల ఆనించాడు.

"చంద్రం, నాకెందుకో తెలుసా ఇంత దిగులు? నువ్విచ్చిన గులాబిమొక్క వాడిపోతోంది. అది యెదగడం లేదు. మొగ్గ వెయ్యడం లేదు—దానికేసి చూస్తే నువ్వే జ్ఞాపకానికొస్తావు. నీ పూర్వపు చరిత్ర వాడి

పోయినట్లుగా—ఎంతోమంది నీకు నీళ్ళు పోశారు, దువ్వారు, లాగారు—లాలించారు....వాడిపొయ్యావు....నాకు దాన్నీ, నిన్నూ బతికించాలని...."

అతను భయంతో కళ్ళు పెద్దవి చేశాడు. ఆమె లేచి అతని దగ్గరగా వెళ్ళి నుదుటిమీద చెయ్యేసింది. కాలిపోతూంది. నిమిరింది.

"ఆ మొక్క ఎందుకు పుష్పించదో చెప్పవూ ?"

"కొన్ని కొన్ని గులాబీలు నీళ్ళతో పుయ్యవు....దాన్ని రక్తంతో పెంచాలి" ఆమె వ్రేళ్లు అతని జుట్టులో దాచుకొంది. అతను వాటిని తొలగించాడు.

"మీరిట్లా చేస్తే మీ నౌకరీ పోతుంది...."

"నాకేం నౌకరీ ?"

"భార్యగా వుండడం. హిందూ లా ప్రకారం వొకసారి స్త్రీని ఉద్యోగంలోంచి తొలగించిన తర్వాత మళ్ళా ఎవ్వడూ కుదుర్చుకోడానికి వీల్లేదు, ఆ మొదటి యజమాని బ్రతికి ఉన్నంతవరకూ."

"నౌకరీ పొట్ట కోసం. కాని హృదయం ఆత్మ."

"అవి మాకు లేవు. బిహేవియరిష్టు వాట్సన్ దొరగార్ని అడగండి. శరీరం ప్రమాదంనుంచి కాపాడుకునేందుకు వాటిని కల్పించుకొంది."

"నాకుంది."

"అది వున్నవాడినే చూసుకోండి. మీ భర్తగారికి చాలా విశాలమైన హృదయం ఉండి ఉంటుంది—శరీరంలాగే."

కాంతానికి కోపం వొచ్చింది. భర్తంటే ఇతనికీ అసూయ, ద్వేషం. పురుషులందరూ అంతే. ఎందుకో. కాని ఆ అసూయకు కారణం తను గాదు.

"కాదు చంద్రం—నీకు హృదయం వుందనుకొన్నాను. నిన్ను నేను అర్థం చేసుకొన్నాను."

"అది భ్రమ. అర్థం చేసుకొనేందుకు నాలో ఏమన్నా మహత్తర

రహస్యం వుండేగా. మాకు హృదయాలు లేవు—బుర్రలున్నాయి. శరీరాలున్నాయి. బుద్ధి వుంది. జ్ఞానం లేదు. పావలావ్ (Pavlov) ని అడిగితే అది లేదంటాడు. మేం అంతర్జాతీయ అజ్ఞాతవాసులం; రాజకీయ జంతువులం; ఆర్థిక పశువులం. సారస్వత చిలకలం; చారిత్రాత్మక గబ్బిలాలం; మరమనుషులం. నేను పెట్రోలు వాసన, సిగరెట్ పొగ; ఫ్యాక్టరీ రొద, ఐడోఫారం కంపు—నీ యిష్టం, మానవుణ్ణి మాత్రం కాను."

ఇదంతా ప్రగల్భంగా. వంచింపుగా తోచింది ఆమెకు. మరో రాయి విసిరింది. "ఇవన్నీ నువ్వు కావొచ్చు. మరి నేను....నా ప్రేమ...."

"అవి భాషకి సంబంధించిన సమస్యలు. రిచ్చర్డ్స్ (Richards), ఆగ్డన్ (Ogdon) దొరగార్ల నడగాలి. ఆ మాటలో ఎంత విలువ వుందో, ఎంత పరిణామం వుందో నాకు తెలియదు...."

"నా సౌందర్యం."

అతను లేచి కూర్చొని ఆమెకేసి తీవ్రంగా చూశాడు. "మేం సౌందర్యానికి చలించం. దీన్ని పూర్వీకులు వర్ణించి వర్ణించి దుంప దెంచారు. నిజంగా చూసేప్పటికి దాన్లో కొత్తదనం పోయింది. నేను ప్రేమించడం మరిచిపోయి చాల కాలయింది. హెలెన్, అనార్కలి, క్లియోపాత్రా, శకుంతలా, గార్బోలాయ్—వీళ్ళే మా కలలని బాధిస్తాయి...."

కాంతానికి కోపం మరింత ఎక్కువైంది. ఇవన్నీ నిజంగా అన్నవో, పరిహాసానికో తన కర్థం కాలేదు. ఈ పిచ్చి ధోరణినిబట్టే, అంతా యితన్ని గురించి అట్లా అనుకుంటా రసుకుంది. అతనితో వాదించింది, బ్రతిమిలాడింది. జరిగిపోయిన సంగతులు తవ్వింది. అతను కత్తి మీద హాయిగా నడవసాగాడు. ఉడుకులోన్ సీసాకోసం కిందకెళ్ళింది. తెచ్చి గుడ్డమీద పోసి నుదుటిమీద వుంచింది.

"నన్ను మీరిట్లా తాకడం దారుణం. అందులో బాధలున్నాయి."

"నీ కిట్లాంటి అనుభవం లేనట్టు మహా!"

"లేక కాదు, అవి వేరు. అవి మూణ్ణాళ్ళ ముచ్చట కాదు. పిల్లలు లేని స్త్రీ నాతో కాలక్షేపం చెయ్యడంకాదు. సంస్థల్ని వెక్కిరించడం కాదు. మా పిచ్చిలోగూడ కొంత తర్కం, మార్గం లేకపోలేదు. మీ విషయం వేరు. ఇదొక మంట—జ్వాల. వేళ్ళు పెడితే మండి భస్మమైపోతాను. పాపానికి వేతనం మృత్యువు. నాకు కొంతకాలం బ్రతికి సూర్యోదయాన్ని చూస్తూ ప్రేమతో వొణికిపోవాలనుంది."

పక్కకి తిరిగి మూలగడం మొదలెట్టాడు. చారు కాచి తీసుకొస్తానని వెళ్ళిపోయింది కాంతం.

* * *

మధ్యాహ్నం 3 గంటలైంది. ఓవల్టీన్ పట్టుకొని కాంతం మేడ మీద కొచ్చింది. అతను నిద్రబోతున్నాడు. కళ్ళకింద తడి కనిపించింది. ఉడుకులోన్దో—అనురాగానిదో తెలియదు. హెలెన్, క్లియోపాత్రా, శకుంతలా ఆమెను పీడించుకుతిన్నారు. ఏదో చెయ్యమని పురికొల్పారు. నిద్రలో వున్న శరీరానికీ, బుద్ధికీ మహత్తరమైన యెడబాటు. గాలి లేని ప్రకృతిమాదిరి నిశ్చల సౌందర్యాన్ని ప్రకటించుకొంటుంది. యుగాలనాటి కొండశిఖరాలు, సెలయేళ్ళు, భూమిలో మరుగుపడ్డ మానవుడి యెముకలు, వేళ్ళు పాతుకుని పుష్పించలేని గులాబిమొక్క — కాంతాన్ని ఐక్యతకి రగిల్చాయి. సంసారసంస్థ సోడిచ్చాన్ని నిలబెట్టిన తెర చిరిగింది. ఆమె భార్య కాదు; వొదిన గాదు; అనంత వ్యక్తిత్వంతో మండిపోతున్న నరాల కుప్ప; అమరతకోసం అంత రాయాలని మంటగలిగిన సృష్టి కర్త. అధరాలని అతని బుగ్గకి తగిల్చింది. రెప్పలు పైకి కదిలాయి. పక్కనుంచి మసక ప్రవాహంలా జారింది; ఇంద్రియాలలో రక్తం పిచ్చిగా తిరుగాడుతోంది.

"ఛీ, ఛీ సిగరెట్టు కంపు...." అతని నోరు కప్పింది. పెనుగు లాడాడు.

"కాంతం! మాకు అమరతనిచ్చేది ఉదుకులోన్‌గాని అధరాలుకావు, అది లేకపోతే యీ పాపపు పెదాల వాసనలో పెట్రోలు, తారువేగం, గొడవ, హోరు, రొద, టి. వి. దుమ్ము—వొక్క-క్షణం వుండలేను."

కాంతం శరీరంలోని మూలలు, వొంకర్లు, కోణాలు—అన్నీ ముక్కలై, యీడిగిల పడిపోయాయి. తను ఏదో ప్రాచీన ప్రపంచంలోకి వెళ్ళింది—అక్కడినుంచి యీ దౌర్భాగ్యుడు కిందకు గెంటాడు. అతన్ని మంటలో పడేసి చర్మం వొలవాలనిపించింది; కోసి రక్తం తీసి గులాబి మొక్కకి పొయ్యాలని వుంది—("కొన్ని గులాబీలకు రక్తం పోస్తేకాని పుష్పించవు") పెనుగులాటలో ఓవల్టిన్ కప్పు కిందపడి పగిలింది.

"అయ్యో—సాయంత్రం బజార్లో మరోటి కొంటాలెండి—మీ వారితో చెప్పొద్దు."

కాంతం కసితో చూసింది అతన్ని—అశాభవనం గాజు కప్పులా కూలి ముక్కలైంది.

"మీ చెల్లెల్ని ఇవాళ తీసుకెళ్ళొచ్చునన్నారు. కారు సిద్ధంగా వుంటే యిప్పుడే వెళ్ళివస్తా" అన్నాడు.

కాంతం చరచరా మెట్లుదిగి వెళ్ళింది. బైటకొచ్చింది. కారు డ్రైవరు ఎనమండుగురు పిల్లల్ని పోగుచేసి, 'చడుగుడి' ఆడిస్తున్నాడు. కారు సిద్ధం చెయ్యమని చెప్పింది. మరో కప్పుతో మళ్ళీ పైకెళ్ళింది.

"ఏదో చప్పుడైందే?" అన్నాడు చంద్రకాంతం.

"నా చేతుల్లోనే అద్దం పడి పగిలింది." తను అద్దంలో మొహం చూసుకొన్న విషయం చెప్పినందుకు పెదవి కొరుక్కుంది. "ఫరవాలేదు, మావారి డబ్బంతా యింట్లో కప్పులకీ, అద్దాలకీ అవుతుంది.

"చాలామంది మొగాళ్ళ కంతేలెండి. కోతిని పెంచుకొనే వాడు అది పగలగొట్టే అద్దాలకేనా ఖర్చు పెట్టొద్దా—అని వొకాయన అన్నాడు."

ఈ వాక్యం వినిపించుకోకుండానే దిగి వెళ్ళిపోయింది కాంతం. హాస్పిటల్‌కి తనూ సిద్ధమైంది. కార్లో వెళ్ళారు. చంద్రకాంతం భార్యని కార్లో ఎక్కించుకొని సముద్రపు వొడ్డునే వొస్తుంటే బసవయ్య కని పించాడు. అతనూ కార్లో ఎక్కాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. బసవయ్య మాత్రం కార్ల ఇన్‌స్యూరెన్సుని గురించి డ్రైవర్‌తో గుక్కతిప్పుకో కుండా లెక్చరిచ్చాడు.

"ఇదుగో—రేపు సముద్రస్నానం చేస్తామా, చాల కాలమైందీ చేసి ?" అని అన్నాడు బసవయ్య.

"అమ్మో నాకు భయం" అంది మరదలు.

"మీరొద్దు. మేం మొగాళ్ళం వెళ్తాం" ఎవళ్ళూ సమాధానం చెప్ప లేదు. రాత్రి చాలాసేపు మాట్లాడింది సూర్యకాంతం భర్తతో.

* * *

మొన్నాడు ఉదయం 6 గంటలకు నలుగురూ కారు మీద సముద్రపు టొడ్డుకు వెళ్ళారు. కారు దిగి దూరంగా యిసకలో ఫర్లాంగు దూరం నడిచి, చాప పరిచారు. తువ్వాళ్ళు, రెండు గొడుగులు తీసుకొచ్చి డ్రైవరు కారు దగ్గర కెళ్ళిపోయాడు ఎర్రటిముద్ద నీటి అంచుమీద లేచింది. మంచు నుండి విముక్తి పొందడానికి యిసుక కణాలు కాంతితో విప్పారుకొన్నాయి. ప్రకృతి తన అలంకారాన్ని అలజడిలోనూ, పక్షులు పిచ్చిపాటలతోనూ ప్రమోగించుకొంటోంది.

బసవయ్య, చంద్రకాంతం నీళ్ళదగ్గరికి నడిచి పొయ్యారు. కాంతం, చెల్లెలూ ఇసకలో దూదుంపుల్ల ఆడుకొంటున్నారు.

"నాకీత రాదు, నీ కొచ్చునా ?" అని అడిగాడు బసవయ్య.

"సముద్రంలో ఈతేం ప్రయోజనం ? ఐనా నా జీవితానికి విలువ లేదు. భీమా కూడా చెయ్యించలేదు."

బసవయ్య బిగ్గరగా నవ్వి చొక్కా తీసి నీళ్ళలోకి నడిచాడు. పది హేను గజాలు వెళ్ళి మూడుసార్లు మునిగాడు.

"లోతులేదే—రా, ఫరవాలేదు." చంద్రకాంతం దగ్గరగా వెళ్ళాడు. బసవయ్యని చిన్న కెరటాలు కదల్చలేవు. చంద్రం కాళ్ళకి ఇసుక తగలడం లేదు. నీళ్ళలోకి చూస్తుంటే చిత్రమైన అనుభవం కలుగుతుంది. మంచు కరిగి కొండ శిఖరం విరిగిపడ్డట్టూ, పాదాలకింద భూమి ఎక్కడికో తీసు కెడుతున్నట్టూ, లోకం గిరగిర తిరుగుతూ శూన్యత్వంలోకి గిరవాటెట్టి నట్టూ భయమేస్తూంది. మానవుడి అల్పత్వం, అనావశ్యకత—అన్నీ తెలుస్తాయి సముద్రంలో మునిగినవాడికి.

పెద్దకెరటం, చిన్నవాటిని నురుగుతో సహా లొంగతీసుకొని ఇసుక గుహలను పెల్లగించి, వొడ్డున బ్రద్దలై, కిరీటం లాంటి నురుగుని చీర మాదిరి ఆరేసింది కాని బసవయ్యని అంగుళం కదపలేదు. కాని అతనికి లోపలికి జారుతున్నట్లు 'అనుమానం తట్టింది. ఒడ్డివెంపు నడిచాడు. శక్తిని పోగొట్టుకొన్న పెద్ద కెరటం ఇసుకతో దొర్లుకుంటూ అతన్ని పది గజాలు తీసుకెళ్ళింది. ఇంకా నడిచాడు.

"ఇక్కడ గూడ భూమి తగుల్తోంది—" అన్నాడు చంద్రకాంతం నురుగులా తేలిపోతూ.

కెరటాలు అల్పగంతలు: నాట్యం మానుకుని, పెద్ద పెద్ద నీటి ఆవరణాలను ఊరించుకొని, లోలోపల భయంకరంగా కదులుతున్నాయి. పాముపడగలా నాలుకలు జాపుకొంటూ క్రూరంగా బసవయ్య దృష్టిని తారు మారు చేస్తూ తీసుకుపోతున్నాయి. అతను ప్రపంచానికి దూరమైపోతు న్నాడు. నీళ్ళు తాగుతున్నాడు. చేతులను రెక్కలు విరిగిన పక్షిలా కొట్టు కొంటున్నాడు. ఒడ్డు కనిపించదు. మనుషులు కనిపించరు, ఆకాశం, సముద్రం అంతా ఒకటే—తన నిర్మూలానికి కలసి పెనుగులాడు

"చంద్రం....దా....దా....అందు—" ఏదో ధ్వనులు చేశాడు. బాధలో వున్నవాడి మూగభాష—జీవం నిశీథంలో శ్మశానవాటికలో అరచే

కడసారి అరుపు. చంద్రకాంతం వొచ్చి ఇతని దగ్గర పడ్డాడు. బసవయ్య జుట్టుని పళ్ళతో పట్టుకున్నాడు; చేతులతో అతని మెడ గట్టిగా బిగించి అతని కళేబరాన్ని మీదేసుకుని వెల్లకిలబడి వూపిరి బిగించి, గుప్పిళ్ళతో నీటికన్య స్తనాలపై కొడుతూంటే, ఒక పోకిరీ కెరటం విప్లవం చేసి బయట పడి, ఆ వ్యక్తులని వొడ్డుకేసి ఐదు గజాలు వూపి గిరవాటెట్టింది. భూమి తగిలింది ఒడ్డున పడ్డాడు బసవయ్య. అతని పొట్టమీద అడుగేసి తొక్కాడు చంద్రకాంతం, శరీరాన్ని మాలీసుచేశాడు.

సూర్యకాంతం దూరాన్నుంచి చూసి గబగబ నడిచి చక్కా-వొచ్చింది.

"ఏమీలేదు — ఆయనకి అలుపొచ్చింది" అన్నాడు చంద్రకాంతం.

"అంతేకదా — ఏదో అని హడలిపోయాను."

అతను తన భర్తని యేమన్నా చేశాడేమోనని కాంతం భయపడింది అసూయతో బాధపడుతున్న పురుషుడు ఎంత ప్రమాదమైనా చేయగలడు. చంద్రకాంతం సముద్రంలో కొట్టుకొనిపోతే ఎంత బాగుండును! ఏమిటి తనకీ ఆలోచనలు!

"చంద్రకాంతం లేకపోతే నాపని ఈ మాట హుళక్కే-" అన్నాడు బసవయ్య ఆయాసంతో.

అంతా ఇంటికి చేరుకున్నారు. ఆ సాయంత్రం వెడతానని చంద్రకాంతం భార్యని ప్రయాణం కట్టమన్నాడు. బసవయ్య బలవంతం మీద మొన్నాడు వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. రాత్రి భోజనానికి బసవయ్య కోసం కాచుకుంటూ చంద్రకాంతం హాల్లో కూర్చున్నాడు. అతని భార్య స్నానానికెళ్ళింది. తొట్టిస్నానం. గంటకిగాని రాదు. మల్లెపూలు, కొప్పులో సర్దుకుంటూ కాంతం చక్కా-వొచ్చింది.

"నువ్వు లేకపోతే మావారు కొట్టుకుపోదురటగా —"

"సరే, నే లేకపోతే ఆయిన స్నానానికే వెళ్ళి వుండరు...."

"ఆ దయ నా మీదా, ఆయన మీదా?" అంటూ వీధి తలుపు మూసింది.

"నా కెవళ్ళమీదా దయాదాక్షిణ్యాలు లేవు. ఆయన బ్రతకడంవల్ల ఇన్‌స్యూరెన్స్ ప్రపంచానికేనా ఉపయోగం వుంది. నావల్ల ఏం ప్రయోజనం వుంది లోకానికి ?"

"నాకుంది."

"అది నీ స్వార్థం. పైగా ఆయన కొట్టుకుపొయ్యాడంటే ఏమౌతుందో తలుచుకొంటే భయమేస్తుంది. అంతేకాని నాకు త్యాగంలోనూ, పరోపకారంలోనూ నమ్మకం లేదు...."

కాంతంలో రేకెత్తిన ఆశాపుష్పం వాడింది.

"చంద్రం....నువ్వు కావాలి — ఒక్క నిమిషం నన్ను నీ చేతుల్లో పట్టుకోవూ."

"నువ్వు ఆటవొస్తువి కావు. స్త్రీవి. నాకు వుద్యోగం లేకపోవడంవల్ల కదా నాకీపని కల్పించావు. లేదు, ఒదినగారూ. నాకు ప్రేమించేటందుకు తీరుబడి లేదు. ఆ విలాసం మీబోంట్లకు. ఉద్యోగం, ధనం, సంసారం, సంఘంలో స్థానం, పిల్లా మేకా పోరూపొంచూ లేక హాయిగా కావలసినంత విశ్రాంతి వున్న మీకు అది తగిన కాలక్షేపం. భారత దేశంలో తిండి లేదు. నాగరిక ప్రపంచంలో ప్రేమలేదు. అందుకనే నవయువకుడికి శాంతి లేదు."

"ఈ దేశంలో నాగరికత లేదంటే నవ్వు వొస్తుంది. పోనీ నాకేనా లేదంటావా ?" అని అడిగింది కాంతం.

"ఆకలి తీరని దేశానికి నాగరికతతో నిమిత్తం లేదు. నాకాకలి తీర లేదు. బాధగా వుందని లోకానికి బిగ్గరగా చెప్పుకొనేవాడు నాగరికుడు కావొచ్చు. ఆకలి బాధ తగ్గిన తర్వాత ధనవంతులు నాగరికతలో విలాసాలతో స్వేచ్ఛగా వ్యవహరిస్తారు. స్వేచ్ఛా జీవితం అవలంబిస్తేనే కాని

నవీసులు కారేమోనన్న భయంవల్ల ఘనవంతులు, ఘనవంతుల భార్యలు నాగరికతని ఆచరణలో పెడతారు."

కాంతానికి ఒళ్ళు మండింది. భర్తతో చెప్పి ఈ దౌర్భాగ్యుణ్ణి సముద్రంలో ముంచలేకపోయానన్న విచారం కలిగింది.

"చంద్రకాంతం, నిన్ను నేను పరిశోధించానేగాని నిజంగా నిన్ను ప్రేమించాననుకొన్నావా ?"

"నన్ను నువ్వు నిజంగా ప్రేమించావని నమ్మేటంతటి ఖంఠనికాను. పైగా ఈ వేగంగా కదిలిపోయే ఆధునిక ఆర్థిక యంత్రం చక్రాలక్రింద ప్రేమ, సౌందర్యం, సత్యం—అన్నీ ముక్కలు ముక్కలైపొయ్యాయి. వాటిని అతికించాలంటే జిగురుబుడ్డి కొనేటంతటి డబ్బుగూడలేదు నా దగ్గర. నీకది చేతగాదు."

ఇంతలో వీధి తలుపు చప్పుడైంది అంత బిగ్గరగా తలుపు తట్టేది బసవయ్య తప్ప మరొకరు కాదని కాంతానికి తెలుసు.

మొన్నాడు సాగనంపడానికి బసవయ్య, భార్య కారులో స్టేషనుకి వెళ్ళారు. సూర్యకాంతం, చెల్లెలూ బండిలో కూర్చున్నారు. చంద్రకాంతం ఇంజన్ దగ్గర నిలబడి దాని పొగరుమోతు బలాన్ని పరీక్షిస్తూ నుంచున్నాడు. బసవయ్య గార్డుతో మాట్లాడుతున్నాడు—భీమా చెయ్యమని చంపుకుతింటూ.

"ఏమె—మొన్న సముద్రంలో మీ బావ లేకపోతే నీ మొగుడు పని ఏం జరుగును....?"

ఇంతలో బసవయ్య చక్కావొచ్చాడు.

"అదేమిటి తలక్రిందులుచేసి చెబుతున్నావు ? అతను లేకపోతే నేనేమౌదును...."

మళ్ళా గార్డు సంజ్ఞచేస్తే వెళ్ళిపోయాడు. బండి కదలే టైమయింది. చంద్రకాంతం పెట్టె దగ్గరకొచ్చాడు.

కాంతం బండిలోంచి దిగింది.

"ఇదిగో చూడూ" అన్నాడు చంద్రకాంతం, భార్యని సంబోధిస్తూ. "మీ బావతో యితర మొగాళ్ళని గురించి చెడ్డగా చెప్పొద్దని కొంచెం చెబుదూ."

"ఎవరితో" అంది అతని భార్య.

అదే, మీ అక్కతో. కొంతమంది స్త్రీలకి చెడ్డమొగాళ్ళకంటే చాలా మోజు కాబోలు."

రైలు కదిలింది, బసవయ్య తన అరటిబొందలాంటి చేతిని వూపాడు.

ఇద్దరూ కార్లో యింటికొచ్చారు, కాంతం కార్లోంచి దిగి గబగబా తోటలో కొచ్చింది. చంద్రం పంపిన గులాబి మొక్కమీద వో మొగ్గ లేచింది. కాంతం ఆ మొక్కని వేళ్ళతో సహితంగా పెరికి, దూరంగా గోడవతల గిరవాటెట్టింది. పాదంతో ఆ స్థలాన్ని చప్టాలా చేసింది. బసవయ్య ఆ పారేసిన మొక్కను చేత్తో తీసుకొని దొడ్డివెంపునుంచి చక్కా వొచ్చాడు.

"ఇదేమిటి, ఈ మొక్కని ఎవరు పారేశారే ? పువ్వుకూడ పూసింది ?"

"నేనే. దానికేదో అతనిలాగే జాడ్యం, మీరు చెప్పినవన్నీ నిజమే న్మండీ—అతను చాలా...."

"ఏమీ లేదు. చాల మంచివాడు." అని బిగ్గరగా నవ్వుతూ ఆ మొక్కని మళ్లా పాతడానికి సంకల్పించాడు.

"క్రాక్ అంటాను" అంది.

"క్రాక్ కావొచ్చు— కాని మంచివాడే...."

# కవిరాజ విరాజితము

అత్తవారింటి కెళ్ళటం మోజు వివాహం జరిగిన నాలుగేండ్లు వుంటుందేమో! ఆ తర్వాత ఏదైనా పనుంటే తప్ప, వారు పిలువనూ పిలువరు, వీరు వెళ్ళనూ వెళ్ళరు—భార్యను పుట్టింటిలో దిగబెట్టవలసిన సందర్భాలు వస్తే తప్ప. పుట్టింటివారు స్థితిపరులయితే, దగ్గరుండి తీసుకు రావలసినవారే, ఎవర్నో పంపుతారు. భర్త స్థితిపరుడయితే, భర్తను తప్పకుండా తీసుకెడుతుంది భార్య. ఉభయులూ అంతంతమాత్రం వారైతే, అవతలవారికి ఉన్నంతలో ఏదో మట్టచెప్పాలనీ, కాస్తో, కూస్తో రాబట్టుకోవాలనీ, కూడబలుక్కుని వెళ్ళటం, లాంఛనం, అంతరాయం లేకుండా కొనసాగుతుంది.

నేనల్లా వెళ్ళాను అత్తవారి వూరు. అది బాగా పల్లెటూరు. వెళ్ళగానే నలుగురు పెద్దలూ స్వాగతమిస్తారు. పరామర్శిస్తారు. వారి పరామర్శ రెండు ప్రశ్నలతో పూర్తి అవుతుంది. 'ఎప్పుడొచ్చారు?' 'ఉంటారా నాలుగురోజులు?' అయినా, ఆ కాసేపూ, నేనొక ప్రధాన వ్యక్తిగా కనబడతాను. బస్తీ జనసమూహం అకలి పాదాల కదలికలో నలిగిన వ్యక్తిత్వాన్ని లేవనెత్తే అవకాశం పల్లెటూర్లలో వుంటుంది.

ఆనాడు పగలు భోజనాలయ్యాక నిశ్చింతగా నిద్ర. మూడింటికే లేపారు నన్ను. మొహాన యిన్ని నీళ్ళు జల్లుకుని తుడుచుకుని దొడ్డివైపు వరండాగది మెట్లమీద చతికిలబడ్డాను. మామగారు చెబుతున్నారు: "ఇవాళ

మిమ్మల్ని చూడడానికి ఒక కవిగారు వచ్చారు. మీ రొచ్చారని తెలిసిందట. ఇదివరలో చాలాసార్లు చెప్పాడు నాకు. 'ఆయనొస్తే కబురుపెట్టండి,కొన్ని చదివి వినిపించాలి' అని. ఈసారి ఆయనే చక్కా వచ్చాడు. అవన్నీ తీసుకుని....వెళ్ళి తీసుకొస్తా...." అని వెళ్ళాడతను. నా గుండెలో రాయి పడింది. ఇప్పుడాయన యివన్నీ చదివి వినిపిస్తాడు కాబోలు. ఏం చెయ్యడం.... ?

ఎద్దుబండి మువ్వ చప్పుడు నిలిచింది. ఇద్దరు సాయంపట్టి ఒక వృద్ధుడ్ని దింపారు బండిలోనుండి. మెల్లగా నడిపించుకొొచ్చి, అరుగుమీద మంచంవాల్చి దానిమీద కూలవేశారు ఆయన్ని. వాళ్ళు లోపలికి వెళ్ళగానే ఆయన మంచంమీదనుంచి దిగి, చాప లాక్కుని నా దగ్గరలో అరుగుమీద కూలబడి నవ్వుతూ ఒక స్వాగత పద్యం చదివాడు. ఆ పద్యంలో నా పేరూ, వూరు, కులం, గోత్రం, ఋషులు, భార్యారత్నం పేరు, ఆవిడను గురించిన వివరములు అన్నీ ఉన్నాయి.

నా కిదంతా కొత్త. సిగ్గేసింది; ఏడవాలో, ఏం చెయ్యాలో తెలిసింది కాదు. నాకు ఓ ఏభై ఎకరం వుంటే, ఆయనకు ఒక ఎకరం యిద్దును. లేదు మరి. పోనీ ఐదురూపాయలు చేతిలో పెడితే! ఐదురూపాయలే! అది యిచ్చిన దగ్గరనుంచీ నా మాటెలా వున్నా, మా ఆవిడ ఓ వారం బెంగతో కుంగిపోదూ? ఒక్క రూపాయి ఫరవాలేదు.

నా ఆలోచనలు విన్న ఆయన నవ్వుతున్నాడు. ఒక్క కన్ను కనబడుతుంది. దస్త్రం విప్పుతున్నాడు. నా ఆలోచనలు విన్నవాడివలే ఆయన అన్నాడు.

"నాకు మీరేమీ ఇవ్వనక్కరలేదు, మీ దయ వుంటే అంతే చాలు. డబ్బు కోసమే పద్యాలు వ్రాసి వుంటే కుబేరుడిని అవుదును. అరవై తొమ్మిదవ ఏట."

తాళ్ళ ముళ్ళు విప్పి, కాగితాల కట్టలు దులుపుతున్నాడు. లోయలో

మంచుపొరలా దుమ్ము లేచింది. రుమాలు ముక్కుకు అడ్డంగా వుంచుకొని పక్కకి తిరిగాను.

"దుమ్ము పీలిస్తే, క్షయ వస్తుందంటారు ఈనాటి వైద్యులు, అవునా? మట్టిలో పుట్టి, మట్టిలో కలిసే....అయినా మట్టి వేరు. దుమ్ము

నవ్వుతున్నాడు.

ఏనాడో కాగితాల మధ్య నలిగి శిథిలమైన సాలీళ్ళ కళేబరాలు పొడుమై రాల్తున్నాయి.

నెమలి ఈకల ముక్కలు, కాగితహారి వెండి పురుగు, బొద్దంకి మీసాలు, ముక్కుపొడుం రేణువులు, దుమ్ము, పుగాకు రేకులు, విరిగి పొడుమైన కాగితాల అంచులు—అలా ఒక్కటొక్కటే వర్షపు చినుకుల్లా రాల్తున్నాయి. కాంచన గంగా శిఖరం అంతటి కాగితాల కట్టలోంచి, అడుగుది పెల్లగించా డాయన.

పఠనం ప్రారంభించాడు.

"ఇది మొదటిది 'మిరియాలు, కారం' పేరు. అనగా, మార్లీ మిన్‌టో దొరలు సూచించిన సంస్కారాల పట్టి బైటపెట్టిన సందర్భములో 1909 కాంగ్రెసు నాలుగు తీర్మానాలు చేసింది. అప్పుడు వ్రాసిన పద్యాలు, మార్లీకి, మింటోకి, చెరొక కాపీ పంపాను. అంటే వారి కార్యదర్శులకు చూడండి.

అని ఆ వ్రాతప్రతిని నాకు చూపించాడు. అది నామమాత్రంగానే కాగితం. కావ్య కాంతకు ఆయన కట్టిన మొదటి వస్త్రం. అక్షరాలు కన బడ్డం లేదు. హరప్పానాటి శిలాశాసనం లాగుంది. ఆ వ్రాతప్రతికి మరో కాగితం తగిల్చి వుంది. దాన్నిండా అధికారుల సంతకాలు, ప్రభుత్వ కార్యాలయాల ముద్రలు. ఆ పద్యాలు వారు చూచామనీ, పంపినందుకు కృతజ్ఞుల మనీ వ్రాసిన జాబు అది. ఆ ముద్రలు, దొరల సంతకాలు చూడగానే దగ్గ

రకు జరిగి కొంచెం శ్రద్ధ కనబరుస్తూ కూర్చున్నాను. ముందున్న నిర్లక్ష్య భావం జారుకుంటోంది.

"ఇది 1916 లో బిసెంట్ సతి హోంరూల్ లీగు ప్రచారం చేస్తున్న సందర్భాన వ్రాసింది. వారధి.నాల. నాలుగు చాటువులు. బిసెంట్ గారికి పంపుకొన్నాను."

ఆ నాలుగు చాటువులు చదివి వినిపించాడు ఆయన. అనీబిసెంటు ఆ పద్యాలు అందుకున్నట్లు సంతోషించినట్లూ, వారు ముందు వ్రాయబోయే పద్యాలకు ఎదురుచూస్తూ వుంటాననీ, ఆమె స్థానే ఎవరో సంతకం పెట్టి పంపిన కృతజ్ఞత ఆ పద్యాల పత్రిక కలిగి వుంది.

మరో కాగితం తీశాడాయన.

"1917 లో చందుణాన్ రైతుల వెన్ను చరుస్తూ వ్రాసిన పద్యాలు వుండవలసింది యిక్కడ" అన్నాడు కాగితాల కట్టకేసి చూపుతూ. "పంపించాను. జవాబుకూడ వచ్చింది. ఎక్కడో పోయింది."

ఏ ఎలికో తినేసి వుంటుంది.

పొలం పాడు చెయ్యడమే కాకుండా, పొలాన్ని గురించిన పదు నాలుగు పద్యాల మనుమాలను కూడ తిన్న వంటే, బ్రిటిష్ పాలనలో దేశం ఎంతటి బీదస్థితిలో వుండేదో ఆలోచించండి." అని నవ్వుతున్నాడు. మూల మరో పన్నుకూడా వుంది. సింహాలుండే చీకటి గుహలో మిగిలిన ఎముకముక్కలా. కంటె మెడ ఇద్దరుచొక్కానిండా కంతలే. రెండు అద్దంపెంకులు దారంతో బిగించి, ముక్కుమీద నిలబెట్టి చెవులకు ముడెట్టి కండ్లజోడు అనబడే ఒక పేటెంటు పరికరాన్ని శుభ్రంచేసి, నుదిటిమీదికి నెట్టేశాడు. మరో కాగితం పెల్లగించాడు.

"మొదటి ప్రపంచ సంగ్రామం ముగిసింది. 1918 నవంబరు పద కొండున సంధి జరిగింది. అప్పుడు వ్రాసిన చిత్ర, ఆశు, బంధ, గర్భ" అనబడే చతుర్విధ కవితా క్రోధమూ—శీర్షిక పేరు "775" అంటే తెలుసా?

జర్మన్ సైనికుణ్ణి పోషించడానికి జర్మను ప్రభువులు 145 రూపాయలు ఖర్చు పెడతారు. ఫ్రెంచి సైనికుడి పోషణకి 185 రూపాయలుండాలి. ఇంగ్లాండులో బ్రిటీషు సైనికుడికి 285 ఖర్చు అవుతుంది. కానీ చిత్రం! ఇండియాలో బ్రిటిష్ సైనికుడికి 775 రూపాయలవుతేగానీ గడువదు. బెంగాల్‌ను విడగొట్టారు. కాశీలో 21 వ కాంగ్రెసు సమావేశం అసమ్మతిని ప్రకటించింది — చూడండి."

మళ్ళా పద్యాలు ఆనాటి ప్రముఖులకు పంపడం, వారు సంతోషంతో స్వీకరించి, కృతజ్ఞత తెలుపుతూ వ్రాయటం, ఆ ఉత్తరాలను వ్రాత ప్రతిలో జతపరిచి భద్ర పరచటం, రెండూ పొడుమై, మిగిలినవాటిని వారు ముందు ప్రదర్శించటం ఇదీ తంతు.

"ఇదీ వినండి. వల్ల జండా. 1920లో వేల్సు యువరాజు ఇండియా పర్యటించాడు, వెనక్కు పొమ్మన్నాం. ధృవకోకిలా వృత్తాలివి. యువరాజుకే పంపాను. పాపం, చదివాడు. సంతోషం వెలిబుచ్చుతూ వారి స్థానే కార్యదర్శి పంపిన జాబు ఇదుగో...."

ఆ కాగితం ప్రదర్శించాడాయన. గురి, గౌరవం పెరుగుతున్నాయి. పూర్వకాలపు కవులను వుదాశీనతతో చూడటం, ఈనాటివారికి పరిపాటి. ఇవన్నీ చూడగానే నాలో ఆ భావం పోయింది. పద్యాలు సులువుగా అర్ధమయ్యేవే, అందులో విషయాన్ని ఉత్తరంగా గద్యంలో వ్రాసినా సరిపోను. పద్యంలోకానీ ఆ విషయానికి నిండుతనం, పరిపూర్ణత, రావనుకుంటాను. పద్యంలో ఏదో వుంది మజా.

1921 ఖిలాఫట్ ఉద్యమం కొనసాగుతున్న సందర్భంలో డాక్టర్ అన్సారికి కొన్ని పద్యాలు వ్రాసి పంపారాయన. వారు చదివి ఆనందించినట్లు జాబుంది.

విని విని అలసినట్లున్నారు, కాసేపు విశ్రాంతిగా కూర్చుందాం. ఈలోగా యింట్లోంచి తినేందుకు ఏవో తెచ్చారు. తినేవి విడిచేసి, కాఫీ

"ఏడు నిముషాలు మనకు విశ్రాంతి" అన్నాడాయన.

"అదేమిటండోయ్! ఏడులో ఏమిటి విశేషం !"

"తరువాతి పద్యాలు 1928 లో ప్రారంభమయినాయి. ఖిలాఫట్ కవిత 1921 నాటిది. అంటే వ్యవధి ఏడు సంవత్సరాలన్నమాట. ఏడాదికొక నిముషం పెట్టుకుందాం."

నాకు నవ్వొచ్చింది దిగమింగుకున్నాను. ఆ ఏడు సంవత్సరాలలో ఆయన ఎందుకో ఏదీ వ్రాయలేదు. బోలెడు జరిగాయి.

జాతీయ, అంతర్జాతీయ రంగములలో ఎన్నెన్నో ఘట్టాలు వున్నాయి. మరెందుకీ మౌనం ?

"నాకు తెలుసు మీ ప్రశ్న. ఆ ఏడు సంవత్సరాలలో నాకు రెండో వివాహం అవడం, భార్య చనిపోవడం జరిగాయి. 1928 లో సైమన్ కమీషను విచ్చేసింది. దాన్ని బహిష్కరించారు ప్రజ. అప్పుడు వ్రాసిన మత్తేభ విక్రీడితము — ఇదుగో వినండి."

లాలా లజపతిరాయి చదివించుగుని, ఆనందించి మెచ్చుగుంటూ జాబు వ్రాశాడు.

అని ఆ పద్యాలు చదివాడు ఆయన.

కాని నా దృష్టి ఆ పద్యాలమీద లేదు. అసలు నేను వాటిని విననే లేదు. విన్నట్లు నటించినా, ఆ పదేండ్ల మౌనం —వివాహం, భార్య మరణం వాటిని గురించే వూహిస్తున్నా. భార్యను గూర్చి, పెళ్ళి సందర్భంలో గాని — మరొకప్పుడు గాని, ఏమీ వ్రాయలేదా ? ఎందుకు వ్రాయలేదు ? ఇష్టం లేదా ? లేక మరీ ఇష్టమా ? అంతులేని ఆవేదన ఏదన్నా వుందా ? లేక ఆమెని హత్యచేసి పోలీసులకు పట్టుబడకుండా ఎక్కడో దాక్కుని, అంతా మాటుమడిగిం తర్వాత కవితాకన్యని ఆరాధించడం సాగించాడా ? నాకు తెలియదు. అర్థం మీటరుగేజు రైలు పట్టాలాంటివాడు. కవిత్వాన్ని కూడా హత్య చెయ్యలేడు పాపం.

మళ్ళా మరికొన్ని కాగితాలు తీశాడు. ఈ వ్రాత ప్రతులేమిటి నా ప్రాణానికి! ఏ పత్రికలోనైనా అచ్చువేసి వుండగూడదూ? అడిగేశాను.

"ఏవండీ—మీపేరు....?"

"పేరయ్య"

"అవుతే పేరయ్యగారూ—చాలా బాగున్నాయండీ —కవిత్వంలో మంచి చెడ్డలు విమర్శించే శక్తి నాకు లేదనుకోండి—ఇవన్నీ ఒక పుస్తకంగా వేయించలేక పొయ్యారూ ? పోనీ ఏదైనా పత్రికకి పంపివుంటే...." నా వాక్యం పూర్తవకుండానే అందుకున్నాడాయన "....వేసివుండవు. అయ్యో పంపించకేమండి—నాలుగైదుసార్లు, పత్రికలకు పంపించాను. వారు తిప్పి పంపించివేశారు. వారు మాత్రం ఏం చేస్తారు చెప్పండి. దేశచరిత్ర రోజురోజుకీ మారిపోతూ వుండే ఒక ఘట్టం గురించి నే వ్రాసిన పద్యాలు వారికి చేరేటప్పటికి మరో కొత్త సంఘటన వచ్చిపడుతూ వుండె. నిన్నటి పత్రిక నేడు చూస్తామా? చూడండి. ఈ పద్యాలూ అంతే....

"ఆ రోజుల్లో ఎందరో జమీందార్లు, డబ్బున్న ఆసామీలు వుండే వారు —పుస్తకంగా వేయించమని మీరెవ్వరినీ కోరలేదా? పొడుం పంచిమడతల్లోంచి తీశాడు. కళ్ళజోడు శుభ్రంచేశాడు. తన తడిమి చూసు గున్నాడు. అంతా నున్నగా వుంది—నిలబడే ఓపికవున్న వెంట్రుకేలేదు. ఏ ఆవేదనా లేకుండా ఆయన మనస్సు ఎంత నిశ్చలంగా వుందో, ఆయన బుర్రకూడా ఏ ఆటంకమూ లేకుండా అంత నిర్మలంగా వుందనిపించింది.

అప్పుడప్పుడనిపించింది.

కాని ఏమిటో పడలేదు. అశ్రద్ధయిపోయింది. నా మొదటిభార్య క్షయవ్యాధికి గురై చనిపోయింది.

చాలా దిగులుపడ్డాను. మంచి విషాదకావ్యం వ్రాయాలనుకున్నాను. ప్రపంచములో భార్యవియోగం పొందినవారి అందరి బాధా అందులో

గుప్పెయ్యాలనే సంకల్పం, పూనూకోనూ లేదు. పడనూ లేదు. ఇంతలో రెండో పెళ్ళి జరిగింది. ఆ బాధంతా తగ్గిపోయింది. హాయిగా రోజులు వెళ్ళిపోయినాయి. మశూచిపోసి చనిపోయింది రెండో కళత్రం. దుఃఖంలో మునిగిపొయ్యాను. ఇంక బ్రదకననుకున్నాను. గొప్ప విషాదకావ్యం వ్రాసి మరణానికి సిద్ధపడదామనుకున్నాను. చిత్రం అది పడలేదు—ఇంతవరకూ కొన్ని కొన్ని అల్లా జరిగిపోతూంటాయి. ఇప్పుడు—ఏదో చెయ్యాలి —అన్న సంకల్పంతో ఎదిరించటం మానుకున్నాను.

"1929లో లంకా షైర్ బట్టని తగలబెడుతోంది దేశం. జతీంద్రనాథదాస్ నిరాహారదీక్ష పూనాడు. అప్పుడు వ్రాసినవి. వన మయూరము తెలుసుగా." అని చదవడం మొదలెట్టాడు.

నాకు వనమయూర మంటే తెలియదు. నాకు తెలుసునని ఆయన అనుకున్నందుకు కాస్త లోలో చక్కిలిగింతతో కూడిన మందహాసం కవ్వించింది.

"చాలా బాగుంది పేరయ్యగారు—ఇప్పుడేనా వీటిని పుస్తకంగా వేయిస్తే...."

"ఎవ్వరూ చదువుతారనుకోను నేను వ్రాసినవన్నీ—ఏ వ్యక్తులై తే దీక్షతో కార్యానికి పూనుకుని చరిత్ర రచిస్తున్నారో వారి నుద్దేశించి—వారిని ఉద్బోధిస్తూ—వారికోసం వ్రాసినవి వాటి విలువ వారికే తెలుస్తుంది. నేననుకున్నట్లుగానే వారు వాటిని చదివి సంతోషించి కృతజ్ఞత చెబుతూనే వచ్చారు. నాకింకేం కావాలి, వాడవాడా పల్లె పల్లే, ఈ పద్యాలు ప్రజానీకం పఠిస్తారని నేననుకోలేదు. అల్లా జరగాలనే ఆసించలేదు నేను.

1930 లో పూర్ణ స్వరాజ్య పార్టీ నెలకొల్పారు. "పంగనామం" అనే శీర్షికను మందాక్రాంత వృత్తంలో వ్రాశాను.

"అబ్బ ఎంత బాగుందండి!"

"వినకుండానే ?"

"అదికాదు—ఆ పేరు—మందాక్రాంత వృత్తం అంటే ఏమిటండీ?"

"మీకు తెలీకనా. ఇందులో ప్రతి పాదంలోనూ 'మ, భ, న, త, త, గ, గ' అనే గణాలుంటాయి. పదకొండవ అక్షరానికి యతి వుంటుంది. ప్రాస వుండి తీరాలి."

"అల్లాగా - ఏదీ చదవండి. అవుతే 'పంగనామం' అన్నారెందుకు ?" నవ్వుతున్నాడు పేరయ్యగారు.

"ఆ మాత్రం వూహించలేకనా ఏమిటి మీరడగడం ! చూడండి ఆ రోజుల్లో గాంధిగారు పదకొండు విషయాలు ప్రతిపాదించాడు. ఆ అంకే పంగనామంలా వుంటుందనీ - అల్లా పెట్టాను. ఉప్పుసత్యాగ్రహం గురించి వ్రాసిన పద్యాలను థియేడర్ పార్కర్‌కి పంపించాను. ఇదుగో వారి జవాబు."

ఆ కాగితంకేసి చూస్తున్నాను.

"79 పాదచారులతో 1930 మార్చి 12వ తేదీనాడు దండయాత్ర ప్రారంభమైంది. లాఠీచార్జీలు జరిగాయి. బోస్‌ని ఎరెస్టు చేశారు. డైలీ హెరాల్డ్ పత్రిక విలేఖరి స్లోకోంబ్‌కి పంపించాను యీ పద్యాలు. ఒక కాపీ బ్రెయిల్స్ ఫోర్డ్ దొరగారికి పంపించాను. ఇద్దరు అందుకున్నట్లు దాఖలాగా జాబు లివిగో...." అని మరికొన్ని ఉత్తరాలు చూపించా డాయన.

నా కా జాబులు చూడడంలో కన్పించిన సంతోషం పద్యాలు వినడంలో కనబడలేదు నిజానికి. నాలో దేశభక్తి లోపించిందా ! జాతీయ తత్వం ఏనాడో అంతరించింది. నేటి జనాన్ని ఆకర్షిస్తున్నది అంతర్జాతీయ తత్వం—'నా వూరు, నా దేశం —' అన్న మాటలు విన్నప్పుడు నాలో ఉచితమైన ఉద్రేకం ఊరడంలేదు.

"ఇవి గుండుసున్నా శీర్షికను వ్రాసినవి. రవుండు టేబిలు సమావేశం జరిగినప్పుడు వ్రాశాను. అన్నం పెట్టమంటే రాయి చేతులో పెట్టారన్నాడు గాంధీగారు. నాకు ఆ రాళ్ళూ లేవు. అవన్నా వుంటే ఇల్లైనా కట్టుకుందును. తాడిచెట్లు కొట్టిపారెయ్యమన్నాడు గాంధిగారు. మా దొడ్లో తాడిచెట్టుని పీకించేశాను. ఈ స్రగ్ధర వినండి. అ ఆ ఇ ఈ ఉ అనే పద్యాలు ఎ. బి. సి. క్లాస్ రాజకీయ ఖైదీల నుద్దేశించి వ్రాసినవి."

—అని చదవడం మొదలెట్టాడు.

ఆ కట్టలన్నీ చదవాలంటే, రెండు మూడు రోజులు పట్టొచ్చు. అందుచేత నేనే ఆ కాగితాలను అక్కడక్కడ బైటకి లాగి అవి ఎవరికి పంపాడో, వారేమి వ్రాశారో చదువుతూ కొంత కాలక్షేపం చేశాను. 1931లో భగత్‌సింగుని గూర్చినవి కొన్ని పద్యాలున్నాయి. 1932లో గాంధీగారు నిరాహారదీక్ష పూనినపుడు వ్రాసిన పద్యాలను ఏకంగా సామ్యుల్ హోర్‌కి పంపడం, ఆ పంపిన కాగితాలు ఏ కారణంవల్లనో తిరిగి రావడం జరిగినట్లు తెలుసుకున్నాను. పూనా ఒడంబడిక పద్యాలు ఏండ్రూస్‌కు ఒక కాపీ పోలక్ దొరగారికి మరొక కాపీ వెళ్లాయి. 1934లో బీహార్ భూకంపం గురించి వ్రాసినవి ఎవరికీ పంపినట్లు లేదు. 1938లో రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు యుద్ధంపట్ల అసమ్మతి తెలుపుతూ, రూజువెల్ట్‌కి, బోస్‌కి పంపిన పద్యాలున్నాయి.

క్రిప్స్‌మిషన్ వచ్చినప్పుడు, క్రిప్స్ ధరించిన ఖద్దరు సూటును మెచ్చుకుంటూ కొన్ని పద్యాలున్నాయి. క్విట్ ఇండియా ఉద్యమం పద్యాలు గాంధీగారినీ, యూరప్‌లో నాయకులను సంబోధిస్తూ, వ్రాసిన పద్యాలు, రాకపోకల సౌకర్యాలు లేక కాబోలు, వారివద్దనుండి జవాబు లొచ్చినట్టు లేదు. భారతదేశం స్వతంత్రదేశం కావడమూ, నవఖాలీ, ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డమూ ఒకటేమిటి—ప్రతి చారిత్రక సంఘటన గురించి వందలాదిగా పద్యాలున్నాయి. చీకటి పడుతోంది. అక్షరా లానడం లేదాయనకి. చదవలేకపోతున్నాడు.

"చాలా గొప్పగా వున్నాయండి. దేశ చరిత్రలో ఆనాటివన్నీ వూహించుకుంటే ఎంతో ఆనందంగా వుంటుంది. అంతటి అద్భుతమైన కాలంలో అంతటి మహావ్యక్తులను గూర్చి వ్రాసిన ఆయనకు సమకాలికుడుగా వుండటం నా అదృష్టం. ఎంతో గర్వంగా వుంది. ఆ ఆనందం, ఆ గర్వం, రేకెత్తించాయి మీ పద్యాలు మీ పరిచయం. —నా కృతజ్ఞత ఎల్లా చెప్పుకోవాలంటారు? అని ప్రశ్నించాను. లోపల ప్రస్ఫుటంగా, ఆవేశం లేకపోయినా, ఆ మాట లనేప్పటికీ ఉద్రేకం ఏదో ఆకారం తెచ్చుకుని, పల్లంలోకి నీరు జారినట్లుగా కళ్ళల్లోకి, గొంతుకలోకి తీసుకుంటూ వస్తూం దెందుకో!

ఆయన నవ్వుతున్నాడు. మిగిలిపోయిన సూర్యకిరణంవలే, రెండు రైలుపట్టాలు ఒకటైనట్లు ఆయన కళ్ళు చిట్లించి, కాగితాలను సవరించి మూట కడుతున్నాడు.

"మీ కృతజ్ఞతా—కృతజ్ఞతనే చెప్పుకోవాలి—ఓపికగా విన్నందుకు. మీరు చిన్నగనుక అల్లా అంటున్నారు. నా మిగతా పద్యాలుకూడా వింటే అదే పదివేలు నాకు. అయినా యిదొక్కటి వినండి. ఆ మధ్య మా వూరికి పదిమైళ్ళ దూరంలో హరిజనులకు ఆలయ ప్రవేశం జరగటం, ఆలయంలోనే వర్ణాంతర వివాహం జరగటం, రెండు విశేషాలను పురస్కరించుకుని వ్రాసిన పద్యాలు ఉంచండి—తీస్తాను...."

అని మళ్ళా ఆ కాగితాల కట్టను కదిపి, వెదకడం ప్రారంభించాడు. నేను కూడా వెదకటం ప్రారంభించాను.

"ఇక్కడే వుండాలి. వినోభాజీకి పంపించాను. కనబడచేం.... వృత్తం ఏమిటో చెప్పుకోగలరా? 'కవిరాజ విరాజితం' అనేది. ఒక నగణము, ఆరు జగణములు, ఒక వగణము వుంటాయి. సందర్భానికి తగింది."

పసివానివలె ఆతృతతో వెదుకుతూ, చీకటిలో మానసిక అనం

దంతో మిణుగు పురుగులల్లే మెరుస్తూన్న ఆయన నేత్రాల వైఖరిచూస్తే, కన్నీటితో నా నేత్రాలు కలవరపడ్డాయి. ఆయన మనిషికాదు. మానవజాతి. మట్టిలో పుట్టి, మట్టిలో పెరిగి, మట్టిలో ఆడుకుంటూ, ఆనందంతో అందు లోనే కలిసిపోతాడు.

"ఇదిగో!" అని సంతోషంతో పూగిసలాడాడు మళ్ళా పెదవి చప్పరించాడు.

"అబ్బే! అవి కావు. అవిపోతే యింకేమన్నా వుంది!" అంటూ ఆదుర్దా పడుతున్నాడు.

"ఫరవాలేదు లెండి, రేపు వింటాను."

"రేపా! రేపు మా వూరు మా యింటికొస్తారా!" పంచి మడతల్లో యిరుక్కున్నట్లు దులిపి చూసుకుంటున్నాడు.

"వొస్తాను. పొద్దోయింది. ఇంక వుండండి."

అని, ఆయనా, నేనూ, ఇంట్లోంచి మరో యిద్దరూ ఆ కాగితాలను కట్టగా తాళ్ళతోకట్టి బండిలోకి చేరవేశాము.

"మరోకట్ట వుంది లెండి, చిన్న భోషాణంలో వుంచాను. ఆ కట్టలో కలిసిందేమో, ఆ పద్యాల కాగితం. అల్లా జరుగకూడదు. వేగిరం వెళ్ళి చూడాలి. రేపటికి దొరక్కపోదు లెండి...."

—అని తొందరగా బండిలోకి ఎక్కాడు.

"దొరక్కపోతే ఏంలెండి! మళ్ళా వ్రాయలేరా ఏమిటి?" అన్నా ఓదార్పు భావంతో.

మళ్ళా వ్రాసింది మళ్లా వ్రాసిందే. వస్సుమోరు పద్యంలా, రెండో వివాహం భర్తలాగా, రేపు తప్పకుండా రావాలి స్మాండి...."

బండి వెడుతూంది. నేను వెనకాలే కొంతదూరం వెళ్ళాను. ఆయన బండిలోంచి అంటున్నాడు. "చిన్న అబద్ధం ఆడాను. వయస్సు అరవై తొమ్మిదన్నట్లు గుర్తు. ఒక రెండేండ్లు తగ్గించాను అంతే."

నాకు నవ్వొచ్చింది. ఆ మాటతో నాకు సన్నిహితు డయ్యాడు. అతను మానవజాతి కాడు, మనిషే.

ఎద్దుకు హుంషారిస్తున్నాడు తోలేవాడు సినిమా పాటలు పాడుతూ. మెళ్ళో గంట సన్నగిల్లుతూంది. చాలా దూరం వెళ్ళిపోయింది. నడుచు కుంటూ వంతెన దాటి కాలువగట్టుకు చేరుకున్నాను. కొబ్బరిచెట్లు నిర్ఘాంత పోయినట్లు, కదలకుండా వున్నాయి. చందమామ కాలువ పల్చటి అలలలో పొగేసినట్లు జారి వొడ్డుకు చేరుకుని మళ్ళా లోపలికి వయ్యారంగా ఈదుతూ కదులుతున్నాడు.

పచ్చగడ్డిని చెంతరానీయకుండా రాతిబండ వొడ్డున వంగి జపం చేసుకుంటోంది. అక్కడ ప్రశాంతంగా వున్నట్లు అనిపించింది. ఈ మనిషి మొహం ఎట్లా వుంటుందో చూద్దామని ఒడ్డుకు వచ్చిన రెండుమూడు కన్నె పిల్లలు "తీరా చేసి ఈ మొహమేనా" అనుకొని నీళ్ళల్లోకి గెంతాయి. కొబ్బరాకుల గుసగుస జోలపాటకి చేపపిల్లలు ఒడ్డున నీటిబీటలో నిద్ర పోతున్నాయి. ఆ ప్రశాంతత నాలో వున్నదేమో—మనలో భావాలు ప్రకృతి ఆపాదిస్తాము. అమాయకులం. పేరయ్య మహాకవి కాడు, అసలు కవికూడా కాడు. దేశభక్తుడు, ఏం చెయ్యాలో తెలీక పద్యాల ద్వారా ఆ ఉద్రేకాన్ని ప్రకటించుకుంటాడు. వాటిల్లో పెద్ద ఉద్రేకమూ లేదు. గొప్ప వారిని ఈ విధంగా మంచి చేసుకుంటే తనకు ముందు మేలుజరుగుతుందని ఆశించి వ్రాయడం మొదలుపెట్టి, కొంత కాలానికి అదొక అలవాటై అల్లా పద్యాలు కొనసాగిస్తున్నాడు అంతే. అతను సాధించిందేమిటి ? లోకాన్ని జయించి తిరిగి మనుషులకి అప్పగించి వెయ్యడంలో వున్న ఔదార్యంలోని ఆనందం, సంఘటన, పరిస్థితి, కృషి, చరిత్ర, అందలి మనుషులు—అందర్నీ తన గుప్పెట్లోకి లాక్కున్నాడు.

చూశాడు. "ఇదా ? ఇల్లా వుంటుందా ? ఇంతేనా జరిగేది ? సరే పోనీ —" అని మళ్ళా విడిచిపెట్టేశాడు. అతని గుండెలు కొట్టుకుంటూనే

వున్నాయి. ప్రేమతో. ఆనందంతో తను లోకంలో ఐక్యమై, లోకాన్ని తనలో కలుపుకున్నాడు. తను లేడు. తను పుట్టి, పెరిగి, జీవించినట్లు నిదర్శనాలు లేవు. ఆ పద్యానికి తగిలించిన ప్రముఖుల సంతకాలతో వున్న ఉత్తరాలు తప్ప. అందులో ఒకటి కనిపించడంలేదు. పద్యాలని మెచ్చుకుంటూ వ్రాసిన జాబుతో అతని జీవితంలో ఒక ప్రధానఘట్టం ముడిపడి వుంది. ఆ జాబు లేకపోతే అతను ఆ సందర్భంలో మరణించినట్టే బాధపడ్డాడు. ఇంటికి వెళ్ళి వెదికి, ఎవరికైనా వినిపించాలి, అప్పుడు కాని అతను జీవించడు.

ఆ మొన్నాడు వెళ్ళాను పేరయ్య పల్లెకి. సందు మొగలో బండి దిగి నడుస్తున్నాం. నేనూ మరో స్నేహితుడు. అడ్డంగా పడుకుని విశ్వాన్ని తిలకిస్తున్న కుక్కల ద్వయం. అసమ్మతిని తెలుపుతూ మొరిగి, మళ్ళా అంగీకరించినట్లు, ఒక మూలగా జరిగి పడున్నాయి. కట్టెలు నెత్తిన పెట్టుకుని ఒక ముసలిది అటుపోతోంది. పిల్లాడు ఇనుప చక్రం కర్రతో దొర్లించుకుంటూ పరుగెత్తుతున్నాడు. పేరయ్యగారింటిముందు రెండు కొబ్బరిచెట్లున్నాయి. ఆ గోడ మధ్య రెండు తలుపులూ, సరిగ్గా మూసుగోవు. మధ్య బీటలు, కంతలు —లోపలంతా కనబడుతూనే వుంటుంది. ఆయన హృదయద్వారంలా ముందు వసారా. చూరున పెంకులు కొన వూపిరితో సాలిగూళ్ళ బంగారుతీగెలతో నిలబడి వున్నాయి. పిచ్చుకలు, బల్లులు, తేళ్ళు వాటి పుట్టిల్లు ఆ చూరు. ముందు గదిలో పెద్ద భోషాణం. లోపల గదిలో చిన్న భోషాణం. నులక మంచం,—తాళ్ళు నేలమీదికి జారి 'బాలే' నర్తకుల వంటికాళ్లు, వంకరలు తిరిగి వున్నాయి. కింద కాగితాలు, పైన కాగితాలు, ప్రక్కన కాగితాలు —చూరికి తగుల్తున్నాయి. అవన్నీ పద్యాల కాగితాల కట్టలు, ఆయన ఉండేందుకు చోటేలేదు. మరో నాలుగేళ్ళకో ఆయన కాపురం వసారాలో చూరుకిందే. పేరయ్యగారేడి?

కనబడ్డేం? ఆమెవరో వుంది—ఎర్రచీర బోర్డరు లేదు. నెరసిన వెంట్రుకలు, బలసిన శరీరం, మడతలతో జారిన దవడలు. నల్లబడుతూ వున్న పెదవుల వెనక చీకటి మందహాసం – నరసమ్మట. పనిమనిషి, ఆయన్ని కొన్ని సంవత్సరాలుగా కనిపెట్టుకుని, ఆదుకొన్న స్నేహితురాలు—దూరపుచుట్టం, దీవద. ఆయనకి ఎవరూలేరు—ఈమెకి ఎవరూలేరు. ఏటి వొడ్డున ఇల్లుకట్టుకుని, పద్యాలు చెప్పుకుంటున్నారా! "ఇట్లారండి" అని సంజ్ఞ చేసింది నరసమ్మ. ఆవిడ ధోరణి చూస్తే భయం వేసింది. గబగబా వెళ్ళాము దొడ్డివైపు. దొడ్లో అన్నీ చెట్లు. మూలగా పాక. దాన్నిండా కట్టెలు సిరామరికలు, పాత కాగితాలు. ఆ గదిలో మరో మంచం, దాని మీద మిగిలిన పేరయ్య చేతులు, కాళ్లు వూగిసలాడుతున్నాయి. నాలుక లోపలకీ, బయటికి కదులుతూంది. సిగరెట్ ఏష్‌రంగు కంటి పాపలు, పక్కలకీ, పైకీ జరుగుతున్నాయి. ఆయన చేతుల్ని అదిమిపెట్టి నుదటిమీద చెయ్యివేసి, బుజ్జగిస్తూ సపర్యలు చేస్తున్నా. నరసమ్మ చెప్పింది. రాత్రంతా ఆ పోయిన పద్యం కోసం వెదికాడట. భోషాణాలకింద దూరి, చూరంతా కెలికి, దొడ్డంతా గాలించాడట, దూడ కాగితాన్ని తినడానికి తీసుకుపోయిందేమోనని రోజల్లా వెదుకుతూ ఏవో కాగితాల కట్టలు చూసినట్లు భ్రమించి పరుగెట్టడం ఆ బీటలో కాలు ఇరుక్కుని పడిపోయాడుట. పక్షవాతం ప్రకోపించి మంచాన పడవేసిందట. మరొక్కసారి నవ్వు కోసం ప్రయత్నం చేశాడు పేరయ్యగారు.

"నాపనై పోయింది. పోయిన పద్యం వృత్తం—కవిరాజ విరాజితం మంగళం పోయింది. విరాజిల్లుతూ నేనూ పోతున్నాను."

నా జేబులోంచి అచ్చుకాగితం ఒకటి తీశాను.

"చూడండి పేరయ్యగారు. ఆ కాగితం పోలేదు. మీకు తెలీకుండా నేనే తీశాను పత్రికలో వేయిద్దామని. ఈ ఉదయ పత్రికలో వేశారు. ఇదిగో చూడండి" అన్నాను. ఆ కాగితాన్ని ఆయన కళ్ళముందు చూపుతూ, ఆయన చూడలేదు. మరి కదలలేదు. నన్ను, దేశాన్ని, లోకాన్ని, సృష్టిని క్షమించాడనుకుంటే తప్ప, నా కళ్ళంట కారుతున్న నీటిధార నిలవదు.

నిజానికి ఆ మొర్నాడు పేరయ్య పల్లెకి వెళ్ళలేదు. కాలవగట్టున ఆ కొబ్బరి చెట్లకింద రాతిబండ మీద కూర్చుని కొనసాగించిన వూహాలవి. కథల్లో చిత్రింపబడిన జీవితానికి పరిపూర్ణత, సమాప్తం, వుంటాయి. దిగ్భ్రమ కలగచేసే ఒక పేచీ ముగింపు ముడెడతాడు కథకుడు. జీవితంలో ఆ రకం చెలగాటం ఆడదామన్న అభిలాషా, ఆడగాలన్న శక్తీ నాకు లేవు మరి! నాకు చేతనైంది వూహించడం. ఓ విధంగా పేరయ్యగారు సాధించింది కూడా అదే. ఆయనతో అరగంట పరిచయం ఆ రకం వూహాలని రేకెత్తించింది. సారసత్వం జీవితాన్ని అనుసరిస్తుందంటారు. జీవితం కూడా అప్పుడప్పుడు సారస్వతాన్ని అనుకరించడం లేకపోలేదు, ఎక్కడో చదివాను. ఒక శ్రీమంతుడు జీవితం అంతా, ధనికుల పార్టీలకి హాజరు కావడం ఆశయంగా పెట్టుకుని, వారిచేత ఆహ్వానింపబడేటందుకు ప్రాణం మినహా సర్వస్వమూ ఇచ్చేవాడట. ఆ వ్యక్తి వార్ధక్యంలో వ్యాధికి గురై మంచానపడతాడు. చూడ్డానికి వెడతారు స్నేహితులు. అవి తుది ఘడియలని గుర్తించారు. ఒక ధనికురాలు పార్టీ ఇస్తోందట. దానికి ఆయనని పిలువలేదుట. అందుకు బాధపడి, ఆమెని తిడుతూ, ప్రేలాపన సాగించాడుట ఆ వృద్ధుడు. అప్పుడు ఆ స్నేహితులు ఆయనకి మనశ్శాంతి సమకూర్చాలని, ఒక ఆహ్వాన పత్రం సృష్టించి ఆయనకి చూపించారట. కొన్ని నిమిషాల ముందు ఆయన దాన్ని చూసి వుంటే నిశ్చితంగా ప్రాణం విడుచును. ఇది జ్ఞాపకం వచ్చి పేరయ్యగారి పోయిన పద్యాల కాగితం నేనే తీసి, మొర్నాడు అచ్చువేయించి, ఆయనకి చూపి మనశ్శాంతి కలగజేసి వుంటే ఎంత బాగుండునో వూహించుకుని నేను తృప్తిచెందాను. పేరయ్యగారి మాటెల్లా వున్నా ఆయన ఉన్నట్లు తెలిని ఈ లోకానికి ఆయన లేనట్లు తెలిపే అవసరం ఎందుకు రావాలి? అందుకే ఆయన్ని మొర్నాడు చూడలేదు చూడనుకూడ....ఎవరితోను పంచుకోను ఆ అనుభూతిని. ప్రతివ్యక్తి కొన్ని అనుభూతులను రహస్యంగా దాచుకుంటాడు. అప్పుడప్పుడు దాన్ని స్మరించుకుని ఆనందపడతాడు. నాకిది అట్లాంటిది.

—:o:—

# "దేశం నాకిచ్చిన సందేశం"

'ఏమైంది ?'

'పోయింది.'

'నే ననుకుంటూనేవున్నా. నాటకాలు, సంగీతాలు, ఆటలు పెట్టుకుంటే చదువులొ స్తయ్యా ?'

"ఇప్పుడు నేను ప్యాసవకపోతే దేశానికొచ్చిన అనర్థం ఏముందంటారు ?" అని అడిగాను యువక ఆవేశంతో.

"దేశానికేం—దేశం హాయిగా వుంటుంది. నీ మంచి కోసమే ప్యాసవుతే నాలుగురాళ్లు గడించుకుంటావు. మీ నాయనగార్ని సుఖపెడతావు. పెళ్ళానికి నగలెడతావు. అంతే."

"నాలుగురాళ్ళతోనే ?"

ఆయన నా ప్రశ్న వినిపించుకోలేదు. వెళ్ళిపోయాడు. ఉత్తముడు, స్వార్థరహితుడు, ప్రపంచ శ్రేయోభిలాషి, సందేశం యిచ్చాడు, అవతారం చాలించుకున్నాడు.

ఇంటికొచ్చాను.

చేతులో పత్రికా, నా పైఖరీ చూసి, మామగారు చతికిలపడ్డాడు. నేను తిన్నగా గదిలో కెళ్ళాను. సుందరం గోళ్ళు కొరుక్కుంటూ మంచం పట్టెమీద కూర్చుంది. నన్ను భోజనానికి ఎవ్వరూ లేవమనలేదో, లేక, అంటే నేను వినిపించుకోలేదో, నా అంతట నేనే వెళ్ళి తినొచ్చాను.

సాయంత్రం క్లబ్బు కెళ్ళాను.

"ఓరేయ్ బ్రదర్! నన్ను విడిచిపెట్టి నువ్వొక్కడవు ప్యాసవడం ఏం ధర్మంరా ?" అన్నాడు మాధవరావు.

"ప్యాసైనవాళ్ళు మనల్ని విడిచిపెట్టలేదు-?"

"వాళ్ళలో త్యాగం లేదురా ఇంతకీ వాళ్ళందరికీ ఉద్యోగాలు సిద్ధంగా వున్నాయా ?"

"ఉండాలన్న నిబంధన వుందా ?"

"లేకపోతే ఎందుకూ ప్యాసవాలన్న వుబలాటం — నీలా, నాలా హాయిగా ఫేలవకూడదూ ?" అంటూ మాధవరావు మెల్లిగా పేకాటబల్ల కేసి కదిలాడు. అమ్మయ్య అనుకుని, స్తంభానికి జార్లబడి. నా చదువును గురించి ఆలోచించడం మొదలెట్టాను. నేను వొంటిగాణ్ణి అనే భయం పోయింది. నాతో నిమిత్తం వున్నవారూ, నా శ్రేయస్సు కోరేవారూ ఎందరో వున్నారు. నే నొక ముఖ్యమైన వ్యక్తిని. నా చేష్టలు కోర్టుపని మీద వెళ్ళే పెద్దమనుషుల్ని నిలిపివేస్తాయి. మామగార్ని చతికిలపడేటట్లు చేస్తాయి, మాధవరావుల్ని సంతోషపెడతాయి, సుందరం కళ్ళల్లో కన్నీటిని రేపుతాయి. దేశం అంటే మాటలా! ఎవరో 'దేశం అంటే మట్టి కాదోయ్, దేశం అంటే మనుషులోయ్' అని పాడుకున్నారు. దేశం అంటే సందేశం.

"పోయిందిటగా...."

ఉలిక్కిపడ్డాను రాజారావుగారు—తాశీల్దారు, నాన్నగారి ప్రాణ స్నేహితుడు.

"అవునండి."

"నీ పరీక్ష ఫేలవడం ఏమిటయ్యా !"

"ఐ. సి. యస్. ప్యాసై, మా జిల్లాకి కలెక్టరుగా రావల్సిన వాడవు...."

"ఈ సారేనా బాగా చదువు, ఫస్టుగా పాసవాలి." అంతటి భారం నా నెత్తినపెట్టి చక్కాపొయ్యాడు రాజారావుగారు. నేనొక సామాన్యుణ్ణి అనుకొనడానికి తావులేదు. నేను అసాధారణుణ్ణి, ఒక మహత్తర వ్యక్తిని, లోకోద్ధారకుణ్ణి. దేశం తన పని కాసేపు మానేసి, నాకు సందేశం యిచ్చిందంటే, నేనెంతటివాణ్ణి అవాలో! దేశం సామాన్యమైనదా? 36 కోట్ల జనాభా - ఉత్తరాన హిమగిరులు, తూర్పున బంగాళాఖాతం, హరప్పా నాగరికత, ఎల్లోరాల శిల్పకళ, వాల్మీకి సంస్కృతి, కాళిదాసు ప్రతిభ. అనాదినుంచీ, కాంతికాగడా ఆరిపోకుండా పట్టుకుని నిలబడ్డ భారతమాత.

ఆవిడకి—నాతో నిమిత్తం వుంది. నాలుగురాళ్ళనుండి ఐ.సి.యస్. వరకు నాయిష్టమొచ్చినదాన్ని సంపాదించుకోమంది. ఇంకేం కావాలి?

పరీక్షలు ఫేలయినకొద్దీ నేనొక మహావ్యక్తి నన్న నమ్మకము దృఢపడుతూ వచ్చింది. కావలసిన పరీక్షలు ఎల్లాగో ప్యాసయ్యాను. ఆ మహానుభావుడు ఏ రోజు నన్నాడో, నాలుగురాళ్ళు గడించడంకూడా జరిగింది. మొదట్లో మన సంఘానికి నా నాలుగురాళ్ళ విషయంలో కొన్ని సందేహాలు రాకపోలేదు. నన్ను మొదట్లో పరామర్శించిన ఉత్తమ పురుషుడే, నిలేసి అడిగాడు.

"అవుతే, అబ్బాయి, నీ కేమిస్తారు?"

"ఏవో నాలుగురాళ్ళు" అన్నాను.

"అది సరేలేవోయి—అసలెంతిస్తారు?"

"చెప్పానుగా."

"చెబుదూ—పెద్ద చదువులు చదివావు, ఉద్యోగం చేస్తున్నావు. ఎన్ని వెటకారం మాటలేనా అంటావు." ఆయన సందేహం తీర్చనందుకు ఆయనకు వూ చిరాకుపుట్టుకొస్తోంది. సంఘం ఆయనచేత ఆ ప్రశ్న వేయించింది. ఆ ప్రశ్న వెనక మన జాతీయత, నాగరికత, సంస్కారం దాగివున్నాయి. జాగుచెయ్యకూడదు. వెంటనే సమాధానం ఇచ్చితీరాలి.

"నాలుగు రాళ్ళండీ" అన్నాను. ఆయనమీద నాకు బహిర్గతంకాని పగవుందో లేక నా ఆర్జన అల్పమైనదని చెప్పుకోడం చిన్నతనమో,— నేను ఆ జవాబే యివ్వడానికి కారణం అవాలి.

"అంటే నాలుగు రూపాయలా ? హవ్వ!" అని నోరు నొక్కుకున్నాడు.

"మీ దీవన ప్రభావం" అన్నాను కొంచెం కసిగా.

"ఆ — యిప్పుడు తెలిసిందిలే — రోజుకి కాబోలు !"

"కాదండి."

"వారానికి నాలుగా ? గంటకి నాలుగా ?"

"మీకంత వేళకోళాంగా వుంది."

"చంపక చెబుదూ."

చూడండి, ఆ సందేహం ఎట్లాంటిదో, ప్రాణంకూడా తీసేస్తుంది. ఆయన ఆ క్షణాన చచ్చిపోతే, నేను హత్యచేసిన వాణ్నవుతాను. చెప్పి తీరాలి.

"నాలుగు అంకెగల రెండంకెల సంఖ్య" అన్నాను. ఆయన తేరుకున్నాడు. నాడి ఆడుతోంది. గుండెలు యథాప్రకారం కొట్టుకుంటున్నాయి.

"తొంభై నాలుగా ?" అని అడిగాడు పూర్తిగా శ్వాసవిడుస్తూ.

"నలభై తొమ్మిదీ కాకూడదూ ?" అన్నాను.

"ఇంత చదువూ చదివి యింతే ! కిల్లీ కొట్టువాడు గడించుకుంటాడు. ఓవేళ ముందు ముందు పెద్దదవుతుందేమో లే" అంటూ ఆయన్ని తీసుకుని సంఘం లేచిపోయింది.

కిల్లీ కొట్లని చూస్తూ యింటి కొచ్చాను. నాలాంటి సంపాదనగల యితర వ్యక్తులను గురించి ఆలోచించడం మొదలెట్టాను. రిక్షావా డొకడు కనిపించాడు. మజ్జిగ మనిషి — మోటారు నడిపేవాడు. ఏమో, వాళ్ళింకా ఎక్కువ ఆర్జిస్తారేమోనన్న సందేహం బయలుదేరింది. ప్రతి వాడింటికీ

వెళ్ళి కనుక్కొని ఒక చార్టు తయారుచేస్తే? అట్లా చెయ్యడం నాక వుద్యోగం అవుతె ఎంత బాగుంటుంది?

భోజనాల దగ్గర మామగారికి ఆ సందేహమే వొచ్చింది.

"ఎంతిస్తా రేవిటి?"

నాకు మామగారిమీద కోపమొచ్చింది. వారమ్మాయికి ఉత్తరంలో ఆ విషయం వ్రాయనే వ్రాశాడు. ఓవేళ యిందాక పరామర్శించిన ఉత్తమ వ్యాఖ్యాత ముందే ఇక్కడికొచ్చి, యీనకి 'క్లి' యిచ్చిపొయ్యాడా!

'మీకు తెలుసుగా' అన్నాను.

ఆయన చిత్రంగా నవ్వడం మొదలెట్టాడు.

'అంటే వొచ్చే సంవత్సరానికి.'

వారి అనుమానం ఇంక్రిమెంటు ఎంతని, అది కాస్తా చెప్పిద్దామనే ఆయన సంకల్పం!

'ప్రొబేషన్ పూర్తవుతుంది' అన్నాను. ఆయన గడసరి. మళ్ళా ఆ విషయం ప్రస్తావించలేదు.

సాయంత్రం క్లబ్బు కెళ్ళాను.

'ఏరా బ్రదర్, ఎంత డ్రా చేస్తున్నావురా?' అని అడిగాడు, నాతో సమంగా ఫేలవుతూ వొచ్చిన నిజమైన సహాధ్యాయుడు, త్యాగి. సంఘానికి నాక సమాధానంలో గురిలేదు. కాబోలు! ఆరాతీసి, సాక్షులచేత వొప్పించి, నిజానిజాలు ఋజువుచేస్తేగాని వూరుకోదు కాబోలు! ఈ స్వార్ధరహితుడి చేత తన సందేహం ఇంగ్లీషులో చెప్పించింది. అది 'డ్రా' చెయ్యడం అంటే ఆవుని పాలు పిండినట్టు సంఘాన్ని పీడించి, బలాత్కారంగా లాక్కోవడం.

'నువ్వెంత డ్రా చేస్తున్నావో నేనూ అంతే' అన్నాను.

"ఓరి ఫూలా, మనం యింకా డ్రాయింగూ గ్రీయింగూ లేదు తెలీదు' అని నవ్వడం మొదలెట్టాడు యీ మహావీరుడు,

ఏం చెప్పను ?

"అవుతే, నువ్వు 'డ్రా' చెయ్యడం మొదలెట్టినప్పుడు ఎంత 'డ్రా' చేస్తావో, అంత' అన్నాను. దెబ్బతో అదిరిపడ్డాడు. ధీరోదాత్తుడు గాయపడి, పేకాటబల్ల కేసి కుంటుకుంటూ వెళ్ళాడు.

అడుగడుక్కీ ఈ ప్రశ్న నన్ను ఎదుర్కొంటూనే వుంది. కనపడిన వ్యక్తిని ముందుగా నేనే అడిగేస్తే ఎల్లా వుంటుందో ? ఎవరో వీపు మీద చరిచారు. వెనక్కి తిరిగాను. రాజారావుగారు; తాశీల్దారు. ఆయనకెంతిస్తారో ?

"ఉద్యోగం దొరికిందటగా, ఏమిస్తారు ?"

నన్ను గురించి తెలుసుకోవల్సిన విషయాలు ఎన్నో వున్నాయి. నా మనస్తత్వం, అంతరంగికం, అపర్నాలు, శృంగారజీవితం, రాజకీయాలపై అభిప్రాయాలు-ఇన్నుండగా, నా జీతం వొక్కటేనా అడగవల్సింది ?

'ఏదో—అందర్లాగే.'

'అంటే ?'

"మొదట్లో సాధారణంగా అందరికీ ఏమిస్తారో, నాకూ అదే."

చూపుడువేలు చూపించి తల పంకించాడు.

నాకు వెంటనే అర్థంకాలేదు.

'వందా ?' అన్నాడు.

'యించుమించు' అన్నాను.

'అయ్యోకర్మ ! వందా లేదూ ?"

'రిటైరయ్యేటప్పటికి రెండొందలదాక వెడుతుంది లెండి. మీకో ?'

రాజారావుగారు నవ్వడం సాగించాడు. ఆయనకి నా మీదున్న అభిప్రాయం కొంత తగ్గినట్లు కనిపించింది. మా నాయినగారి ఆరోగ్యమేనా అడక్కుండా కదిలిపొయ్యారు. నవ్వుమంచి చాలాసేపటివరకు ఆయన తేరుకోలేదు. నా కాశ్చర్యము కలిగింది. జీవితం హాస్యాస్పదం కావడం

అంటే యిదే కాబోలు! నా కొచ్చే జీతం అంతటి ఆనందాన్ని కలి గించింది.

*　　　*　　　*

మూడేళ్ళు గడిచాయి.

నా జీతం ఎంతో ఎవరేనా అడిగినప్పుడల్లా డైరీలో వొక గుర్తు పెట్టుకుంటున్నాను. అప్పటికి రెండువందలఇరవై మూడుసార్లు యీ ప్రశ్న అడగడం జరిగింది. అది యించుమించు నే కలుసుకున్న వ్యక్తుల సంఖ్య ఒక వ్యక్తి ఆ ప్రశ్న వేసి సమాధానం తెలుసుకుంటే, ఆ సమాధానం తన కుటుంబంలో అందరికి తెలుస్తుందని భావిద్దాం. అప్పుడు ఒక్కొక్క వ్యక్తి కుటుంబంలో పదిమందేనా వుంటారని అనుకుంటే, రెండువేల మందికి పైగా నా జీతం గురించి తెలిసిందనుకోవచ్చు. అంటే యించు మించు నా జీవితంలో ఎంతమంది పరిచితులవుతారో అందరికీ తెలిసి పోయింది. అమ్మయ్య— అని నిట్టూర్చాను. చింత లేకుండా ఆనాడు కాఫీ తాగి, సినిమా కెళ్ళాను. ఇంకెవ్వరూ, ఎప్పుడూ ఆ ప్రశ్న వెయ్యరు. ఒక పెద్ద సమస్య పరిష్కారం ఐపోయింది.

సుందరం బంధువులింట్లో వివాహానికి నేనూ వెళ్ళాను. రెండో నాడు పెండ్లి వారింట్లో, రెండోసారి కాఫీలు వొచ్చే సూచనలు లేకపోతే, నేను హోటలు కేసి వెళ్ళాను. ఎదురుగుండా రంగనాథం కూర్చున్నాడు. చిరపరిచితుడే.

"అయితే నువ్వు యిప్పుడెక్కడుంటున్నావు?"

ఫలానా చోటని చెప్పాను.

'అవునవును— జ్ఞాపకం వొచ్చింది. నీ కిప్పుడెంతిస్తున్నారు?' అని మొహం వింతగా చిట్లించాడు.

రంగనాథానికి యిదివరకొకసారి చెప్పడం జరిగింది. ఈ విధంగా అడిగినవాళ్ళే మళ్ళా అడగడం లంకించుకుంటే, దీనికి అంతుందా?

'అదికూడా జ్ఞాపకం చేసుకో' అన్నాను నేను.

'వెనకోసారి చెప్పావు. నాకు మందమతిరా.'

'నా మాటకేంగాని, నీ విషయం చెబుదూ. జీతం విషయం కాదు. మీ ఆవిడ ఆరోగ్యం ఎట్లా వుంటోంది? ఆ మధ్య చాలా జబ్బుచేసిం దటగా?' అన్నాను, ధోరణి తప్పిద్దామనీ, నిజంగా తెలుసుకుందామనీ.

"ఇప్పుడు నింపాదిగానే వుంది. న్యూమోనియా. రెండునెల్ల జీతం వొదిలింది డాక్టర్లకి. ఐదా రొందలైంది" అని మౌనంలోపడ్డాడు కష్టాలు స్మరించుకుంటూ. ఇంక ఆ మనిషిని కదపడం మంచిది కాదని తోచింది. ఎందుకంటే అతని జీతం ఎంతో నేను అడక్కుండానే నాకు చెప్పాలని వుబలాటపడి చెప్పేశాడు. తన జీతం తెలియపర్చిన వ్యక్తి అవతలవాడి దెంతో కనుక్కోకుండా వదలడని స్వానుభవం. మెల్లిగా లేచి బిల్లు చెల్లించి రాబోతున్నాను.

'ఉండు, నేనూ వొస్తున్నా' అని లేచి వొచ్చాడు.

రోడ్డుమీదికి రాగానే ఈ ధీరోదాత్తుడు అడిగేశాడు.

'అవుతే నీ కెంతిస్తున్నారంటావు?'

'న్యూమోనియా చాలా ఖరీదైన వ్యాధన్నమాట!' అన్నాను.

న్యూమోనియాని వర్ణించాడు రంగనాథం. పందిట్లోకి చేరుకున్నాం. పన్నీరు జల్లేటందుకు రంగనాథాన్ని పిలిచారు. వెళ్ళాడు నన్ను శాంతి ఆవరించింది.

ఎంతో సేపు లేదు.

బంధువులు, మిత్రులు, పరిచితులు వో పదిమంది పోగయ్యారు. ఆడపెళ్ళివారి పీనాసితనాన్ని చర్చిస్తున్నారు. చర్చల్లో పాల్గొన్నవారిలో ముఖ్యుడు, వొకాయన, పొడుగ్గా వుంటాడు. గిరిజాలు, వెడల్పాంటి జరీ కండువా, కోటుజేబు గడియారం అవి వున్న ఆ పెద్దమనిషి, నా పక్కన కూర్చున్న కళ్ళజోడు వ్యక్తిని సంబోధిస్తూ—

'మీరెవరి తాలూకు?' అని అడిగాడు.

కళ్ళజోడు వ్యక్తి ఆడపెళ్ళివారి తాలూకే నని తెలిసిపోయిందా:

'ఏం చేస్తున్నాడు?'

ఫలానా అని చెప్పాడు.

'మీ కేమిస్తారు?'

సభ సమాధానంకోసం వర్షంకోసం తపిస్తూ మేఘాలకేసి చూస్తున్న కర్షకుడి మాదిరి నిశ్శబ్దంగా వేచి వుంది.

కళ్ళజోడు వ్యక్తి తటపటాయించాడు. మేఘాలు దట్టంగా అల్లుకుంటున్నాయి.

'ఎనభై' అన్నాడు—వడగళ్ళవాన పడింది.

గిరజాల ప్రతిభాశాలి వికటంగా నవ్వుతూ ఇల్లా అన్నాడు:

'మా వాళ్ళ తాలూకొకడు మీ దాంట్లోనే వున్నాడు. నలభై అని చెప్పాడే!' అన్నాడు.

సభలో కలకలం, ఆశ్చర్యం.

కళ్ళజోడు వ్యక్తి—అసత్యవాది—మోసగాడు, దొంగ—దొరికి పోయ్యాడు. సత్యాన్ని కాళ్ళూ చేతులూ కట్టేసి, గిరజాల అతను అర చేతిలో పెట్టి నొక్కుతున్నాడు.

'నలభైని రెండెట్లు గుణిస్తున్నారే!' అని రెట్టించాడు. కళ్ళజోడు వ్యక్తి తన జీతాన్ని రెట్టించినట్లు.

కళ్ళజోడు వ్యక్తి కడు చతురుడు.

'అంటే, అసలు జీతం—బేసిక్ పే—నలభయ్యే ననుకోండి. వార్ ఎలవెన్సు, సిటీ ఎలవెన్సు, తిండి ఎలవెన్సు ఆ ఎలవెన్సు, ఈ ఎలవెన్సు అన్నీ కలుపుకుని, ఏభై, ఏభై, ఐదు, అరవై, డెబ్బై, డెబ్బైఐదు దాకా దేకుతాయి' అన్నాడు. కాని, ఎన్ని కలిపినా ఎనభై కి దేకందే! సభ

అతన్ని చూసి జాలిపడ్డారు. కళ్ళజోడు వ్యక్తిని నిజంగా ఈ పరీక్షకు లాగి నందుకు రెండు నెల్లపాటు హాస్పిటల్లో వుంచాలనిపించింది.

గిరజాల భూతద్దం దృష్టి నామీద ఎక్కడ పడుతుందోనని భయ పడుతూనే వున్నాను. సత్యాన్వేషకుణ్ని ఎవరు అరికట్టగలరు? నామీద కూడా పడ్డాడు.

'మిమ్మల్ని ఎక్కడో చూసినట్లున్నాను' అన్నాడు.

"అవునవును. మీకు నా విషయం అంతా తెలుసు. జ్ఞాపకం చేసు కోండి" అన్నాను.

"కాకినాడా ?"

"ఇంకా సందేహమా" అనేశాను తెగించి.

"ఇప్పు డేం చేస్తున్నారు ?"

"అప్పు డోటీ, ఇప్పు డోటీ ఉంటుందా; ఎప్పుడూ వొకటే" అన్నాను.

సభికులలో కిలకిలలు.

"స్మరణకు రావడంలేదు" అన్నాడు గిరజాల భక్తుడు.

"తమ రేం చేస్తున్నారు? అన్నాను. చూడండి—నలుగుర్లో కెళ్ళి మాట్లాడడం అంటే నా కెంతో హడలు. అట్లాంటిది, సంఘం నా కెంత ధైర్యం ఇచ్చిందో!

"నేను రిటైరయ్యాను లెండి" అన్నా డాయన.

ఆ బాణంతో నే కూలాను.

క్షణేపు సమాధిలో పడి తేరుకుని గిరజాల ప్రవక్త ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు.

"మీ కేమిస్తున్నారు ?"

నేను సమాధానం చెప్పకూడదన్ని నిశ్చయించుకున్నాను.

"మీ పెన్షన్ ఏమాత్రం ?" అన్నాను.

ఉద్రేకంతో తెల్ల గిరజాలు వూగిసలాడాయి.

"మాదంతా ఐపోయింది. మీది వోల్డు స్కేలా, న్యూ స్కేలా ?"

"మాది తులాభారం. భక్తితో తులసిదళం వేస్తే తూగిపోతాం" అన్నాను.

ఇద్దరు ముగ్గురు సంతోషించారు. ఒకరు మెచ్చుకున్నారు కూడా.

"ఏదో పెద్దవాణ్ని అడిగాను, చంపక చెప్పవయ్యా" అన్నాడు గిరజాల వ్యక్తి.

"చెప్పకపోతే మరణమే నంటారు ?" అన్నాను.

"ఓర్నీ ఇది బంగారంగాను—చెబుదూ."

గిరజాల వ్యక్తి నన్ను బుజ్జగించాడు, బెదిరించాడు, కోపించాడు, ఆజ్ఞాపించాడు—కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమలాడాడు; ఏమిస్తారో చెప్పమని దీనంగా ప్రపంచాన్ని సంబోధించాడు.

"అనుభవజ్ఞులు—మీరే చెప్పుకోండి" అన్నాను. ఆయన జీవితంలో నేర్చుకున్న పాఠాలని వల్లెవేసుకుంటున్నాడు — వందా ? నూట యాభయ్యా ? రెండు వందలా ? ఏది ? అబ్బ ! బాధ ! తట్టుకోలేను—చెప్పాలి. భూమి పాదాలకింద విడిపోతోంది. ఆకాశం తలమీద కూలిపోతోంది. చెప్పు, చెప్పు—నీ కెంతిస్తారు ? ఏమిస్తారు ? దేశం చెప్పిన సందేశం అది.

సభికులు విస్తుపోయారు.

కళ్ళజోడు వ్యక్తి ఆడదైతే నన్ను రాక్షసంగా వివాహం ఆడును - అంతటి సంతోషం ప్రకటించాడు. నేను సమాధానం ఇవ్వనందుకు నేనొక కథానాయకుణ్ని అయ్యాను. సంఘం ఈ ప్రశ్న ఎందు కడుగుతుందో నా కర్థం కాలేదు, బ్రిటిషువారు పాలించిన రోజుల్లో ప్రభుత్వం నడపడానికి, వారికి చాలామంది గుమాస్తాలు కావల్సి వొచ్చింది.

మధ్య తరగతి కుటుంబాలు ఈ ఉద్యోగాలకి ఎగబడ్డాయి. వీరికి స్వయంగా కృషి చెయ్యడం గౌరవానికి లోటు. భూములను ఎవరికో వ్యవసాయాని కిచ్చి, జమీందారులా కూర్చునేటంతటి భూములూ లేవు అందుచేత వీరికి గుమాస్తాగిరి శరణ్యం. మొదట్లో గుమాస్తాలుగా చేరి, కోలెడు ఆస్తులు సంపాదించగలిగేవారు—లంచగొండితనం వల్ల. మా ముత్తాతకి తన పేరు సంతకం చెయ్యడం కూడా రాదు. రెండిళ్ళు, నాభై ఎకరాల భూమి సంపాదించాడు—ఎనిమిది రూపాయల జీతంతో. అంతేకాదు: తాలూకా గుమాస్తాగా చేరినా, ఆ రోజుల్లో నాలు ఇంగ్లీషు ముక్కలొస్తే గబ గబ పెద్ద పెద్ద ఉద్యోగాలలోకి వెళ్ళేవారు. ఆ ఉద్యోగాలకి పెద్ద జీతాలూ, హోదా కూడా ఉండేవి. హోదా వున్నవార్ని, ఎదురుగావెళ్ళి జీతం ఎంతో అడిగే ధైర్యం ప్రజా సామాన్యానికి లేదు. అంచేత వారికి ఆ హోదాలో ఎంత జీతమో తెలుసుకోవాలని ఉబలాట పడేవారు. ఆ సాంప్రదాయంలో పెరిగిన గిరజాల వ్యక్తులలాంటివారు మన సంఘంలో ఎందరో వున్నారు. వారంతా అందువల్ల ఈ ప్రశ్న అడుగుతున్నారనుకుని సమాధానపడే వాడిని. ఇది పెద్దవారి కుతూహలానికి సమాధానం కావొచ్చు మిగతావారి మాటేమిటి ?

జీతం ఎంతో తేల్చుకపోతే వారి బ్రతుకుతెరువు సాధ్యం కాదు. ఒక మృగం మరొక మృగాన్ని అడివిలో ఎదుర్కొంటుంది. తన కంటె బలమైనదైతే అది శత్రువు: దాన్నుండి పారిపోతుంది. తనకంటె బలహీన మైనదైతే దాన్నితినేస్తుంది దానితో సమానమైనదైతే చెలిమిచేస్తుంది. మనుషులలోనూ అంతే. జంతువులలో బలాబలాలు నిర్ణయించేటందుకు తగినంత పరికరాలున్నాయి — కోరలు, కొమ్ములు, జూలు పంజాలు, ఎత్తు ఎగరడం, దూకడం. మనుషులలో ఈ ఉపకరాలు లేవు ఏ కొద్దిమందికో మోటారుకార్లుండొచ్చు. మిగతా విషయాలలో ఇంచుమించు అందరూ ఒకేలా గుంటారు. పైగా మేడలకి, కార్లకి, జీతానికి సంబంధం వుంది. అందుకని, అదెంతో కనుక్కుంటారు.

అవతలవారి జీతం తెలిస్తే మనం క్షేమంగా వుంటాం. అట్లా తెలిసిన తర్వాత, వారికో విలువ కట్టేసి, సంఘంలో ఒక స్థానం యిచ్చి మనం మరో చోట విశ్రాంతిగా వుంటాం. ఈ దేశంలో ఎన్నో మతాలున్నాయి. యుగాని కొకటి చొప్పున ఆధునిక యుగంలో మరో మతం లేవదీశారు వీరు — వీరిది జీతాల మతం — పై అధికారీ, కిందధికారీ మత ప్రచారకులు. ఇచ్చేవాడు దైవం. అదెంతో తెలుసుకునేవారు భక్తులు. జీతం లేనివారు అస్పృశ్యులు ఈ తెగకి సహాయంచేసి, అస్పృశ్యతని తొలగించాలని, ప్రభుత్వం కృషిచేస్తూ వుంటుంది ఇట్లా కాక మరెట్లా సమాధాన పడటం !

మరో మూడేళ్ళు గడిచాయి. నా ఉద్యోగం మారింది. పెద్దదైంది. జీతం మూడింతలైంది. ఈ మూడేళ్ళలోనూ, జీతం ఎంత అని అడిగిన వారి సంఖ్య మాట ఎలవున్నా. వీరు కోరింది జీతం ఎంతని కాదు. 'ఇప్పుడెంతిస్తారు' అని. ఉద్యోగం మారడం, జీతం పెద్దదవడం ముప్పే నని పించింది.

నీ జీతం తక్కువగా ఉన్నప్పుడు చెప్పడానికి చిన్నతనం పడ్డావు కాని, ఇప్పుడు నిర్భయంగా, దర్జాగా, అడక్కపోయినా చెప్పకూడదా అంటారేమో మీరు! దీనికి రెండు సమాధానా లున్నాయి. గవర్నర్ జనరల్ నైతే తప్ప, నామీద నాకంటె పెద్ద జీతగాళ్ళు ఎందరో వుండనే వుంటారు. నీ జీతం ఎంత ? అని ప్రశ్నించినవారి కంటె నాది ఎక్కువ జీతమైతే, ఆ ప్రశ్నకి సమాధానం చెప్పడం సులభమే. అంచేత నన్ను ఈ ప్రశ్న అడగదల్చుకున్నవారు ముందు వారి జీతం ఎంతో చెప్పేసి నా సమాధానం కోసం ఎదురుచూడాలి. వారిది నా దానికంటె ఎక్కువైతే, సమాధానం రాదు. ఈ ఏర్పాటు ఎంద రంగీకరిస్తారంటారు? పైగా, ఇప్పుడేమిస్తారు?' అని అడగటంలో కొంత 'కసి' కూడా వుంది. అంటే, 'ప్రస్తుతం

నీ జీతం గొప్పదైనా, మొదట్లో చిన్నదే లేవోయ్!' అన్న హేళన కూడా ఉందంటావా ?

బజార్లో బాల్యస్నేహితుడు బలరామయ్య కనబడి నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. తన యిద్దరి సంతానాన్నీ చూపించాడు. బలరామయ్య డబ్బున్నవాడు. ఉద్యోగంచేసే అవసరం లేదు. ఉద్యోగాలు, జీతాలు— వాటి తఫిసీళ్ళని తెలుసుకోవాలన్న మనస్తత్వం కనపర్చనందుకు సంతోషించాను.

"ఇప్పు డెల్లావుంది నీ కథ ?" అన్నాడు. మొదట్లో బెదరిపోయాను.

"అంటే ?" అన్నాను.

"వొకటా, రెండా ?—"

నాకు భయమేసింది.

"లేక నాలా రెండా ?" అని వాక్యం పూర్తి చేశాడు.

"పిల్లలా ?" అన్నాను.

"మరింకేమనుకున్నావు. ఉద్యోగం చేసి, రెండు మేడలు కడతావనుకుంటానా ?" అన్నాడు.

"కట్టినవాళ్ళు లేరా ?" అన్నాను గర్వంగా.

"వెనకటి రోజుల్లో ఉన్నారేమో" విషయం తప్పించే టందుకు అతని పిల్లల ఆరోగ్యం కనుక్కున్నాను.

"మీ అబ్బాయి పెద్దయిం తర్వాత యేం చేస్తాడు ?" అని అడిగాను.

"అమ్మాయిని వెతుక్కుంటాడు" అని నవ్వుకున్నాడు. ఇంతలో అతన్ని స్నానానికి పిలిస్తే వెళ్ళాడు.

ఇద్దరు పిల్లలూ సిరాబుడ్డి తీసుకుని ఆడుకుంటున్నారు. పెద్దవాడు వాళ్ళమ్మ పిలిస్తే లోపలి కెళ్ళాడు. రెండోవాడు సిరా తెచ్చి నా చొక్కాకి

పెద్దవాడు గ్లాసులో కాఫీ తెచ్చి బల్ల మీద పెట్టాడు. గుమ్మం వెనక నిలబడ్డ ఆమె వాళ్ళమ్మ.

ఆవిణ్ణి నే నెరుగుదును. ఆవిడ పేరు సూరమ్మ. వెనక నాకిచ్చి వివాహం చెయ్యాలనుకున్నారు. నాకు తగినంత ఆస్తి లేదని విరమించారు. సూరమ్మకి తగిన మొగుడు ఆ జిల్లాలో లేడనుకొన్నారు—ఏ ఉత్తర హిందూస్థానంనుంచో రావాలిట! అంత చక్కందని ప్రతీతి.

"ఎక్కడుంటున్నారు?" అంది సూరమ్మ నీరసించిన కంఠంతో—ముగ్గురు సంతానం కలిగాక కంఠంలో మార్దవం ఎక్కడుంటుంది.

ఫలానా చోటని చెప్పాను. ఏం చేస్తున్నారంది; ఫలానా అన్నాను. "ఏమిస్తారు?" అంది.

నాకు మతిపోయింది. ఆ పల్చటి పెదవులు, చీకటి రహస్యాన్ని ఛేదించే ఆ నేత్రాల మెఱుపు, భౌతిక ప్రపంచానికి అతీతం కావాల్సిన ఆ సూరమ్మ అనాది సౌందర్యం, అదా నా కివ్వవలసిన సందేశం!

"రోజులు గడుస్తాయి" అన్నాను చమత్కారంగా. సూరమ్మ గాజుల జతలు మోచెయ్యిదాకా వున్నాయి. దుద్దుల రాళ్ళు మెరుస్తున్నాయి.

"నెల కింతా అని లేదూ?" అని రెట్టించింది.

"మీ రెండోవాడు భలే అల్లరి చేస్తాడు కాదు?" అన్నాను. నే వేసే ప్రశ్నలో నాకే విశ్వాసం కుదరడం లేదు.

"పిల్లలా?" అంది.

"అమ్మయ్య" అని, లోపల అనుకోవల్సింది, పైకి అనేశాను ఆవేశంలో.

"అంటే?" అని, సూరమ్మ తెల్ల బోయింది. ఆశ్చర్యంతో కనుబొమ్మలు మృదువుగా ముడుచుకున్నాయి.

"లేరు" అన్నాను.

"మీ ఆవిణ్ణి వోమారు తీసుకురా మా ఇంటికి. జీతం ఎంతో చెప్పకపోతే మానెలే" అంది.

"వాడి జీతం కథ కనుక్కుంటాగా" లోపలనుంచి బలరామయ్య కంఠం.

ఏం తను రాకూడదూ? భాగ్యవంతులైతే, వారింటికి నా భార్యని తీసుకెళ్ళాలి! తీసుకెళ్ళి ఉద్యోగం వయసం అంతా బైటపెట్టి వినోదించి, మళ్ళా తిరిగి నాకు వప్పచెపుతారా! సరే అన్నాను ఆ సమయంలో—లోపల పంపకూడదని నిశ్చయించుకున్నాను. సౌందర్యం, భాగ్యం—రెండూ సూరమ్మ విషయంలో గర్వకారణాలే కాకపోవచ్చు. నా కల్లా కనిపించింది. ఏం చెయ్యను? నా మనస్సు తప్పితే, నా కింకే యథార్థం వుంటుంది?

ఇంతట్లో బలరామ య్యొచ్చాడు.

"అబ్బో నువ్వేక్కడ! పెద్ద ఉద్యోగస్తుడ వయ్యావు. నువ్వు మీ ఆవిణ్ని తీసుకొస్తావా?" అన్నాడు వెటకారంగా. వెటకారంగా అన్నా, అత నన్నది నిజమేనని లోపల స్ఫురించింది. ఆలోచించండి. పెద్ద జీతం వాడు, చిన్న జీతం వాడింటికి సామాన్యంగా వెడరాడూ? వెడితే వాళ్ళ గృహం పావనం చేసినట్లు భావిస్తాడు. చిన్న జీతంవాడు, పెద్ద జీతంవాడింటికి వెడితే చిన్నతనం అనుకోని వెళ్ళడు. మొత్తంమీద ఒకడింటికి ఇంకొకడు వెళ్ళడు. బాల్యంలో ఎంత స్నేహితులైనా, ఇద్దరిమధ్యా ఒక గోడ లేస్తుంది. మొదట్లో కేవలం యిటికల గోడ—మధ్య మధ్య శుభ కార్యాలూ, పండుగలూ—అనే కంత లుంటాయి. ఈ కంతలు కూడా కొంత కాలమే. వారి వారి భార్యలు రాగానే, కంతలు పూడ్చి, సిమెంటు చెయ్యడం జరుగుతుంది.

"ఏం, మాట్లాడవేం? అని భుజంమీద చరిచాడు. కంగారుపడి లేచాను. అవుననీ, కాదు కాదనీ నవ్వేశాను. ఆడదానికి కన్నీరు, మొగాడికి నవ్వూ అవాంతరాలలో అభయం.

"నువ్వూ, సూరమ్మా మా ఇంటికి రాకూడదూ?" అన్నాను. బలరామయ్య ఆశ్చర్యపడ్డాడు.

"మా ఆవిడ పేరు నీ కెట్లా తెలిసింది?" అని అడిగాడు.

"శుభలేఖలో ఉండదూ?" అన్నాను.

"ఓర్—నీకింకా జ్ఞాపకం వుందా?"

"మందమరపు భాగ్యవంతుడి శీలంలో మణిలాంటిది" అన్నాను హాస్య ధోరణిలో.

"బీదార్పు లారుస్తున్నావు—నీ జీతం ఎంతేమిటి?" అని అడిగే శాడు. నా తెలివితక్కువని నిందించుకొని నాలిక కొరుక్కున్నా.

"చెప్పవేం?"

"నాలో సంస్కారాన్నిబట్టి, నా జీతం నువ్వే నిర్ణయించొచ్చు" అన్నాను నిగూఢంగా.

"జీతాన్ని బట్టి సంస్కారాన్ని నిర్ణయిస్తే, జమీందారులు గొప్ప సంస్కారంగల వాళ్ళవాలి" అన్నాడు బలరామయ్య.

"నువ్వు చెప్పింది తొంభై పాళ్ళు నిజం. కాని చిన్న భేదం వుంది. జమీందార్ల ఆదాయాన్ని జీతం అనరు. అది ఆర్జించని రాబడి. అదే మన నాగరికతకీ, కళకీ, విజ్ఞానానికీ, సంస్కారానికి పునాది—వెన్నెముక" అన్నాను, తెచ్చిపెట్టుకున్న ఆవేశంతో.

"స్వార్జితం కాని రాబడి గలవాళ్ళకి తప్ప మిగతా వాళ్ళకి సంస్కృతి లేదంటావు?"

"లేదన్ను. వారి సంస్కృతి యొక్క పరిమాణం, జీతాన్ని బట్టి నిర్ణీత మౌతుంది."

"ఒప్పుకుంటాను మహానుభావా! అప్పుడే నీ సంస్కృతినిబట్టి జీతం వెయ్యి రూపాయలని నాకు స్ఫురించింది" అన్నాడు బలరామయ్య హేళనగా.

"జీతాన్నిబట్టి నిర్ణీతమయ్యేది వాక్క సంస్కృతేకాదు. అజ్ఞానం

కూడా ఎదుగుతూ వుంటుంది" అన్నాను. బలరామయ్యకి అది నచ్చలేదు. ఓ విధంగా నాకుగూడా నచ్చలేదు.

"పోనీ, సరేనంటాను. అజ్ఞానాన్నిబట్టి చూచినా, నీ జీతం పన్నెండు వొందలకి తక్కువ కాకూడదు" అన్నాడు బలరామయ్య నవ్వుతూ.

"బాగుంది. అజ్ఞానంలోంచి, సంస్కృతి తీసెయ్యి" అన్నాను.

"ఉండు, ఉండు....తీసివేతలూ, భాగారాలూ మనకి బాగా రావు—ఆ....రెండు వొందలన్నమాట" అన్నాడు.

"సరిగ్గా అంతే కాదనుకో....ఆ చుట్టుపక్కల...."

"హా స్తసాముద్రికంలాంటి కొత్తశక్కి కనుక్కున్నావే ! సరిగ్గా ఎంత జీతమో ఎట్లా తెలుసుకోవాలో, ఏదైనా మార్గం పట్టుకుని, వో పుస్తకం వ్రాసిపారెయ్యకూడదూ ?" అన్నాడు నవ్వుతూ.

"సరియైన అంకె రావాలంటే ఓ మార్గం వుంది. దానికి తికమక లున్నాయి. జీతగాడి భార్యయొక్క అజ్ఞానం, సంస్కృతీ కూడా నిర్ణయించి భర్తకీ, భార్యకీ వున్న వ్యత్యాసం ఎంతో, అది సరియైన సంఖ్య."

"గొప్పగా వుంది. దీన్నిబట్టి నా జీతం ఎంతో చెప్పు ?" అన్నాడు.

"నీది జీతం కాదు. ఆర్జించని ఆస్తి" అన్నాను.

"చంపేశావు. పోనీ స్త్రీలకి జీతం లేదు కదా, వారి సంస్కృతిని నిర్ణయించడం ఎట్లా ?" అని అడిగాడు.

"వారి సంస్కృతి చక్కదనాన్నిబట్టి నిర్ణీతమౌతుంది. మొగాడికి జీతం అవకాశాలు కల్పించినట్లుగానే, ఆడదానికి చక్కదనం అవకాశాలు కల్పిస్తుంది."

"ఈ సిద్ధాంతం ప్రకారం, చక్కదనం కొద్దీ ఎక్కువయ్యేది అజ్ఞానమా, సంస్కృతా ?"

"అవకాశాలు" అన్నాను.

"అంటే ?"

"భాగ్యం యిష్టం వొచ్చినట్లుగా జీవించే అవకాశాలు కల్పిస్తుంది. విశ్రాంతి, అదనంగా డబ్బు — రెండూ వుంటేనే సంస్కృతి వుంటుంది. స్త్రీకి ఈ రెండూ చక్కదనంతో వొస్తాయి అంటే, ఈ రెండూ వున్నవాడు ఆమెకు లభిస్తాడు.

"ఆగు, ఆగు, లభించింతర్వాత, మొగుడికి ఆ రెండూ పోతే !"

"ఆ విషాదగాథలు సాంఘిక జీవితంలో కల్లోలానికీ, సారస్వత అభివృద్ధికీ కారణాలు."

"మరోటి, కర్మవశాత్తు ఒక అందమైన ఆడదానికి ఈ రెండూ లేనివాడు లభిస్తాడనుకో, అప్పుడు ?" అని అడిగాడు.

"అవకాశాలుండనే వుంటాయి. తన చక్కదనంవల్ల, మొగుడికి ఆ రెండూ లభ్యమవచ్చుకూడా" అన్నాను. బలరామయ్య ఎందుకో ఆలోచనలో పడ్డాడు. మనిషి మొహంలో 'కళ' తగ్గింది. నా వ్యాఖ్యానం సూరమ్మకు అన్వయించి బాధపడుతున్నాడా ? ఏమో ! సెలవు తీసుకుని నే వెళ్ళిపోయ్యాను. ఆ మర్నాడు ఆదివారం సాయంత్రం అతడు మా యింటికొచ్చి సుందరాన్ని చూసి, కొంత తేరుకుని వెళ్ళిపొయ్యాడు. నా కదొక అపూర్వమైన అనుభవం.

ఆవేశంలో, అనేక సిద్ధాంతాలు చేసేశాను నాగరికతపై విప్లవం చేసేశక్తి అందరికీ వుండదు. వంటింట్లో విప్లవం చాలా సులభం. మూడు సంవత్సరాలైన తర్వాత, బలరామయ్య, సూరమ్మను విడిచిపెట్టేశాడని విన్నాను. ఎందుకో వివరంగా తెలిసింది కాదు. నా జీతం ఎంతో అడక్కపోతే, సూరమ్మ జీవితం అట్లాగై వుండదేమో ననిపించింది. 'జీతం' 'జీవితం' — అక్షరాలు, అర్థం, ఎంత దగ్గిర !! సృష్టి రహస్యం అర్థం కాకుండా, వొక్క అక్షరం అదనంగా వుంది !

మరో మూడు సంవత్సరాలకి నా జీతం మూడింతలైంది. నా సమకాలికు లందరికీ జీతం ఎంతో తెలిసిపోయింది. మరో తరం బయలు దేరింది. వారందరికీ మేం పెద్దలం; ఆదర్శవ్యక్తులం; మార్గదర్శకులం. మా జీతాలతో వారి కంత నిమిత్తం లేదు; మా కంత గౌరవం వుంది సంఘంలో.

అలవాటు చొప్పున నా సమకాలికులలో కొందరు యింకా నిలేసి నా జీతం ఎంతో అడిగిన వాళ్ళు లేకపోలేదు. ఏం చేస్తారు? అడిగేటందుకు వాళ్ళకి మరో ప్రశ్న కనబడలేదు పాపం! ఇచ్చేటందుకు మరో సందేశం లేదు.

భార్య ఆరోగ్యం?
పిల్లలు కులాసా?
ఇంక్రిమెంటొచ్చిందా?
ట్రాన్సఫరైందిటగా?
రిటైరైతే పెన్షనెంత?
ఇది—వారు పాడుకునే భావగీతం.

నా కాడపిల్లలు లేరు. అంచేత అల్లుడు లేడు. ఉంటే వారు చేసే గానం వేరు.

అల్లుడి కేమిస్తారు?
అబ్బాయి కేమిస్తారు?
పెద్ద కుటుంబాలైతే ఖండకావ్యం ధోరణి వేరు.
మొదటి వాడికి రొండొందలా?
రెండో వాడికి వందా?
మూడో వాడికి, చిత్రం, మూడొందలుటగా?
చిన్న చదువుకి పెద్ద జీతం.
అజ్ఞానానికి సున్నా.

అయ్యో పాపం! జ్ఞానానికి అరసున్నా!

ఆ రోజుల్లో నా జీతం అడిగేవారు, యించుమించు నా గడింపే కలవారు. వీరు ప్రశ్నించే ఫక్కీ వేరు — అదొక కళ. వీరు హైరోడ్డుమీద వడవక సందులమ్మట పడతారు.

రామనాథం, నేనూ రైల్లో ప్రయాణం చేస్తున్నాం. మేం యిద్దరం ఎరుగున్న కుటుంబరావును గురించి మాట్లాడుకుంటున్నాం.

"పాపం కుటుంబం —" అన్నాడు.

"అవునవును" అన్నాను వినిపించుకోకుండా.

"ఆ జీవితంతో నా సిగరెట్లు గడవ్వు" అన్నాడు. నిజానికి నాకు రామనాథాని కెంతిస్తారో తెలీదు. పెద్ద జీతమై వుండాలి.

"నువ్వేమాత్రం ఇన్సూర్ చేశావు?" అని అడిగాడు.

"ఏమీ చెయ్యలేదు."

రామనాథం ఆశ్చర్యపడ్డాడు.

"పోస్టు బాంకులో ఏ మాత్రం?"

"సున్నా."

కొయ్యబారాడు.

"ఏం కథ, గుర్రంపందాలా....లేక...."

ఏమోలే....అల్లా అనుకోవలసివొస్తోంది."

"మరి జీతం అంతా ఏమౌతోంది?"

"ఎంత చెట్టుకు అంతగాలి" అన్నాను.

"నీ చెట్టు సైజు ఏ మాత్రం?"

అదీ నాగరీకుల మార్గం. మొహాన పేడనీళ్ళు —అందులో కాస్త పన్నీరు కలిపి మరీ జల్లుతారు.

"మాట్లాడవేం ?"

"చెట్టు ఎంత పెద్దదైతే అన్ని కొమ్మలు" అన్నాను.

"పిల్లల కవుతోందన్నమాట !"

"నీకెందుకు ?" అని అడిగాను.

వివరాలు చెప్పాడు. పెద్దవాడు రంగూన్‌లో వున్నాడు. వాడి జీతం మూడొందలు. అదృష్టవశాత్తు రైలు నిలిచింది. నేను దిగి ప్లాట్‌ఫారంమీదికి నడిచాను. రాజారావుగా రబ్బాయి, రంగారావు కనిపించాడు. నా చేతిలో బాగ్ తీసుకున్నాడు.

"ఏమండోయ్—విన్నారా—నా కుద్యోగం దొరికింది" అన్నాడు

"సంతోషం."

"ఆరంభంలో నూరు, మీ కెంతండీ ?" అని అడిగాడు. బాగ్ లాక్కుని గబగబ నడిచిపొయ్యాను.

మరో తరంవారు. వేరన్నాను యింవాకా. ఇందులో, నే పొరబడ్డాను. వారి సందేశం యిదే-అని కించపడ్డాను. ఎందులో సమానత్వం లేని యీ దేశానికి యిందులో ఐక్యత కుదిరింది. సమానత్వం అనేది మానవుడి స్వప్నంగా ఉండాల్సిందే. కాని యథార్థం కాదేమో !

నా కాపూరు కొత్త. జబ్బు చేసింది. మంచాన పడ్డాను. సుందరం కూడా నలతగానే వుంది. ఓ మిత్రుడు వొక డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన అన్నీ పరీక్ష చేసి మందు పంపించాడు. రెండు రోజులైంది. నయం కాలేదు.

"మలేరియా — రెండు రోజుల్లో తగ్గుతుంది" అని హామీ యిచ్చాడు.

"ఇది సీజన్. చైర్మెన్‌కీ యిదే జబ్బు, నా ట్రీట్మెంటే. మొన్న సబ్ కలెక్టర్ మామగారు పైరిస్తే వెళ్ళాను, మలేరియా" అవన్నీ వర్ణించాడు డాక్టర్

"మీరు ఈ వూరికి కొత్త. ఏం చేస్తున్నారు?"

ఫలానా అన్నా.

"ఏమిస్తారు?"

సబ్‌కలెక్టర్‌కీ, చైర్మన్‌కీ ఏమిస్తారో ఆయనకి తెలుసు. మరి నా విషయమో! తెలిస్తేగాని, తను అల్లుకున్న వలలో నన్ను ఇమడ్చలేడు. చేపల వలలో బురదపాము పడితే ఎట్లా? నాకు నీరసం, దిగులు, మాట్లాడిస్తాడు. ఆ ప్రశ్నకి సమాధానం యిచ్చి నేను కళ్ళు మూస్తే బిల్లు పంపక పోయినా ఆయనకి చింతలేదు.

నేను కళ్ళు మూసుకున్నాను. నాకు కోపం రాలేదు. జాలేసి ఏడుపొస్తోంది. సమాధానం యివ్వనంతవరకూ ఆయన పాదాలకింద ధ్వనించే భూకంపాన్ని నేను సమాధానం యిచ్చి మరీ చావమంటుంది సంఘం.

"బిల్లు పంపించండి" అంది సుందరం

ఆయన పంపలేదు. మళ్ళా రాలేదు.

మరో మూడేళ్ళు గడిచాయి. ఏళ్ళు గడవడం కథల్లోనే కాకుండా జీవితంలోంచి కూడా సులభం గడిచిపోవటం గురించి ఆలోచిస్తేనే జీవితం అంతా వొక దుస్వప్నంలా గుండటం, సృష్టి అంతా మాయగా తోచడం జరుగుతుందేమో! ఎంత దూరం, ఎంతకాలం ప్రయాణం చేసినా, అక్కడే వున్నాను—అద్దంలో చూచుకుంటే ప్రయాణం బడలిక కొంచెం కనబడొచ్చు. సంఘానికి నా జీతంగురించి పరామర్శలు తగ్గాయి. కొత్త వ్యక్తులను కవ్వించడానికి పోయింది. సంతాన నిరోధక మార్గం మన దేశంలో ప్రచారం కాకపోవడంవల్ల నాకు జరిగిన ఉపకారాలలో యిదొకటి. కొత్తగా జన్మించిన వారి జీతాల పస కనుక్కుంటుంది మరి:

నా జీతం పెద్దదైంది. ఇంకంతకంటె పెద్దదయ్యే అవకాశాలు లేవు. దేశానికి స్వాతంత్ర్యం కూడా వొచ్చింది. అంచేత నాకు మరో అంతకంటె పెద్ద ఉద్యోగం, "సెంట్రల్"లో దొరకడం అసంభవం కాదు.

నా అభిప్రాయాలు చాలావరకూ స్థిరపడిపోయ్యాయి. మంత్రులందరూ జీతాల కట్టలలో కనబడతారు. సంఘం అంటే ఎంత? అని అడిగే వొక ధ్వని. 'స్త్రీ' అంటే జీతాన్ని మాయం చేసే వొక శక్తి 'స్త్రీ' జీతాన్ని తగ్గించగల్దు; హెచ్చించగల్దు. అసలు లేకుండా మాయం చెయ్యగల్దు. సత్యం అంటే జీతం ఎంతో కనుక్కోవడం. సౌందర్యం జీతం ఎంతో అందంగా అడగడం. సంస్కారం అంటే అదే చమత్కారంగా అడగడం: 'కళ' అంటే అదెంతో చెప్పకపోవడం—ఈ విధంగా నా మనస్తత్వం తయారైంది. నేనేం చెయ్యను?

నేనే యింకొకరికి జీతాలిచ్చే ఏర్పాటు—అప్పుడు నన్ను 'మీరేమి స్తారు?" అని అడిగే మహానుభావులుంటారు. ఆ ఏర్పాటు లేదు; అంచేత వొక్కటే మార్గం వుంది: సన్యాసం పుచ్చుకోవాలి-సన్యాసి యివ్వడు, పుచ్చుకోడు—పుచ్చుకుంటే ఎప్పుడేనా పాలు, పళ్ళు ఇస్తే ఎప్పుడేనా కాస్తంత బూడిదిస్తాడు.

సుందరం మనస్సుకూడా స్థిమితంగా లేదు. ఏదో మూగ బాధ: నాకేసి చూళ్ళేదు; నాతో మాట్లాడలేదు. వెఱ్ఱిగా చూస్తుంది; స్వప్నంలో సంచారం; మేం ఒకరికొకరం దూరమైపోతున్నాం. పిల్లలు చెయ్యి చెయ్యి కలుపుతున్నారు. వేళ్ళు నెప్పెట్టి ఒదిలేస్తాం. శరీరాలు విడిపోయి, ఆత్మలు రెండూ ఏకమౌతున్నా యనుకోవాలి. ఏమిటో అదంతా భ్రమేమో! శరీరాలు భ్రమైతే, ఆత్మలు కాకూడదా ఏమిటి?

విశాలానందస్వామని ఒకరి దర్శనం చేశాం. ఆయన గొప్పయోగి; ఆయన్ని గురించి వింతగా చెప్పుకున్నారు. ఒక ప్రశాంతత హృదయాన్ని ఆవరించుకుంటుం దన్నారు. వొందలకొలది జనం వెళ్ళి ఆయన్ని చూచి వొస్తున్నారు. మాక్కూడా ప్రశాంతత కావాలి.

ఉదయం ఎనిమిదైంది. ఆశ్రమంలో వో పదిమందికంటె ఎక్కువ జనంలేరు. వెళ్ళి గచ్చుమీద నమస్కారం చేసి కూర్చున్నాం నేనూ,

విశాలానందస్వామి నిండైన విగ్రహం. విశాలమైన నుదురు, పెద్ద కళ్ళు, వెడల్పాటి నోరు, లావాటి మెడ—నాటకంలో విగ్గులేని భీముడి వేషంలా ఉంటుంది. నిమీలిత నేత్రుడై ధ్యానంచేసి, కొంత సేపటికి తెరుకున్నాడు. చిత్రంగా నవ్వి, దగ్గరగా జరిగిన నలుగుర్నీ కుశలప్రశ్నలు వేస్తున్నాడు. చనువుగా మాట్లాడాడు. నాకు భయం పోయింది. కొందరు యోగులు మాట్లాడరని వినికిడి. ఈయన అట్లాకాదు. నాకు సంతోషం కలిగింది. నా సందేహాలన్నీ తీర్చుకోవచ్చునని, పరమానందభరితుణ్ణయాను.

నేను ఎక్కడనుంచి వొచ్చిందీ అడిగా రాయన.

నమ్రతతో చెప్పాను.

ఏం చేస్తున్నదీ అడిగారు.

ఇంకా నమ్రతతో ఫలానా అని చెప్పాను.

"ఏమిస్తారు ?" అన్నా రాయన.

నేను స్తంభించిపోయాను. చావడం సుఖమైవుంటే, చనిపోదును కూడా. సమాధిలో పడ్డాను. ఒక గొప్ప తేజస్సు నాలో లేచింది. ఎవరో హృదయాన్ని బైటికితీసి, కడిగి మళ్లా స్వస్థానంలో ఉంచినట్లయింది. చర్మం వెనక్కి తిరిగినట్లుంది ఆ అనుభవం. జ్ఞానోదయమైంది. సత్యాన్ని తెలుసుకున్నాను. ఆత్మశుద్ధి జరిగింది. ఆత్మ పవిత్రమైంది. సందేహాలు, సంశయాలు నశింపయ్యాయి. ఆత్మబోధచే, సత్ చిత్ ఆనందాలు జీవాత్మగా మారి పరమాత్మలో ఐక్యమయ్యాయి. అదీ యీ దేశం నా కిచ్చిన సందేశం.

దాని ఫలితం ?

నేను ఉద్యోగాన్నుంచి విరమించాను.

గోదావరీ నదీతీరాన చిన్న పాకేసుకున్నాను.

ఒక ఆవుని తెచ్చుకున్నాం.

సుందరం నదిలో స్నానంచేసి, పాలు పితుకుతుంది.

ఇద్దరం త్రాగి, విశ్వాన్ని తిలకిస్తాం.

ఎవరేనా వొస్తే, కాసిని పాలిస్తాం.

గడ్డిపోచల్ని కోస్తుంది సుందరం—నేను వొక్కొ వొక్కొటే నదిలో వొదిలి అలలమీద వాటి ప్రయాణం పరిశీలిస్తాను.

సంధ్య వెలుగులో ఎఱ్ఱనై గడ్డిపూచ నీటిని పచ్చగా కలవరపెట్టి, నిశ్చితంగా కదిలి, నా మనస్సులో నిలిచిపోతుంది.

అదీ, అది నా కిచ్చిన సందేశం.

# చరిత్ర కాగ

ఏదేనా సంస్కారం ప్రచారం కావాలంటే అది విజయవంతం కాకూడదంటారు. నే చెప్పదలచుకున్న కథ ఈ సత్యాన్ని ఋజువు చేస్తుందేమో నాకు తెలీదు. అసలు ఈ కథకూడా ఎలా చెప్పాలో తెలీడం లేదు. ఈ కథలో వ్యక్తులను నే నెరుగను. నేను విన్నవీ, ఇతరుల ద్వారా తెల్సుకున్నవీ సేకరిస్తే, వాటి కూర్పుకి తుదీ మొదల్లూ, క్రమం — ఏదీ కనబడదు.

నాకు బాగా చిన్నతనం. మా బాబయ్యతో ఆ పెళ్ళికి నేనూ వెళ్ళాను. ఆ రోజుల్లో అది అపూర్వమైన వివాహంగా చెప్పుకున్నారు. వధూవరులిద్దరూ చదువుకున్నవారు, భాగ్యవంతులు, రూపసులు, వొకరి నొకరు ప్రేమించుకున్నారు — అన్నిటికంటే ముఖ్యమైనది, వేరు వేరు శాఖలకు చెందినవారు, సనాతనులు, పూర్వాచారపరాయణులు ఆ వివాహాన్ని ఖండించారు. వధూవరుల తల్లిదండ్రుల సమ్మతంలేదు. పెళ్ళికాకుంటే ఆత్మత్యాగం చేసుకుంటామన్న నిశ్చయానికి తలొగ్గి, కొందరు సంస్కర్తలు పట్టుబట్టి, మహా వైభవంగా పెద్దల సమక్షాన జరిగిన వివాహం అది. జిల్లాకలెక్టర్, ఆయన భార్య వచ్చి, 'ఈ పెళ్ళి ప్రేమ శక్తినీ, విజయాన్ని సూచిస్తుం'దని ఉపన్యసించి, భార్యాభర్తలను ఆశీర్వదించి వెళ్ళారు. పైవూళ్ళనుండి, రాష్ట్రాలనుండి శుభాకాంక్షలు, తెలి గ్రాములు వొచ్చాయి. వందలాదిగా బహుమతు లొచ్చాయి. వధూవరుల

ఫొటోలు పత్రికలు ప్రచురించాయి. ఒక పత్రికాసంపాదకుడు 'ఆదర్శ వివాహం' అన్న శీర్షికను పెద్ద సంపాదకీయం వ్రాశాడు. ఇవన్నీ ఆనాడు వింతగా చెప్పుకున్నారు. 'ఇవేం పెళ్ళిళ్ళమ్మా—కులగోత్రాలు మంట గలిశాయి' అని చప్పరించి, వేళ్ళు మిటకరించిన అమ్మలక్కలు కార్లో వూరేగుతున్న దంపతులను తలుపు సందుల్లోనుంచి చూచి, అసూయపడి నిట్టూర్చారట.

ఆమె పేరు సీతాకుమారి, అతని పేరు రామారావు. పేర్లుకూడా చక్కగా అమిరాయి అని ఎవరో ఉపన్యసించారు. గ్యాస్‌లైట్లు, కూల్ డ్రింక్స్, పూలమాలలు, కుంకం, కాగితపు పువ్వులు, సెంట్లు, తమిళ గాయకుని సంగీత కచ్చేరీ, రాత్రి పెళ్ళి వారికి ప్రత్యేక నాటక ప్రదర్శనం—అనొక అపూర్వ ఘట్టం. సీతాకుమారి, పల్చగా, అతి నాజూకుగా వుంటుంది. గ్యాస్‌లైట్ వెలుగులో ఆమె పచ్చటికాంతి తళుక్కుమంది——నవ్వినప్పుడు, ఆకాశంలో బాణసంచా వేసినట్లు, ముఖమంతా తెల్లటి వెలుగుతో మెరిసి, ఆ దృశ్యం గతంలో ఒక మహత్తర అనుభవంగా మధురస్మృతిగా నిలిచిపోతుంది.

రామారావు కూడా చాలా అందమైనవాడు. మన వారిలో పురుషుడి అందం చెప్పుకోరు. 'కుర్రాడు బాగుంటాడు' అని కూడా అనరు. 'అబ్బాయికేం, అబ్బాయి శుభ్రంగా వుంటాడు' అంటే చాలా అందమైన వాడన్నమాట. అట్లాంటి వాళ్ళు కూడా రామారావు 'మొగాళ్ళకే చూడ్డానికి బాగుంటాడండి' అనేవారు. సీతాకుమారి ఎంత గాఢంగా ప్రేమించిందో, ఆనాటి సమాజంలో పెద్దలెవ్వరూ వూహించలేరనొచ్చు.

అంతటి గాఢమైన ప్రేమ, అనుకూల దాంపత్యం చూసి దేవతలు వోర్చలేరంటాను. 'ఈ పెళ్ళి ఆరునెలలు నిలబడితే గొప్ప' అని అంచనా వేసిన పెద్దలు, రెండేళ్ళ తర్వాత వారి అన్యోన్యాన్ని చూసి ముక్కుమీద వేలేసుకున్నారు. 'ఐదేళ్ళు దాటనంకి' అని మరో మూడేళ్ళు గడు

విచ్చారు—ఈ మూడేళ్ళలోనూ ఏదో అవాంతరం సంభవించి ఆ వివాహం భగ్నం కాకపోతుందా అన్న ధైర్యంతో.

ఐదేళ్ళ తర్వాత, మళ్ళా వాళ్ళ దాంపత్యం గురించి విన్నాను. ఆమె నొకసారి నాటకం హాల్లో ముందు సీట్లో చూశాను. ప్రేమకి విద్య, భాగ్యం, సౌందర్యం తోడైతే యింకేం కావాలి ? జనం అంతా నాటకం ఒదిలేసి వారికేసి చూడడమే సరిపోయింది. ఆమె కట్టిన ఖరీదైన చీర, రవ్వల దుద్దులు, నెక్లెస్, అతని సూటు, వాచ్, అవన్నీ చూస్తే వారి భాగ్యం చాలావరకు వేషధారణకే వినియోగమౌతోందనుకోవాలి. వారిని బాగా ఎరిగున్న స్నేహితుడొకాయన మా బావయ్యతో చెబుతుంటే విన్నాను. ఆమె ఏది కోరితే అది యిస్తాడట. చీరల కోసం మైసూరు, కంచి, ఆగ్రా, పూనా వెళ్ళేవారట. హాయిగా చదువుకుంటారట. చీట్లాడుతారట, షికార్లెడతారుట. స్నేహితులు, పిక్నిక్‌లు. పార్టీలు, యాత్రలు— నిశ్చింతగా సాగిపోతున్న జీవితం వారిది.

సనాతనుల నోళ్ళు నెప్పెట్టి, ఈ దంపతుల వూసెత్తడం మానుకున్నారు. ఈలోగా బోలెడన్ని వర్ణాంతర వివాహాలు, విధవా వివాహాలు, లేచిపోయిన వారి వివాహాలు జరిగాయి. వీరంతా వెళ్ళి ఆ కొత్త దంపతుల మీద పడ్డారు. ఆచార భారంతో పండిన వారి తలలు బ్రద్దలు కొట్టుకునేందుకు ఏదో గట్టి వస్తువు దొరకాలిగా మరి ?

మరో ఐదేళ్ళు జరిగిపొయ్యాయి. నేను రామారావు, సీతాకుమారి వున్న వూళ్ళో వుండటం తటస్థించింది. ఆమెను చూళ్ళేదు కాని, రామారావుని ఒకటి రెండుమార్లు పార్కులో చూశాను. వారిని గురించి మాచాకలి 'సందెయ్య' చెబుతుంటాడు. వాళ్ళింట్లో బట్టలు కూడా సందెయ్యే ఉతుకుతాడు. వారి జీవిత భోగట్టా వాడు బాగా పరిశీలించి తెలుసుకున్నాడు.

"వారు సుఖంగా, సంతోషంగా వుంటారు కదట్రా ?"

"ఏం సుఖంలెండి, ఆమె ఎప్పుడూ విసుక్కుంటమే. ఆయన ఎప్పుడూ చీదరించుకుంటమే."

"ఎందుకు ?"

"ఏమోనండి. ఆవిడ బట్టలన్నీ పాతబడిపోయినాయి. కొత్తవి కొనరంట —ఎక్కడికీ తీసుకెళ్ళరంట."

"ఆయన తీసికెళ్ళేదేమిటి ? ఆవిడకు బోలెడు డబ్బుందిగా !"

"అదంతా అయిపోయిందండి. అయ్యగారికి ఖలే జాగ్రత్త: కానీ పోనివ్వరు. ఇంకా ఈసుబేకుని అడగండి" అన్నాడు సందెయ్య.

తరువాత ఈసుబేగ్‌తో మాట్లాడడం తటస్థించింది. అతను వృద్ధుడు. మొదటి ప్రపంచ సంగ్రామంలో పనిచేసి రిటైరై ఏమీ పనిలేకుండా వుంటున్నాడు. దేశవిభజన జరిగిన తర్వాత, ఉత్తర హిందూస్థానం నుండి వొచ్చిన కాందిశీకుల గుంపులోంచి విడిపోయిన 'అయేషా' అనే అనాథ కన్యను చేరదీసి పోషిస్తున్నాడు. ఆమె తనని తండ్రిగా చూసుకుని సపర్యలు చేస్తూ వుంటుంది రామారావు ఒకసారి భార్యమీద ఓ పుస్తకం గిరవాటెట్టాడని —అదీ స్వయంగా చూశానని చెప్పాడు. వారి సంభాషణ వల్ల తేలిందేమంటే, వారి డబ్బంతా అయిపోయిందనీ, రామారావు పీనాసిగా తయారై, భార్యని హింసిస్తున్నాడనీ, వారి ఆదర్శవివాహంలో ఏ ఆదర్శమూ లేదనీ విశదమైంది.

ఒక నెల జరిగింతర్వాత, ఈసుబేగ్ చనిపోయ్యాడు. గుండె పగిలి చనిపోయ్యాడంటాడు, చాకలి సోదెయ్య.

"ఎందుకు ?"

"రహస్యం లెగండి ఎవరితోనూ అనబోకండి. ఒకరోజు రామారావుగారు అయేషా మొఖం మీద చెయ్యేసి పట్టుగుంటం, ఈసుబేగ్ చూశాడంటండి. నాతో చెప్పాడు. నా గుండె చెదిరిపోయిందిరా అన్నాడండి. ఆ దెబ్బతో మంచానపడి సచ్చాడండి.

రామారావుకీ సీతాకుమారికీ మానసికంగా కాకుండా శారీరకంగా కూడా యింతటి ఎడబాటు జరిగింది. కారణం ? వయస్సుతోపాటు ఆదర్శం

యొక్క అంతర్యం మారుతూండడమేమో ననిపిస్తుంది. మానసికంగా ఎడబాటు జరిగింతర్వాత, మనోవ్యాధినుంచి పారిపొయ్యేటందుకు 'అయేషా' కావల్సి వచ్చిందేమో! సీతాకుమారి చాలాకాలం వాళ్ళ ఊళ్ళోనే వుంటోంది— ఎప్పుడో కాని భర్త దగ్గర వుండదు. ఈ మధ్యనే మరో వార్త విన్నాను—రామారావు ఆస్తంతా కాందిశీకుల వసతి భవనాల నిధికి రాసేసి ఉత్తర హిందూస్థానం వెళ్ళి ఆర్మీలో ఉపాధ్యాయుడులా చేరాడని.

"ఆవిడగారికన్కూడా కొంత యిచ్చి వెళ్ళాడటలెండి—అసలు సున్నా చుట్టకుండా." అన్నాడు సందెయ్య.

"అయేషా ?" అని అడిగాను.

'ఆమె యిక్కడే వుందండి. అళ్ళందరికీ కొత్తిళ్ళు కడుతుండారండి. అక్కడబోయి, ఏదో పన్లో చేరుతుందంటండి.'

'రామారావు ఆమెని తనతో ఎందుకు తీసికెళ్ళలేదు?'

'నేను నిలేసి అడిగానండి ఆ పిల్లని. అదంతా వొట్టిదంటండి. ఊరికే దాని గడ్డం పట్టుకుని, కళ్ళల్లోకి దిగులుగా చూశారంటండి. అంతకి మించి ఏమీ చెయ్యలేదని ప్రమాణంచేసి చెప్పిందండి. అదిమట్టుకు అబద్ధం ఆడదండి' అని ముగించాడు సందెయ్య.

చరిత్ర చీకటి గుహలలో కాగడావేసి చూసినట్లు రామారావు, అయేషా అమాయకపు కళ్ళల్లోకి చూసి, తన హృదయంలో నిండుకున్న ఏకాంతాన్ని, విషాదాన్ని ఆమె చూపులో స్పృశించి. ఆదర్శాల ఐక్యత, మానసిక సమత్వం, సంతృప్తి పొందాడు. అతను పీనాసివా వుండి పోగు చేసిన సర్వస్వమూ, సత్కార్యానికి, లోక కళ్యాణానికి దానం చేసేశాడు. భార్యవద్ద నుండి దాచిన యేకాంత మాధుర్యాన్ని ప్రపంచానికి ఖర్చు పెట్టేశాడు. తను మానసిక స్వాతంత్ర్యం కోరి, భార్యకి ఆ స్వాతంత్ర్యం యిచ్చేశాడు. ఆమెను సోమరిగా వొదిలేసి, తను ఆర్మీలో చేరాడు. అంచేత సంస్కారం ప్రచారం కావాలంటే, అది పూర్తిగా కొనసాగకు దదన్నారు.

# 'నోసటున్ వ్రాసిన వ్రాత'

గడియారం కేసి అదప్పుడే పదోమారు చూడటం. ఆరైంది. రైలు రావడం ఎనిమిదింటికి, రాజమ్మ రాత్రి బండిలో రావడం మెరుగైంది. తిన్నగా యింటికే తీసుకురావడానికి నిశ్చయించుకున్నాడు. మళ్ళా గడియారం కేసి చూశాడు మాధవరావు. భార్యతో చెప్పడానికి ధైర్యం చాలడంలేదు. మేనరికం; చిన్నప్పటినుంచీ బాగా ఎరుగున్న మనిషే అందుకే ఒక విధంగా ఆమెను నిజంగా ఎరగనట్లనిపించింది.

నిజంగా సీతారత్నం గురించి అతనికేం తెలుసు ? ఆమె నుదుటి మీద అరంగుళం పొడుగు గీత వుంది. చిన్నప్పుడు తగిలినదెబ్బ. మేనరికం గనక ఆమె చక్కదనం ప్రశంస ఎవరికీ రాలేదు. అతనికీ రాలేదు. రాజమ్మతో స్నేహం ఏర్పడిన తర్వాత 'ఆమె చక్కనిదేనా ?' అన్న ప్రశ్న వొచ్చింది. ప్రశ్న వేసుకోడం పూర్తి కాకుండానే సమాధానం వొచ్చింది.

అరుదాటి అప్పుడే మూడు నిమిషాలైంది. రాజమ్మ ? వూహ సాగిన కొద్దీ ఆమె మూర్తి అస్పష్టమవుతోంది. వింతగా పెరిగిపోయి, వెన్నంతా వ్యాపించి, మెడని మరుగుపరచి శూన్యంలో చలనం కలగజేసి జడ— నుదుటిమీద పడ్డ గోధుమసీడలు—మెత్తటి, పల్చటి, సున్నితంగా మెరిసే సాఫీ నుదురు, చుట్టూ నల్లటి మేఘాలు—మధ్య సీతాకాలపు సూర్యకిరణం వెలిగించిన ఆకాశంలా మరపురానిది. యవ్వనం ఎప్పుడు గతించిందో

మాధవరావుకి తెలీదు. అతని జుట్టులో అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు, నడివయస్సు వి త్తనాలు, రాజమ్మ జడతో అతని యవ్వనానికి ముడి పెట్టు కుంటున్నాడు. ఆమె జడని తన జుట్టుపై రాస్తే, తెల్ల వెంట్రుకలు నల్లగా అవుతాయి. అంత నల్లని, పెద్ద జడ. లావుకాదు, సన్నమూ కాదు. వరద సీటిరంగు రెండో ప్రపంచ సంగ్రామం చివరిరోజు లవి. యుద్ధంపేరిట ఉద్యోగం తెచ్చుకోలేకపొయ్యాడు తను. యుద్ధం పేరిట, చదువు సంస్కారం లేని వాళ్ళు వేలకి వేలు గడించుకున్నారు. మధ్య తరగతి చితికింది. ఉన్న కొద్దిపాటి ఆస్తీ అక్కల పెండ్లిండ్లకై పోయింది. అప్పు చేస్తేగాని చదువు పూర్తికాలేదు. తన కిక ఉద్యోగం రాదు. నాలుగేండ్లుగా ట్యూషన్లు చెప్పుకుంటూ పట్నంలో కాపరం గడవక యీ వూరు చేరాడు. రాజమ్మ యిక్కడికొస్తుంది. ఆమె నుదుటికి అంత ప్రభావం వుందా!

గడియారంలో ఆరు యిరవై కనబడకుండా పత్రిక దానిమీద కప్పాడు. తను బీదవాడు; రాజమ్మ భాగ్యవంతురాలు. ఆమె చెవులకి రవ్వల దుద్దులున్నాయి. అసలు వాటివల్లే యింతపని జరిగింది. సినిమాలో ఇంటర్వల్ — పక్కన రాజమ్మ, ధగధగ మెరిసిపొయ్యే దుద్దులు — మెత్తటి, పల్చటి నునుపైన నుదురు. ఆ నుదుటిని తాకితే అతని తలనొప్పి తగ్గుతుందనిపించింది.

మళ్ళా మరొకసారి ఆమెని బాంక్‌లో చూశాడు. తల్లి అప్పుచేసి పంపిన ఐదువందలు జనవరిలో బాంక్‌లో వేశాడు. ఫిబ్రవరి మధ్యలోనే నూటయాభై కి వచ్చింది. వొక ముప్పై తీద్దామని వెళ్ళాడు. కవుంటర్ దగ్గర రాజమ్మ. తన బాంక్ పుస్తకం చూసి నవ్వింది. బిళ్ళ చూపించాడు. నోట్లు యిచ్చింది. తీసుకుని బల్లమీద కూర్చుని లెక్కపెట్టాడు. ఐదు రూపాయలనోట్లు ఏడున్నాయి. ఇంత అశ్రద్ధగా వుంటే ఆమెకు ఆ ఉద్యోగం వుంటుందా?

'ఇదుగో నోటు. అదనంగా యిచ్చారు'

'పొరపాటు.'

'మధ్యాహ్నం ఎంతవరకూ పనిచేస్తారు ?'

'నాలుగు.'

'మూడునలభై ప్రైమ్'.

'అబ్బా !'

మెల్లగా అన్నాడు.

'వెయిట్ చెయ్యనా ?'

'ఎందుకు ?' నవ్వింది. జెడ వెనక్కి తోసింది. తల వొంచినప్పుడు అందంగా, ప్రశాంతంగా కనిపించింది నుదురు. అమాయకత్వాని కర్థం అడిగితే, ఆ నుదురు చూపుతాను అనుకుని బెంచీమీద కూర్చున్నాడు.

నాలుగవగానే యిద్దరూ కలిసి నడక సాగించారు.

'ఆకలేస్తోంది—హోటల్ కెడదామా ?' అంది. వెళ్ళారు. ఏం కావాలో అడిగాడు. చెప్పింది.

'మీరో ?'

'నా కేమీ వొద్దు.'

'ఫరవాలేదు తీసుకోండి.'

'నా కాకలిగా లేదు.'

'ఫరవాలేదంటేనిగా, బిల్లు నే యిస్తాను.'

అతని మనస్సు చివుక్కుమంది. అమాయకంగా అన్నమాటేమో. అతని జీవితచరిత్ర ఆ బాంక్‌బుక్‌లో వుంది. ఆ చరిత్ర ఆమెకు తెలుసు. డబ్బు తీసుకున్న అంకెల వివరణ ఒక విషాదఘట్టం. తనెందుకు బాధపడాలి ?

రాజమ్మ తింటూంటే అతను చూస్తూ కూర్చున్నాడు. యవ్వనానికి అంత ఆకలా—! కాఫీ లైంతర్వాత లేచారు. ఆమె బాగ్ తీసింది. రెండు నోట్లకట్టలు చూశాడు. నెల మధ్యలో జీతం డబ్బు కాకూడదే. బిల్లు

యిచ్చింది. బైటకొచ్చి నడుస్తున్నారు. ఎవరికీ మాటలు దొరకడం లేదు. చుట్టూ జనం, కార్లు, బండ్లు.

'ఇంటి కెడతా.'

'బాగ్‌లో బోలెడు డబ్బుంది. నే దిగబెట్టనా ?'

'నాకేం భయం. మావదీ, డబ్బు. లారీ కంట్రాక్ట్లు. తెగొస్తుంది. పోయినా దిగుల్లేదులెండి' అంటూ నవ్వి, బాగ్ పూపుకుంటూ రాజమ్మ వెళ్ళింది. లారీ కంట్రాక్ట్లంటే ఏమిటో !

బల్లమీది గడియారం కేసి చూశాడు మాధవరావు. అడ్డం పెట్టిన పత్రిక గాలికి తొలిగింది. పావుతక్కువ ఏడైంది. కనబడకుండా గడియారం వెనక్కి తిప్పాడు.

భార్యని కేకేసి చెప్పాలి. ఎల్లా ప్రారంభించాలి ? రాజమ్మని గురించి ఏ వివరాలు చెప్పాలి ? మరో వారానికి మరో యిరవై తియ్యడానికి వెళ్ళినప్పుడు ఆమెని చూశాడు. నాలుగవగానే, యిద్దరూ బీచివేపు వెళ్ళారు. ఇసుకలో కూర్చున్నారు. రెండు గుప్పిట్లలో యిసక దారంలా వొదులుతోంది. గాలికి వెంట్రుకలు మెడ, నుదురు కప్పుతున్నాయి. వెనక్కితోస్తే, పాపిడ దగ్గర నుదుటిని గట్టిగా, వొత్తుగా బిగించి వుంగరాలుగా చిక్కువడి, కెరటం తుంపరలలాగ కదులుతున్నాయి. కళ్ళు తుడుచుకుంది. కళ్ళు కాటుకమధ్య పెద్దవై, అనిశ్చలంగా మెరుస్తున్నాయి. నేత్రాల వెనక నల్లని దట్టమైన అఖాతం, ఉప్పుగాలికి ఫేస్‌పౌడరంతా కరిగి చర్మం నల్లబడింది. శరీరచ్ఛాయ అసలు నలుపే—సున్నితంగా మెరిసే నలుపు.

'మరింకా యెందుకు నువ్వు పెండ్లి చేసుకోలేదు ?' అని అడిగాడు. కంఠస్వరం గద్గదమై అసహజంగా ధ్వనించింది ప్రతిధ్వనిలా.

'ఊరికెనే'

ఇసక పోస్తోంది. గాలికి అతనిమీద పడుతోంది.

"అమ్మో—కంట్లో పడిందా ?"

తుడుచుకుంటున్నాడు.

"ఊఁ దేదా ?"

"ఎవర్నైనా ప్రేమించావా ?"

ఇసుకను వొదిలేసి, గుప్పిట పమిట్లో దాచి, కొంగుతో జెడకప్పి, దిగులుగా కెరటాలకేసి చూసింది. కొంగు జారి అతనిమీద పడింది. తీసి, దులిపి, లాగి నుదుటిమీద వేలు పడేటట్లు కప్పాడు.

"అమ్మో" అన్నది.

"ఏం చెప్పకూడదా ?"

"ఏముంది చెప్పేటందుకు ?"

"ఏమీ లేదా ?"

"మీరేదన్నా చెప్పండి."

తన విషయాలు....చదువు, పెండ్లి, ట్యూషన్లు చెప్పాడు.

"ఇక్కడ కష్టంగా వుంది. మావూరు వెళ్ళిపోతున్నాను" అని ముగించాడు.

"డబ్బు యిచ్చేదా ?"

"నీదగ్గ రెక్కడిది ?"

"మావది, బోలెడుంది. అడగడు."

"నా మీ దెందుకు అంత....యిది ?"

"తప్పా ?"

"ఏమో"

"కోపమా ?"

"ఏమో"

నవ్వింది; తనూ నవ్వాడు.

గడియారం కేసి చూశాడు. తనవైపు తిప్పి వుంది. సీత తిప్పిం

దేమో. ఐదునిమిషాలు తక్కువ ఏడైంది. మరో ఐదునిమిషాల్లో భార్యతో విషయం చెప్పి స్టేషన్ కెళ్ళాలి.

ఇంకా అతనికి రాజమ్మని గురించి ఏం తెలుసు ? స్కూల్ ఫైనల్ పరీక్షదాకా పట్నంలోనే మామయ్య దగ్గరుండి చదివిందిట. తర్వాత బద్ధకించి మానివేసింది. బాంక్ మేనేజరు మోజుపడి, మామయ్యని వొప్పించి, ఆమెను పనిలో జేర్పించాడు. తండ్రి లేడు. తల్లి పల్లెటూళ్ళో వుంది. వివరాలు తెలియవు.

మరోసారి సాయంత్రం ఆరింటికి పార్కులో కలుసుగున్నారు.

"ఆదివారం వెళ్ళిపోతున్నాను." అన్నాడు.

"మళ్ళా రారా ?"

"ఇంకెందుకు వస్తాను ?"

"నన్ను చూడరా ?"

"ఓ—అదా...."

"చెప్పరేం. ఆమె కోప్పడతారా ?"

"ఏం చెప్పను ?"

"పోనీ—నేను రానా— ?"

"ఓ"

"అట్టే పెట్టుకుంటారా ?"

"ఓ"

"ఎప్పుడూ ?"

"..........."

"ఆమె వూరుకుంటారా ?"

"హిందూ స్త్రీ ఏం చెయ్యగల్దు ?"

"ఊరికే అన్నా" అన్నది రాజమ్మ నవ్వుతూ. దీపం నీడ పడి ఆమె నుదురు కనపడటం లేదు. ఊడవడానికి వొకమ్మాయి వొచ్చింది.

"చీర బాగుంది కాదు ?"

"చాలా బాగుంది."

"నాది కాదు. ఆ వూడ్చే పిల్లదీ."

"అదా" అని చూశాడు. "సినిమాలు చూసిం తర్వాత, పనివాళ్ళకి కూడా ఫేషన్లు ఎక్కువైనాయి."

"వాళ్ళు మట్టుకు మనుషులు కారా ఏం ?"

"అవుననుకో—నాబడికి మించిన పోకిళ్ళు."

"బస్తీగా."

"పల్లెల్లోనూ ఇల్లాగే వున్నారు."

"మీ కిష్టంలేదా ?"

"ఎవళ్ళుండవల్సినచోట వాళ్ళుండాలి."

"మీకు చాలా కోపాలున్నాయే. మరి మా కులం తక్కువగా, ఎట్లా సరిపడ్తుంది ?"

"ఇది వేరు."

రాజమ్మ నవ్వింది. లేచి చీర సర్దుకుంది.

బైటకి నడవడం సాగించారు. సంధు మొదలుకొచ్చారు.

"మరి నే వెళ్తాను."

"నేనూను."

"మళ్ళా వొస్తారుగా."

"నువ్వొస్తా నన్నావుగా !"

"అమ్మో !"

"ఏం, భయమనుకున్నావా ?"

"చూస్తానుగా."

గడియారంకేసి చూశాడు. ఐదునిమిషాల తక్కువ ఏడే చూపు తోంది. ఇదేమిటీ, ఇందాకే అయిందిగా. గడియారాన్ని వూపాడు. అది నిలిచిపోయింది. సీతని కేకేశాడు.

"టైమెంతయింది ?"

"అదుగో గడియారం" అని, రెండు కవర్లు చేతికిచ్చింది. "ఇందాక వొచ్చాయి."

వాటిని దూరంగా పారేశాడు.

"నీతో వో విషయం చెప్పాలి సీతా !"

ఆమె వంటింటి గుమ్మంలో నిలబడి వుంది.

"రాత్రికి నా స్నేహితురాలు వొకామె వస్తోంది."

"వొంటేనా...."

వొంట సరే....ఆవిడ....ఆమె ఇక్కడ, ఇక్కడే వుండి — వుండి పోతుంది."

"ఏం ?"

"అంతే....నీతో బాటే."

"అంటె ?"

"నన్ను ప్రేమించింది. ఇక్కడే వుంటుంది."

"ఉండనివ్వండి."

"నీకేం అభ్యంతరం లేదుగా."

సీతారత్నం పెదవులమీద నవ్వు వింతగా కరిగింది. అస్థిపంజరం కదిలినట్లుగా....వణికి గదిలో కెళ్ళిపోయింది.

మాధవరావు నిట్టూర్చాడు. కవ్వించిన కెరటం వెనక్కి దిగజారిం తర్వాత మిగిలిన ఇసుకలో తేమలాగైంది అతని మనస్సు. మాట, భావం, ధ్వని, వ్యక్తిత్వం వెదజల్లిన శక్తి....ఏదైనా సరే, నీడలా, ప్రతిబింబంలా మనస్సులో మెదుల్తాయి. ఆ అనగానే. తేమ ఇసుకలో లాగా, దిగబడ తాయి. అతని శరీరం లేచింది. కాళ్ళు లోపలికెళ్ళాయి. ఎడంకాలి జోడుని కుడికాలు స్పృశిస్తోంది. చేతులు దేనికోసమో తడుపుతున్నాయి. అవయవా లని దగ్గరకు లాక్కుని శరీరం బైట చీకట్లో కెళ్ళింది.

మరుసటి దినం.

రాజమ్మ ఎనిమిదింటికి లేచి కాఫీ త్రాగి, స్నానానికెళ్ళింది. మాధవ రావు ట్యూషన్లు చెప్పే మండువా గదిలో ఆమె మకాం. పనిమనిషి చిట్టెమ్మ గది వూడ్చింది. అందులో కాంప్ కాట్....దానిమీద ఆమె హోల్డాల్. ప్రక్కన చిన్న బల్ల మీద ఫ్లవర్‌వాజ్ అమర్చారు. సీతారత్నం బ్రెడ్ రెండు ప్లేట్లల్లో తెచ్చి బల్ల మీద పెట్టింది.

"మాట కొంచం యాసకదు ?" అంది భర్త నుద్దేశించి, అతనేమీ మాట్లాడలేదు.

"కాపులా ?"

"జాతిమత కుల వ్యత్యాసాలన్నీ వెనుకటిరోజుల్లో."

"నేనేమన్నాను ? తెలుసుకుందామని అడిగాను."

"అదంత ముఖ్యమైన ప్రశ్న కాదు."

చిట్టెమ్మ, సీతా కలిసి, పెద్దట్రంకు మోసి గదిలోకి తెచ్చారు. నేలమీద మోపకుండానే చిట్టెమ్మ ట్రంకు పట్టు వొదిలేసింది. శబ్దంతో పడింది.

"జాగ్రత్త" అన్నాడు.

"వొదిలేసి కాలు చితకొట్టుకోవడం దానికి మనసా ?"

"తగల్లేదు లెగండి." అని పనిమనిషి ట్రంకు తాకిడికి వూడిన గోడ బెల్లుని వూడ్చి వెళ్ళింది.

"ఆన లేవూరుట ?" అని అడిగింది సీత.

"ఏమో."

"తండ్రి కేం పనో ?"

"ఏమో."

"ఉన్న వాళ్ళకి మల్లేనే వుంది."

"ఊ."

"మరింకా ఎందుకు పెళ్ళి కాలేదూ ?"

"నన్నేమీ అడక్కు. నాకు నిజంగా ఏం తెలీదు. ఉస్. వొస్తోంది"

మాధవరావు, భార్య లోపలికెళ్ళారు. వంటింటి గుమ్మంలో ముందు పీటమీద కూర్చున్నాడు.

"ఆ గదిలో పెట్టాగా మీకూ్కడా ?"

అతను లేచాడు. "మీరు పదండి నే కాఫీ పట్టుకొస్తా."

ఇంతలోకే రెండు ప్లేట్లూ తీసుకుని రాజమ్మ చక్కా వొచ్చింది. తనో పీట వాల్చుకు కూర్చుంది.

"మీరు బ్రెడ్ తినరా ?"

"తినకూడదనేం లేదు."

"తింటుంది" అన్నాడు మాధవరావు.

"పట్నంలో రోజూ పొద్దుటే ఆమ్లెట్ తింటాను. మీ కిష్టం లేదా ?"

సీత తల పంకించింది.

"ఇష్టం వున్నట్లా, లేనట్లా ?"

"తింటే కదా చెప్పడం" అన్నాడు మాధవరావు.

"మీరో ?"

"నాకేం అభ్యంతరం లేదు. రేపట్నించి తెప్పిస్తాను.

తెప్పించడం దేనికి — నేను చేసి పెడతాగా."

"ఇంట్లో బాగుండదు." అంది సీతారత్నం.

"ఇది పట్నంకాదు." అన్నాడు మాధవరావు, ఆమె కేసి చూస్తూ. లావండర్ కలర్ జాకెట్టు, తెల్లసిల్కు పూలచీరా, వొదులుగా జారిన జెడా, కాటుక మధ్య కన్ను, పుష్పం వికసించినట్టుగా, తేటగా వుంది, పీట మీద రాజమ్మ.

"ఏమొండుతున్నారు ?"

"వీరకాయ. నీ కిష్టమేనా ?"

"మార్కెట్టు కెడతారా—ఇంటికే వొస్తయ్యా ?"

"అదీ వుంటుంది యిదీ వుంటుంది" అన్నాడు మాధవరావు.

"వీరకాయ దొడ్లోదే" అంది సీత.

"నే కూడా వొండేదా ?"

"నువ్వెందుకులే."

"టూ మెనీ కుక్స్ స్పాయిల్ ది....పూర్తి చెయ్యి వాక్యం" అన్నాడు మాధవరావు.

ఇద్దరూ నవ్వారు. ఇదేదో అర్థమైనట్టు కళాయిలోంచి 'చుయ్'మని నిప్పు నవ్వినట్లుగా ధ్వని బైలుదేరింది. సీతారత్నం కొంగుతో ముక్కు తుడుచుకుంటోంది. రాపిడికి ఎఱ్ఱబడింది. మాధవరావు హాచ్‌మని పెద్దగా తుమ్మాడు. తుమ్ముకి ఆజమ్మ నుదుటిమీదికి జారిన వుంగరాలు, తుపానుకి అదిరిన చిటారుకొమ్మలా వొణికాయి. రాజమ్మ జుట్టు వెనక్కి తోసింది. కొమ్మని మిగిలిన ఒంటి ఆకులా, వొక వుంగరం కనుబొమ్మని కవ్విస్తోంది. లేచి గదిలోకి వెళ్ళింది. చదువుకోడానికి పత్రిక యిచ్చాడు మాధవరావు.

"ఆమె అండీ అంటూంటే, నువ్వు "నువ్వు" అంటావేం ?"

"నాకంటె చిన్నదేగా."

ఇంతల్లోకే ట్యూషన్ల పిల్లలొచ్చారు, హాల్లో చాపలు పరచి కూర్చున్నారు.

రెండోనాడు.

మధ్యాహ్నం భోజనాలైం తర్వాత, రాజమ్మ తన గదిలో నిద్ర పోతోంది. పత్రికకోసం మాధవరావు గదిలో కెళ్ళాడు. మొహానికి అడ్డంగా చెయ్యి ఆనించి నిద్రపోతోంది. పెదవుల మధ్య వొకటి రెండు పళ్ళు మెరుస్తున్నాయి. జాకెట్టు అక్కడక్కడ చెమటకి తడిసింది. ఎడమకన్ను కాస్త తెరచివుంది తామర కొలనులో చంద్రబింబంలాగు. కొలనులో నక్షత్రాలకి మల్లె ముత్యాల చెమట నుదుటిని ఆక్రమించింది. కుంకుమ....మధ్య నల్లబొట్టుకి ప్రమాదం జరక్కుండా, వేళ్ళతో చెమట తుడిచేశాడు.

"మేలుకునే వున్నాను."

"తెలుసు ?"

"భలేవారు. నిజంగా నిద్రపట్టేసింది."

"మేలుకునే నిద్రపోయినట్లుగా వుండటం, అది నాకు తెలవడం, నాకు తెల్సునని నీకు తెలవడం....తప్పా ?"

"అమ్మో, మీలో చాలా తికమకలున్నాయే" అంటూ దీర్ఘంగా ఆవులించి, అతని వేళ్ళని తన చీరతో తుడిచింది.

"అన్ని తికమక లున్నాయని గ్రహించగల్గిన నువ్వు ఎంత అమాయకురాలవో" అని మంచంమీద కూర్చోబోయ్యాడు.

ఆమె లేచి కుర్చీమీద కూర్చుంది.

"కొత్తమంచమా....భలే రెపరెపలాడుతుంది."

"నీ కిక్కడ బాగుందా ?"

పెదవులు ఎడంగా వుంచి, కళ్ళు సగం మూసి, మెడ వెనక్కివేసి, జడ ముందుకు లాగింది. ఓ అన్నట్లు తల గుండ్రంగా తిప్పింది. మాధవరావు మనస్సు వూహాలో యిరుక్కుంది. ఇది మధురక్షణం. జీవితం అంతా....యీ తృష్ణ చిక్కటి, తీక్షమైన యింద్రియాల స్పందన, స్పృశించే

వుద్రేకం అల్లాగే వుండిపోవాలి. ఈ ఆనందం తన రెండు గుప్పిట్లలో బిగించి, కాలాన్ని కట్టెయ్యాలి. కాలం కూసినట్లు హాల్లో అలారం మోగింది.

"సీతగారు లేచారు." అంది రాజమ్మ.

మాధవరావు హాల్లో కెళ్ళాడు.

'అదేమిటే కీ యిమ్మంటే, అలారం మోగించావ్.... తెలివి తక్కువ మొద్దు,' అని సీతారత్నం పనిమనిషి చిట్టెమ్మని కసిరింది.

'ఇది గామ్లోను అనుకున్నానండి.' అన్నది అలారం పెట్టే 'కీ' ని చూపించి.

'ఏడిశావులే నడు' అన్నాడు మాధవరావు.

'ఇంతమాత్రానికే మొద్దయిపోయిందా ?' అంటూ రాజమ్మ గుమ్మంలో కొచ్చింది.

"నీ కెందుకు....నువ్వెళ్ళు.' అన్నాడు మాధవరావు.

రాజమ్మ కోపంతో వెళ్ళిపోయింది. రాజమ్మలో కోపం యిదివరలో అతను చూడలేదు.

"కోపమా ?"

"నా కోపం ఎవరికి లెక్క ?' అంటూ వొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, తలదిండులో మొహం దాచుకుని మంచంమీద వాలిపోయింది.

భుజంమీద చెయ్యివేశాడు. తోసివేసింది. మెడమీద జెడకింద చెయ్యి పెట్టి నిమురుతున్నాడు. మరో దిండు మెడ మీదకి లాక్కుంది. పక్కింటివాళ్ళొచ్చాయి, పత్రిక కావాలంటూ తలుపు తోశాడు. మాధవరావు బైటి కెళ్ళాడు.

మూడోనాడు సాయంత్రం ఐదింటికే మాధవరావు ఊళ్ళో పని చూసుగుని యింటికొచ్చాడు. చిట్టెమ్మ చెప్పింది, అమ్మగారు, రంగమ్మ గారితో కలిసి గుడికెళ్ళారని, మండువా గదిలో రాజమ్మ జడేసుకుంటోంది.

మంచంకింద పొట్లం కాగితాలు, దారాలు కనిపించాయి. చిట్టెమ్మ వాటిని తీసేసింది.

'పూరీలు తెప్పించా, ఆమ్లెట్లు కాదులెండి. సీతగారు అక్కర్లే దన్నారు. మీరు తింటారా ?"

"ఊ"

లోపలికెళ్ళి పళ్లాలు తెచ్చింది. తినడం సాగించారు.

"ఇక్కడ నీ కెట్లావుంది ?"

"ఏం చెప్పను ?"

"సీత మంచిదేనా ?"

"చాలా మంచివారు"

"కాలక్షేపం అవడంలేదా ?"

"మీ పిల్లలతో పాటు నాకూ ట్యూషన్ చెప్తారా ?"

"వాళ్ళు పిల్లలు కారు; పెద్దవాళ్ళే."

"నేను మట్టుకు ?"

"నిన్నేమని పిలవను ?"

"ఎట్లా పిలవాలనుంటే అట్లా పిలవండి"

"రాజీ - అననా ?"

"ఆమెను సీతా అంటారు, సీతీ అనరుగా."

"రాజా - అంటే మొగాళ్ళ పేరులాగుంటుంది"

"ఇప్పుడసలు నన్ను పిలవడందేనికి ?"

"నిన్నొకటడగాలి రాజీ -"

"అడగండి."

మాధవరావు దగ్గరగా వొచ్చాడు; గోడ వెనక సూర్యుడు దిగిపోతు న్నాడు. చివరి కిరణం గోడని రక్తం చిమ్మి కిటికీలోంచి కాస్త పొట్లంకట్టి పారేసినట్లు రాజమ్మ మొహం ఎఱ్ఱబడింది. బుగ్గలనీడలు ఊదాగా వున్నాయి. సంధ్యవేసిన ముసుగులా, నుదురు ఎఱ్ఱగా, ప్రశాంతంగా వుంది. ఆమె నుదుటిమీద చెయ్యి పెట్టాడు! ఆ చేతిమీద తన నుదురు పెట్టాడు; వేడి దురుసుగా అతన్ని ఆవరించింది. వేళ్ళు జుట్టులో ఇరుక్కు న్నాయి. వొంకీలస్పర్శ, మంచు శిఖరంనుండి లోయలోకి జారిపోతున్నట్లు అతిశయోక్తిగా కదులుతున్నాయి చేతికింద.

"ఇదేనా అడగడం?"

అరచేతికింద కంఠస్వరం జిలజిలా కొట్టుకుంటోంది. ఏదో వింత వాసన - జారిన రెండు గులాబిరేఖలు, చర్మం తేమలో కలిసిన పౌడర్, కెరటంలేని కొలనులో కదిలిన చేపలు చీకట్లోవేడినిట్టూర్పు, మేఘాల జోల పాటకి నిద్రపోతూ ఆవులించిన ఆకాశంలాగా, ఏదో వింతవాసన, క్షణంలో గతం గుడ్డవిప్పి గంతులేసినట్టు, బాల్యంలో వికృత దృశ్యాలు - సందులో గుడిసెలోంచి వొచ్చిన చేపలవాసన, ఎవరివో కాలు విరిగి రోడ్డుమీద కారిన రక్తం, తగలడుతున్న గడ్డివాము మధ్యనుండి బైటపడిన తెల్ల పందిపిల్ల, తుఫానుకి కూలిన చూరుకింద నలిగిపోతున్న తులసిమొక్క - స్మరణ కొచ్చాయి. కిటికీ వూచలచుట్టూ, రాజమ్మ ముంగురుల నలుపుని చీకటి అల్లు తోంది.

"భలే ప్రశ్నే!"

"నే అడగకుండా నీకు తెలవదూ."

అతని చేతిని తొలగించింది.

"తెలుసు."

"అవుతే చెప్పు."

"డబ్బు కావాలా ?"

మంచుశిఖరం కూలింది. రాపిడికి నిప్పు విశ్వం కాలిపోతోంది. అందులో కాలం కూడా మండిపోతోంది.

తలుపు తోసిన చప్పుడు....అతని హృదయద్వారాలని తెరిచినట్టు.

"మీరా ? అప్పుడే వొచ్చారే."

సీత కంఠం దూరంగా అయింది. తలుపులు దగ్గరగా మూసి వున్నాయి.

రాజమ్మ తలుపు తీసింది. భుజాలమీదకి జాకెట్టు లాక్కుంది.

"నేనూ వొద్దనుగా ఆలయానికి." అంది సీతారత్నంతో.

"వొస్తావనుకోలేదు." అని సీత, భర్తకి రెండు కవర్లు తెచ్చి యిచ్చింది.

"నాలుగు రోజులైంది యివొచ్చి, యిప్పుడేనా చూడండి" అంది.

కవరు చించబోతుంటే, చిట్టెమ్మ వొడిలోంచి రూపాయలు కింద పడ్డాయి.

"ఎక్కడివే ?"

"ఆ యమ్మగారిచ్చింది."

"పనివాళ్ళకి అట్లా గివ్వగూడదు" అంది సీత.

"ఏం తప్పా ? పని చెప్పాను. చేసింది....సంతోషంగా యిచ్చాను."

"తప్పే. మే మల్లా యిచ్చుగోలేం. మా మాట కదేం గౌరవం వుంచుతుంది ?"

"మా, మీ లెందుకులే" అన్నాడు మాధవరావు.

"మనందరికీ కలిసే పనిచేస్తుందిగా, నేనిచ్చింది డబ్బుకాదా ?"

"రోజూ అల్లా యివ్వగలవా ?"

"దాని చేతినిబట్టి వుంటుంది."

"మా యింట్లో యివ్వటానికి వీల్లేదు."

"అదే వొద్దన్నాను" అని మాధవరావు.

"ఎందుకు వీల్లేదు. నా డబ్బు నే నిచ్చుకుంటే మీకేం కష్టం ?"

"తనుమాత్రం, నా, నీ అనొచ్చా ?" అని భర్త నడిగింది.

"చిట్టెమ్మా, ఇదంతా నీమూలంగా వొచ్చింది. అవతలకి పో."

"మధ్య నామీద పడతా రేటండోయ్, పొమ్మంటే పోకుంటామా" అంది చిట్టెమ్మ.

దీపం వేసింది సీతారత్నం. రాజమ్మ అక్కడలేదు. గదిలో మంచం చప్పుడైంది. మాధవరావు వీధిలోకెళ్ళాడు. చిట్టెమ్మ పెరట్లోకెళ్ళింది. చెట్టు వెనక చందమామ.

నాలుగోనాడు—

రాత్రి పదిగంటలకి ముగ్గురూ వెళ్ళి సినిమా చూసొచ్చారు. వరండాలో వరసగా ముగ్గురి పక్కలు వేసుకున్నారు. పది నిముషాల్లోనే రాజమ్మకి నిద్రపట్టేసింది. పట్టినా పట్టకపోయినా మొహం అటుతిప్పి పడుకుంది. సీతారత్నం తన పక్క కొంచెం అవతలగా లాక్కుంది. భర్తకు దగ్గరగా చీకటి మందాన్ని చూడగలిగే వెన్నెలుంది. ఆకుల పల్చటి నీడలు, కదలక నిద్రపోతున్నాయి. కీటకం కూత, వెన్నెల పారాహుషార్ చెప్పినట్లుగా వుంది. కాలం నీడల నడుమనుండి మెల్లగా ముందుకు సాగుతోంది.

మాధవరావు లేచి హాల్లోకి వెళ్లాడు. చించి చదవని కవరులో ఉత్తరం తీశాడు. దీపం తీశాడు. మేనమామ దగ్గర నుంచి.

"....'నీ కి విషయాలు పూర్తిగా తెలియవని మీ అమ్మ చెప్పింది. మీ చదువులకీ, పెళ్ళికీ చాలా అప్పులు చేసి వున్నాము కదా! మనింట్లో

చాలా రోజులుగా పనిచేసిన మాణిక్యం అనేక పర్యాయములు అదు కుంది. అది యీ నాలుగైదు నెలలుగా ఒత్తిడి చేస్తోంది. ఎక్కువ అవస రంగా వుందిట—ప్రస్తుతం వెయ్యి కాకపోయినా వో ఐదువందలయినా సర్దుబాటుచేస్తే గాని మర్యాద దక్కేటట్లు లేదు. కూలి జనం నోటికి హద్దుం డదు గదా! మాణిక్యం వీధిని పడిందంటే వేరే చెప్పనక్కర్లేదు. భూమి అమ్మకం వెంటనే పరిష్కారం అవదు. మనం చెప్పిన ధరకు ముందు కొచ్చిన ఆసామీ లేడు. ఎల్లాగో తక్షణం సర్దుబాటుచేసే విధం ఆలోచించ డానికి మీ అమ్మ నిన్ను రమ్మని వ్రాయమంది. రత్నాన్ని పుట్టింటికి పంపక, ఇక్కడికే తీసేసుకు రమ్మంది....'

చదువుకునే రోజుల్లో సెలవల కొచ్చినప్పుడు పనిమనిషి మాణి క్యాన్ని ఎరుగున్న జ్ఞాపకం వుంది. దాని మొగుడు మొదటి ప్రపంచ యుద్ధంలో సైనికుడుగా పనిచేసి, పది సంవత్సరాల క్రితం చనిపోయాడు. పాలు వ్యాపారం, కూరల వ్యాపారం చేస్తుంది. డబ్బు నిల్వచేసి, అవసరా నికి అప్పు లిచ్చేది. తన చదువు కొంతవరకూ మాణిక్యం డబ్బుతో జరిగింది.

అలజడైంది. వెనక సీత.

"డబ్బు విషయమేనా ?"

"నీ కెట్లా తెలుసు ?"

"దస్తూరినిబట్టి—మన దగ్గరనుంచి ఎవరికేం కావాలి !" సీతా రత్నం కళ్ళల్లో ఎరుపు స్ఫుటంగాలేదు. కనురెప్పలు బరువుతో చటుక్కున మూతబడటం లేదు. నుదుటిమీద అరచేతిని ఆనించి కూర్చుంది. చెయ్యి తియ్యగానే, దెబ్బ తాలూకు గీత, పక్కన దీపం వూదానికి, ఎక్కువగా మాట్లాడడానికి అలవాటుపడని నోరు, ప్రతిదాన్ని చూడడానికి సిద్ధపడని గంభీరమైన చూపు— సీతారత్నం పరాయివ్యక్తిగా కనబడుతోంది.

తీవ్రంగా చూస్తున్నాడు. తనతో కాపరంలో ప్రతి అనుభవమూ ఆమె శరీరంలో కనిపిస్తోంది. కొత్తలో కష్టాలు, రహస్యంగా రెండో మారు కాఫీ యివ్వడం, వేరే కాన్త తీసి మిగతాది గిలకొట్టటం, బొత్తాములు కుట్టడం, చాకలి మారుచేసిన బనీను ఆరాతియ్యడం, ఫుట్‌బాలాటలో కాలుబెణికి నప్పటి కాపడాలు, కట్లు, వానలో తడిసినప్పుడు తువ్వాలుతో తలతుడవడం, కళ్ళల్లో సిద్ధపడిన కన్నీటిని పెదవులతో ఆనకట్టలా నిలిపి వెయ్యడం — అతని కన్నీరు ఆమె నేత్రాలగుండా రాలి తన చిటికెన వ్రేలి ఉంగరంపైన పడడం—విషాదాలు ఆమెలో వంపులు, ఆనందాలు ఆమెలో ఎత్తులు— తన అనుభవంతో పెరిగిన శరీరం—ఆమె నడుం గట్టిగా పట్టుకుని వక్షంలో మొహం దాచాడు మాధవరావు.

రాజమ్మ ఆవులింత వినబడింది. సీతారత్నం అతన్ని నిలబెట్టి. వరండాలో కెళ్ళింది.

"తెల్లారిందా ?"

"లేదు. వా రవతలికని లేస్తే, నీళ్ళిచ్చాను."

దిండ్లు, కొంగు, జడ, దగ్గరగా లాక్కుంది రాజమ్మ. సముద్రంలో కొట్టుకుపోతున్న చీరలా పడుకుంది.

తర్వాత, తర్వాత—

రాజమ్మకి జ్వర మొచ్చింది. ఒక్క మంచం, బల్లా వుంచి గదంతా ఖాళీచేసి శుభ్రం చేశారు. మధ్యాహ్నం రాత్రి సీతారత్నం తంగమ్మగారింట్లో చిన్న మంచం తెప్పించి పక్కనే వేసుకుని కనుక్కుంటూ సాయంగా వుంది. ఉదయం డాక్టరు చూసి వెళ్ళేవాడు. సాయంత్రం వైకుంఠపాళీ ఆట, రాత్రి మాధవరావుతో క్లైరన్సు.

శనివారం రాత్రి ఎనిమిదైంది. రంగమ్మగారింట్లో ఎవరో తాంబూలా లిచ్చుకొనడానికి వచ్చారు. రమ్మంటే వెళ్ళింది సీతారత్నం. మాధవరావు రాజమ్మ మంచం పక్కనే చిన్న బల్లమీద కూర్చున్నాడు. దీపం ఒద్దంటే మానేసి, బెడ్‌రూమ్ లాంప్ పెట్టాడు. పేపర్ చదవటానికి, ఆ వెలుగు చాలక మడిచి పెట్టేశాడు.

"యుద్ధం అయిందటగా."

"అయినట్లే."

"అవుతే ఇక మావకి లాభాలుండవన్నమాట."

"లారీ కంట్రాక్టులా" నవ్వా డతను.

"ఇంకా వో ఏడాదిదాకా, యుద్ధం అలజడి వుండొచ్చు. మీ మామకి రమ్మని వ్రాయనా ?"

"ఒద్దు, పని విడిచి రాడు. డాక్ట రేమంటాడు ?"

"మరేం పెద్ద విశేషం లేదు, ఓ వారం పదిరోజులపాటు రెస్టు కావా లన్నాడు "

"రెస్టు కాక నేనేం పనిచేసి కష్టపడుతున్నాను ?"

"రెస్టు శరీరానికే కాదు. మనసుకు కూడా ఉండాలన్న మాట."

"నా మనస్సుకేం ?"

"ఇక్కడ నీకు బాగుందా ?"

"నా మూలంగా మీకు రెస్టు లేదు. మీ రెండుకు నిద్రపోరు. కళ్ళు చూసుకోండి. ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి."

"ఏమిటో ఒక్కొక్కసా రంతే. ఓ రెండు రోజులపాటు, ఇంటి కెళ్ళ తానా ?"

ఎందుకో చెప్పమంది. డబ్బు విషయం చెప్పక తప్పింది కాదు, మంచంమీద లేచి కూర్చుంది. రండి అని హాల్లోకి తీసుకెళ్ళింది. పెట్టె తీసింది. అందులోంచి బాగ్ తీసుకుని మళ్ళా గదిలో కొచ్చింది. "ఇదీ. ఈ తాళంచెవి మీ దగ్గర పెట్టుకోండి" అంది రాజమ్మ.

"దాస్తాను."

"తాళం చెవి దాచండి. డబ్బు వాడండి."

"నీ డబ్బు...."

"నీ, నా తేడా లెందుకు ?" నవ్వింది. ఊడిన జడని మెలి తిప్పి పైకిలాగి బిగించి ముడేసింది. నుదుటిపై చిరు వెండ్రుకలు విడగా మిగిలినవి వీణతీగెల మాదిరి వెనక్కి సాగారాయి. దగ్గరగా జరిగి నుదుటిమీద చెయ్యివేసి కళ్ళల్లోకి చూశాడు. దిండులోకి దిగజారి మొహం చిన్నదైంది. కళ్ళు మూతలు పడుతున్నాయి. అర్థంలేని నవ్వు కోసం పెదవులు కదులుతున్నాయి. కణతలకింద నరాలు వానపాముల్లా గుండ్రంగా మెదలుతున్నాయి.

"చాలా ?" అన్నది.

"ఆనందాన్ని చాలు అని ఎవరంటారు ?"

"అదికాదు. డబ్బు. మరో వెయ్యి పంపమని నిన్ననే మావకి వ్రాశాను" అంది.

"డబ్బు కోసం నీతో స్నేహం అనుకుంటున్నావా ?"

"నే నటా అనుకుంటానని మీరెందుకనుకోవాలి ?"

"నీలోనూ తికమక లున్నాయి."

"మీ సావాసం."

చిట్టెమ్మ రంగమ్మగారింటికి అయ్యగార్ని కూడా వో పాలి రమ్మన్నారని చెప్పింది. దీపం కొంచెం పెద్దది చేసి వెళ్ళాడు.

మర్నాడు వెయ్యి ఇంటికి పంపాడు. రాజమ్మ జ్వరం తగ్గింది. ఎంత వొద్దన్నా వినక చిట్టెమ్మ చేత తలంటుపోయించుకుంది రాజమ్మ. దానితో జ్వరం తిరగబెట్టింది. సంగతేమిటంటే, డాక్టరు హిస్టీరియా అన్నాడు. ఆ విషయం రాజమ్మతో చెప్పలేదు మాధవరావు. ముందు

బిల్లిచ్చికాని, ఆ డాక్టర్ని తప్పించి మరొకర్ని రప్పించే వీల్లేదు. వంటింటి గుమ్మంలో కూర్చుని ఆలోచిస్తున్నాడు మాధవరావు.

"కుర్రాళ్ళ నడగండి. ఎంతేమిటి ?"

"ఓ పాతికేనా యివ్వాలి. జోగారావు ఐదురూపాయలిచ్చాడు. అది జట్కావాడికి సరిపోతుంది. మిగతా వాళ్ళు ఒకటో తేదీకి కాని యివ్వ లేమంటున్నారు. నలుగురైదుగురు రావడమే మానుకున్నారు ఎందు చేతనో."

ళ్ళ చెప్పుకుంటున్నారు రంగమ్మగారంది. మా వాళ్ళ తాలూకే చదువు చెప్పించుకోడాని కొచ్చిందన్నాను. అబద్ధం, మన కులం పిల్ల కాదంది."

"ఆమె కెట్లా తెలుసు ?"

"ఏమో. ఈ ఊళ్ళోవాళ్ళసాధ్యులు. పోనీ నా గాజులివ్వనా ? ముందు డాక్టర్ కివ్వండి."

సీతారత్నం ధోరణి అతనికి ఆశ్చర్యం కలగచేసింది. మొదట్లో ఒకటి రెండుమార్లు, వాళ్ళ వూరు వెళ్ళిపోతానంది. ఇప్పుడనడంలేదు. నర్సులాగా, రాత్రిపగలు చాకిరీ చేస్తోంది. సరిగ్గా నిద్రాహారాలు లేవు. కొంచెం చిక్కింది. ఆమె చేతినున్న గాజులు చూశాడు. ఒదులై వెనక్కి కదులుతున్నాయి. కంఠంకింద ఎముక మీద హారం ఎత్తుగా పడింది. గాజులు మార్చి డాక్టరు బిల్లిచ్చి, మరో డాక్టర్ని రప్పించాడు. ఆయన పరీక్షచేసి 'ఆల్బ్యుమిన్ వుం'దన్నాడు— అందుకనే నడుం నొప్పి ఇన్జెక్షనిచ్చాడు. రాత్రి నిద్రపట్టేందుకు 'స్లీపింగ్ డ్రాట్' యిచ్చాడు. రెస్టిమ్మన్నాడు. శనివారం రాత్రి సీతారత్నం భోజనం చెయ్యాదు. ఆలయంనించి తెచ్చిన కొబ్బరికాయ నీళ్ళు త్రాగి, అరటిపండ్లు తింది. రాజమ్మ జావతాగి నిద్రపోయింది. చిట్టెమ్మ వరండా గదిముందు పడుకుంది. మాధవరావు హాల్లో కూర్చుని కాగితం మీద లెక్కలు కడుతున్నాడు. పదకొండు

దాటింది. కిటికీ అవతల వెన్నెల గాలిపటంలా కదులుతోంది. నీడల మధ్య అతను కుర్చీమీద తల వెనక్కి వేసి కళ్ళుమూశాడు.

"కాసిని తాగండి, చల్లవ" అని సీతారత్నం కొబ్బరికాయ నీళ్ళు తెచ్చింది. అదిరిపడి లేచి కూర్చున్నాడు. కళ్ళు తుడుచుకున్నాడు.

"ఇంకా మేలుకునే వున్నావా ?"

"అప్పుడప్పుడు వో కునుకు తీస్తుంటాను. మీ రదీ లేదుగా" అని నీరసంగా నవ్వింది. చిక్కిన మొహంలో కళ్ళు పెద్దవిగా కనిపించాయి. తల కుడిబుజంవేపు తిప్పి మాట్లాడుతున్నప్పుడు చెక్కిలి, ముక్కు, వొంకర తిరిగిన గడ్డం, సగం కనబడే చెవి, సరిగ్గా చూస్తే ఆకర్షణీయమైన భంగిమం, నుదుటిమీద గీత—విడిగా వికృతంగా వున్నా, ఆ అమరికలో కలిసి, అలవాటైన ఆత్మీయతలా, వేరుగా కనపడదు. అందంగాలేని అలవాటైన ఆ గీతని చూడటం అతని కానందంగా వుంది. మనస్సుని పెంచి సంతుష్టిపరచే అనుభూతి — కుంకుడుకాయ పులుసు, నువ్వుగింజ అంట్లు తోమినచోటు, పూడ్చిపోగేసిన గది మూల, కాళ్ళు తుడిచిన పీచు, ఎడంచేతిపై వెగటు—తిలకించడంలో సంతుష్టినిచ్చే రహస్యానుభవాలు.

"పక్క వేశాను. నిద్రపొండి."

"నువ్వు పడుకో."

"ఇల్లా ఎంతకాలం ?"

సమాధానం లేదు.

"ఏవిటంటారు జబ్బు ?"

ఈ డాక్టరు కూడా హిస్టీరియా అంటాడు. వాళ్ళ వాళ్ళకి రాస్తానంటే వొద్దంటుంది.

"దాని కేదన్నా అయితే, నేనేదో చేశాననుకుంటారు వాళ్ళో

భార్య ఏమన్నా చేసిందేమోనన్న ఆలోచన ఒకసారి మాధవరావుకి తట్టి, మెఱుపల్లే మాయమైంది.

"పూర్వం ఏమనుకుంటే ఎవరికి ? నీ మనస్సు నాకు తెలుసు."

అతని మోకాళ్ళమీద తల ఆనించి కూర్చుంది సీతారత్నం.

"నీకు చాలా కష్టం కలిగిస్తున్నాకదూ ?"

"మీ కష్టంమాటో."

"నాకీ బాధలో ఏమిటో ఆనందం; ఇవాళే ఇంగ్లీషు పద్యం చెప్పడం మొదలెట్టాను. ఎక్కువ ఆనందం బాధవల్ల కలుగుతుందిట"

నవ్వు వెనక విషాదం వెక్కిరింపుట.

"మీకు సంతోషంగా వుంటే, నా కదే చాలు."

"నా మీద కోపం లేదు ?"

"మీమీద మీకు కోపం లేదని తప్ప, వేరే కోపంలేదు."

"నేను చెడ్డవాడిని కాదూ ?"

"అది తెలుసుకొన్నవాడు జ్ఞానే అనుకుంటాను."

"రాజీ అంటే నీకు ద్వేషం లేదు ?"

"ఇప్పుడు లేదు."

"ఎందుచేత ?"

"మీమీద ఎందుకు లేదో, అందుకే."

"అంటే ?"

"నాకు మీరు తప్ప ఏముంది ? మీలో ఒక భాగం అది" మాధవరావు కళ్ళంట నీళ్ళు చిమ్ముతున్నాయి. పుస్తకాలలో మాదిరి మనుషులు జీవితంలో వుంటారన్న చైతన్యం అతన్ని అల్లుకొంది చేసింది. కన్నీరు రాలడంలేదు. రెప్పలు కదిల్చాడు. గాలికి పొగ విడినట్లుగా, తేటపడ్డాయి కళ్ళు. ఆమె చెంపకింద తన వేళ్లు కన్నీటితో తడుస్తున్నాయి. ఒకరి బాధకి, మరొకరి కన్నీరు. ఎవరిది జీవితం ? ఎవరికోసం ?

"అయ్యో చచ్చాను" అన్న చిట్టెమ్మ కేక వినబడింది. తటాలున సీతారత్నం లేచి వరండాలో కొచ్చింది. అతనూ వెనకాలే వెళ్ళాడు. రాజమ్మ గుమ్మంలో వుంది. "నేనే!—మంచినీళ్ళు లేకపోతే, తీసుకుందామని హాల్లోకొస్తుంటే, కాలు దానిమీద పడిందిగావును—అంత కేకెయ్యాలిపే పుట్టి మునిగినట్లు?" అంది రాజమ్మ; "హాల్లో కెడతం బాగానే ఎళ్ళారు. మెలకువగానే వుండా. వయనం తెల్సింది, ఫరవాలేదు గందా అనుకుని కన్నుమూశా-వొచ్చి మళ్ళా ఎల్లారా? సరిగ్గా పొట్టమీదే స్తిరి...."

"ఏడిశావు పాడుముండా, కాస్తుంటె గంపంత చేస్తావు" అని రాజమ్మ కసిరింది.

"జ్వరం వల్ల—తూలావేమో—" అన్నాడు మాధవరావు. "కూతంత దూరంగా ఏసుకుంటాలెండి" అని చిట్టెమ్మ కాస్త పక్కగా లాక్కుంది చాప.

మొన్నాడు నడుంనొప్పి తగ్గింది కాని, బాగా నయం కాలేదు. ఆకలేస్తుంది. డాక్టర్ డయట్‌మీదే వుండమన్నాడు. రాజమ్మ మరో స్లీపింగ్‌పిల్ వేసుకుంది. నిద్రపట్టడంలేదు. తలనొప్పి, ఒళ్ళంతా చెమట్లు పోస్తున్నాయి. సీతారత్నం వుడుకులాం నీళ్ళలో గుడ్డ తడిపి ఒళ్ళు తుడుస్తోంది.

"ఒళ్ళంతా వాసనగా వుందికాదు—స్నానం లేక?"

"తుడుస్తున్నాగా. మరో చీర తెస్తాను" అని తలకి నూనె రాసింది; కాటుకెట్టింది; బొట్టెట్టింది. విసనకర్రతో చిట్టెమ్మని విసరమంది. భోజనం చేసి వస్తానని అది వెళ్ళింది. తనే విసురుతోంది.

"మీకు శ్రమ నామూలంగా."

"ఫరవాలేదులే."

"ఆ దెబ్బెట్లా తగిలింది?"

"చిన్నప్పుడు ఆట్లాడుకుంటూ కత్తిపీటమీద పడ్డాను."

"వారింకా ట్యూషన్లు చెప్తూనే వున్నారే...." బైట పిల్లలు, భర్త చెప్పుకుంటున్న మాటలు వినబడుతున్నాయి. సీతారత్నం బైటకెళ్ళి "ఉస్, మెల్లగా! నిద్రపోతోంది" అని చెప్పి వచ్చింది.

"భోజనానికి పొద్దుపోతోంది, మీరు వెళ్ళండి" అంది రాజమ్మ.

"నువ్వు నిద్రపోయ్యాక."

"ఇప్పుడే పోతా" అని కళ్ళుమూసి, పక్కకి తిరిగి పడుకుంది.

భోజనా లయ్యాక, వంటిల్లు బాగుచేసుగుని, సీతారత్నం హాలు పక్క గదిలో కొచ్చింది. తమలపాకులకి సున్నం రాస్తోంది.

"రాజమ్మకోసం స్టేషన్ కెళ్ళినరోజు నొచ్చింది ఆ కవరు. ఎవరి దగ్గరనుంచి ....?"

"రాఘవయ్యని నా స్నేహితుడు. పూనా మిలిటెరి ఎకౌంట్స్‌లో పని చేస్తున్నాడు."

"ఏమంటాడు—ఉద్యోగం ఏదన్నా....?"

"కాదు. మాణిక్యం అన్నకొడుకు—అరసయ్యని—యుద్ధంలో చేరాడు. రెండేళ్ళగా వాడిదగ్గరనుంచి జవాబు లేదుట. వాణ్ణి గురించి వార్త లేదట. వాడి ఫోటో యిచ్చి, ఎక్కడుండేదీ కాస్త వాకబు చేసి పెట్టమంటే, రాఘవయ్యకి ఫోటో పంపి, తెలుస్తే వ్రాయమన్నాను. నేవీలో చేరాడుట. రెండేళ్ళగా ఓడ ప్రయాణం సాగించి, దేశాలు చూసి, బొంబాయినుండి పూనా వచ్చాడుట. ఇది విను....మీ అరసున్న వో పట్టాన లొంగలేదు. వాడిమీద ఫిర్యాదనుకున్నాడో ఏమో, పేరు మాత్రం 'అసుడు' అని మార్చేశాడు వాడే. అంబాలాలో ట్రైనింగ్ కూడా పూర్తయింది.

పెర్మనెంట్ కమిషనిచ్చి, మద్రాసు హార్బర్‌కి పోసు చేస్తున్నారు. అక్కడ బంధువులు కూడా వున్నారుట. అక్కడికి వెళ్ళే వుంటాడు."

ఉత్తరం చదివి నిట్టూర్చాడు మాధవరావు. "మాణిక్యం గొడవలు రెండూ తీరినట్లే."

"ఇంకా నాలుగైదొందల లివ్వాలిటగా !"

"ఇప్పటికి నిల్చింది. మెల్లి మెల్లిగా తీర్చలేకపోతామా ?"

సీతారత్నం పక్కసర్ది కాసేపు నిద్రపొమ్మంది. ఉత్తరాలు వ్రాసి మంచంమీద పడుకున్నాడు.

"మరి నువ్వో ?"

"నే ఇల్లా వేసుకుంటాలెండి."

"వొాటి కిందా—నేనూ కిందే వేసుకుంటా. చల్లగా వుంటుంది" అని తువ్వాలుతో గచ్చు దులిపి, దిండు లాగి ఆమె తలకింద పెట్టాడు. తమలపాకులకి ఎర్రబడిన పెదవుల వెనక పళ్ళవరస తళుక్కుమంది. జుట్టురేగి నుదుటిమీద గీత మీదికి జారింది. ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"కళ్ళకింద గీతలు చూసుకున్నావా ?"

"మీవి చూసుకున్నారా ?"

"ఏం ? మనప్పే అద్దం—" అని తల చేతిమీద ఆనించి వోర గిల్లాడు.

బైట పోస్టుజవాన్ పిలుపు వినిపించింది. మరో నాలుగయిదు క్షణాలలో 'అయ్యో' అన్న రాజమ్మ కేక బిగ్గరగా వినిపించింది. ఇద్దరూ చివాలున లేచి హాల్లోకి వెళ్ళారు.

రాజమ్మ నుదుటిమీద రెండు చేతులూ నొక్కుకుంటూ, గుమ్మం మీద వాలిపోయింది. వేళ్ళ మధ్యనుండి, చెవిమీదుగా రక్తం బొట బొట కారుతోంది. మంచం హాల్లోకి లాగి, దానిమీద ఆమెను కూర్చో బెట్టారు. తడిగుడ్డ కట్టారు. అరంగుళం పొడుగు గాయంపడింది నుదుటి మీద. మాధవరావు సైకిల్‌మీద వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన అయింటుమెంటు రాసి బాండేజి వేశాడు. రక్తం మరకల బట్టలు మార్చి,

కొత్తబట్టలు ధరించి, వరండా గదిలోకి మంచం పట్టించి, రాజమ్మ దిండ్లని వెనకాల వేసుకుని, గోడని జార్లపడి కూర్చుంది.

టీ తెచ్చింది సీతారత్నం.

"పెద్ద దెబ్బే. ఇదంతా చిట్టెమ్మ పనే" అన్నది.

"అసలేం జరిగింది?" అంటూ మాధవరావు గదిలో కొచ్చాడు.

"నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. పోస్టువాడికేక విని వీధిలో కొద్దామని హాల్లో గదిముందు కొచ్చాను. తలుపుమీద చెయ్యి పడిందేమో, తలుపుమీద వున్న గొళ్ళానికున్న తాళంకప్ప, చెవి నుదుటిమీద పడ్డాయి" అంది రాజమ్మ. సీతారత్నం ఆమె తలదువ్వి జడవేస్తోంది.

"ఆమధ్య మనం కొన్న పెద్ద తాళంకప్ప, అక్కడ పెట్టుకుంటారా ఎవరేనా?" అన్నాడు మాధవరావు.

"అది చిట్టెమ్మ పనే" అంది సీతారత్నం.

"దా న్ననేం ప్రయోజనం? ఆ తలుపుమీద చెయ్యేస్తానని కల గన్నానా?"

"తాళం నొక్కకుండా గొళ్ళానికి బిగించడం తెలివితక్కువగాదూ?" అన్నాడు మాధవరావు. పాతాల కుర్రాళ్ళు హాల్లోకొచ్చారు. అతను బైట కొచ్చేశాడు.

మర్నాడు సాయంత్రం నాలుగైంది. మాధవరావు హోల్డాల్ సర్దడం పూర్తిచేసి, వరండా గదిలో కొచ్చాడు. రాజమ్మ కుర్చీమీద అద్దం పెట్టి చూసుకుంటోంది.

"ఇప్పు డెల్లా వుంది—నొప్పి తగ్గిందా?"

"ఇంక ఈ మచ్చ పోదుగా."

అద్దంతీసి కూర్చోమంది. అతను కుర్చీ యివతలికి లాగడంలో మోచెయ్యి తలుపుకి తగిలి, మూసుగుంది. గోడకాన్చిన దిండ్లమీద వొరి గింది రాజమ్మ. తల దువ్వుకోలేదు. పాపిడ కదిలిపోయింది. ఊడివజుట్టుము

పైకిలాగి బిగించి ముడేసింది. మెడలో నగలు లేవు. చెవులకి దుద్దులులేవు. చేతులకు గాజులు లేవు. బొట్టు చెరిగింది—ఎర్రగా పాపిడికేసి, మంచం మీద పూలరేకులు నలిగి వాడి పడున్నాయి. మంచంపక్క ఒరిగి నుదుటిమీద చెయ్యి ఆనించాడు మాధవరావు.

"హిస్టీరియా అంటే ఏమిటండీ ?"

"స్త్రీలకు మామూలుగా వుండే వ్యాధి—అన్నీ సక్రమంగా జరగక మానసికంగా కలతగాని, ఆందోళనగాని వుంటే, ఇవన్నీ కలిసి కలుగ జేసే అస్వస్థత హిస్టీరియా. ఫలానా అని తెలియనప్పుడు డాక్టర్లు ఈ పేరు చెబుతుంటారు."

"నా కదేట—"

"నా కట్లా గనిపించడంలేదు."

"మీకేం తెలుసు ? మీరు డాక్టరుకాదుగా" దెబ్బ తగిలినచోట వేలికి కరుకుగా తగిలింది. చుట్టూ చర్మం నలిగింది—కొలనులో నిశ్చలంగా వున్న నీటిని కామంతో కదిలిన చేప కదిపినట్టు. అద్దంలో పగులు—ఆకాశంలో మెఱుపు, మంచు ప్రదేశంలో భూకంపం. వేలు వెనక్కి మళ్ళింది కళ్ళకింద కాకిపాదాల మాదిరి చిన్ని ముడతలు శ్వాసలో గులాబి కాలినట్లు చేపలు విడినట్లు అఖాతంలోంచి ప్రజ్వరిల్లినట్లు వాసన ఆవరించి అప్రయత్నంగా అతన్ని వెనక్కి నెట్టాయి.

"ఎట్లాగో వున్నానుకదూ—తలంటు పోసుకుందామని అన్నీ సిద్ధం చేసి వెళ్ళబోతున్నా, మీరొచ్చారు."

"మరోవారంలో అన్నీ తగ్గుతాయి, బాగుంటావు."

"ఇప్పుడు బాగలేనా ?"

ఆమె రెండుచేతులు అతని మెడచుట్టూ వేసింది.

"స్నానాని కెళ్ళనా ?"

"నేను వూరెడుతున్నా. అమ్మకి వొంట్లో బాగా లేదట నిన్న ఉత్తరం అదే. మళ్ళా రేపొచ్చేస్తాను, ఏం ?"

"డబ్బు కావాలా ? మణియార్డర్ రొచ్చిందిగా."

"వొద్దు. అడగడానికి వొచ్చా ననుకున్నావా ?"

"అల్లా గనుకుంటానని ఎందు కనుకున్నారు ?"

"ఇదివర కన్నదే...."

"అబద్ధం అంటారా ?"

"నిజం రోజురోజుకీ మారదుగా."

రాజమ్మ లేచింది. బుజంమీద చేతిని తొలిగించింది "అబ్బ చెమట" అంటూ.

తలుపులు తీసింది.

"వెళ్ళనా ?"

"అమ్మగార్ని అడిగానని చెప్పండి."

మాధవరావు నవ్వుతూ బైటకొచ్చాడు. ముందు కుర్రాడు హోల్డాల్‌తో నడుస్తున్నాడు. బైటికెళ్ళి రాజమ్మ గదికేసి చూశాడు మాధవరావు. లోపలంతా నల్లగా కనబడింది. ఊచల మధ్య రాజమ్మ నుదురు— దానిమీద గీత. అది జైల్లో దృశ్యం; తను స్వేచ్ఛాజీవి.

తుది ఘట్టం—రెండు రోజుల తర్వాత.

మాధవరావు యింటి కొచ్చేటప్పటికి మధ్యాహ్నం మూడైంది. వీధిలో రాజమ్మ గదికేసి చూశాడు. కిటికీ మూసి వుంది. హాల్లోకి రాగానే సీతారత్నం వో కవరిచ్చింది. గబగబ గదిలో కెళ్ళాడు.

"వెళ్ళిపోయింది."

"అదేమిటి ? ఎప్పుడు— ?"

....ప్రశ్నార్థకంగా చూశాడు.

"వాళ్ళ కృష్ణమూర్తినీ, చిట్టెమ్మనీ సాయంవుంచి హరికథ విందామని వెళ్ళాం. ఇంటి కొచ్చేటప్పటికి పదైంది. కృష్ణమూర్తి ఒక్కడూ వున్నాడు. చిట్టెమ్మ బండి తెచ్చిందిట. కూడా స్టేషను కెళ్ళిందిట. అన్నం పెట్టుకుని తిని వెళ్ళిం...."

"సీతతో ఏమీ చెప్పలేదు?" అంటూ కవరు చూశాడు. చిరునామా పైపుకాబడి వుంది చించాడు. అందులోనుంచి రెండు కాగితాలు పడ్డాయి; వొకటి ఇంగ్లీషులో పైపు కాబడిన ఉత్తరం, రెండోది తెలుగులో—

ఇంగ్లీషుది మొదట చూశాడు. రాజమ్మకు జబ్బు చేసినప్పుడు తాము దగ్గరుంచుకొని ఎంతో ఆదరణగా కనుక్కొని చికిత్సచేసి నయం చేసి పంపిన దంపతులకు కృతజ్ఞత. కులభేదాలు గణించక యిట్లా సమానత్వం అందరూ కనబరిస్తే సంఘం పురోగమించగలదన్న ఆశ. పట్నం వస్తే వారి అతిథులుగా వుండాలని ఆహ్వానం—దాని సారాంశం—అసురు సంతకం.

"....మాణిక్యం మా అమ్మ. నన్ను మావ దగ్గర అట్టే వుంచి చదువు చెప్పించింది. అరసయ్య బావేగా. చేసుకుంటానని మావ సరదా పడేవాడు. ఇంకెవరేనా మనస్సులో వున్నారా అని వోసారి మీరడిగారు, జ్ఞాపకం వుందా. చెప్పానుగాను, నా విషయం తెలవకముందే వెళ్ళడం మంచిదనిపించింది. సీతగారికి మీరంటే వున్న అపేక్ష, మీకు ఆమె అంటే వున్న గౌరవం, కళ్ళారా చూశాను. నా విషయం మీకు తెలియదని నాకు తెలిసినప్పటినుంచీ, నాకు వొచ్చెయ్యాలని వుండేది. తాళంచెవి—తాళం చెవితో తలుపు తీసినట్లు—నేను రావడానికి కారణం. ఇంతకీ నా మొహాన అట్లా రాసిపెట్టి వుంది—"

మాధవరావు కిటికీ తలుపులు తెరిచాడు.

"బాగ్ మరచిపోయింది."

"ఖాళీబాగ్గే లెండి" అన్నది సీతారత్నం, టీకప్పు చేతికిచ్చి.

# 'తనను గురించిన నిజం'

"నే నెందుకు మంచివాణ్ణిగా ఉండాలి" అని భార్యని కసురుకున్నాడ రామ్మూర్తి. ఆ ప్రశ్నతో శాంతమ్మ ప్రశాంత జీవితంలో తుఫాను చెల రేగిందనొచ్చు.

ఇంతకీ తానుచేసిన అపరాధం ఏమిటి? బెల్లం కలిపిన కాఫీ ఇచ్చింది. భర్త కాఫీ తాగింతర్వాత "ఇది నాలుగో మాసం" అన్నది అంతే....

ఈ మాత్రానికి భర్తచేసిన వింత వ్యాఖ్యానం వితర్కించుకోడం కోసం, పెద్దబ్బాయి 'రఘు'తో వంటింట్లోకెళ్ళింది. శాంత ముగ్గురు పిల్లల తల్లి; మొగపిల్లలే. పెద్దాడిముందు అల్లా విసుక్కోడంలో అర్థమేమిటి? వాడి కింకా తొమ్మిదో ఏడే. ఐనా ఏమనుకుంటాడు? ఏమిటి మంచితనం? చేసుకున్న పెళ్ళానికీ, కన్నపిల్లలకీ ఇంత కూడెట్టడమేనా? ముందుంది ముసళ్ళపండగ. ఈసారి ఆడపిల్లైతే మరీను. అబ్బాయిల "సతుపు" లున్నాయి. బెల్లంకూడా లేని కాఫీ మహారాజులా తాగలా? సంసారంలో ఎన్నెన్నో చిక్కులు, ఇబ్బందులూ ఉంటాయి. దగ్గర దగ్గరగా ఇరవై ఏళ్ళనుంచి సాగుతున్న కాపురంలో ఎన్నో అవాంతరాలు సంభవించాయి. వాటన్నింటినీ సర్దుకుపోలా? ఎప్పుడేనా ఇలా విసుక్కున్నారా? ఐనా, ఎందుకు మంచివానిగా ఉండడమేమిటి నా తలకాయ....! హాల్లో అద్దంలో తన మొహం చూసుకుంది శాంత. ఏదో భావం స్ఫురించినట్లు చిరునవ్వుతో

పెదవి వొంపు తిరిగింది. ఆ నవ్వు మాయమవకుండానే భర్త దగ్గరకెళ్ళి "ఒకవేళ మూడో మాసమేనేమో లెండి" అంది.

రామ్మూర్తి మాట దిగమింగేసుకొని, ముందు గదిలో కెళ్ళి, పేపరు చదవడానికి యత్నం మొదలెట్టాడు. ఇందాక దిగమింగినమాటని పైకను కొని విన్నాడు. "ఇంకెంత కాలం మంచిగా వుండటం? మూడో మాసమైతే ఇంకా ఏడు నెలలా? బల్లమీద అద్దంలో మొహం చూచుకున్నాడు. కళ్ళకింద గీట్లు స్ఫుటంగా కనబడుతున్నాయి. తల్లో నెరుస్తున్న వెంట్రుకల సంఖ్య పెరుగుతోంది. రెండు మూడు రోజులదాకా క్షురకర్మ చేసుకోకుండా వుండడానికి వీల్లేదు. లెక్కకి పదహారు తెల్ల వెంట్రుకలు గడ్డంకింద, మళ్ళా జాగ్రత్తగా లెక్కపెట్టాడు; పందొమ్మిది చూపినకొద్దీ అల్లా కనిపిస్తూనే వుంటాయి. రెండోవాడు 'సేతు' బల్లకింద సిరాబుడ్డితో ఆడుకుంటున్నాడు. ఇదిగో ఈ పిల్లలే కారణం. సంతానం కలిగినప్పుడల్లా ఐదేసి నెరిసిన వెంట్రుకలు. సిరాబుడ్డి లాక్కొని, 'సేతు' వీపుమీద ఒక్క చరుపు చరిచి తోసేసి, తలుపు గడియపెట్టి, రామ్మూర్తి తన నిజస్వరూపంతో పెనుగులాట సాగించాడు.

రెండు మూడు నెలలనుంచి, మహత్తరమైన మానసిక శక్తులతో భర్త పెనుగులాడుతున్న సంగతి శాంత తెలుసుకోలేదు.

అహం తాండవించే స్మశానవాటిక అతని హృదయం. తీరని కోరికలు కళేబరాలు; సాధ్యంకాని ఆదర్శాలు మంటలు; శరీరంలో యింద్రియాలు కుంగదీసిన అహం ఏడ్చి ఏడ్చి నీరైన కలలనే నేతిని కళేబరాల మీదవేసి, ఎండిన తృష్ణ అనే కాగడాతో నిప్పు పెడుతుంది. వాటి ఆత్మలన్నీ మసిగా చీకటి విశ్వంలో మరో శరీరాన్ని వెదుక్కుంటూ పరిభ్రమిస్తున్నాయి. తనలోంచే ఆ కొత్త శరీరాన్ని సృష్టించుకోవాలి. దాని సృష్టి కోసమే యీ పెనుగులాట.

రామ్మూర్తికి నలభయ్యో సంవత్సరం వొస్తోంది. సంసారానికి

"వారింకా ట్యూషన్లు చెప్తూనే వున్నారే...." బైట పిల్లలు, భర్త చెప్పుకుంటున్న మాటలు వినబడుతున్నాయి. సీతారత్నం బైటకెళ్ళి "ఉస్, మెల్లగా! నిద్రపోతోంది" అని చెప్పి వచ్చింది.

"భోజనానికి పొద్దుపోతోంది, మీరు వెళ్ళండి" అంది రాజమ్మ.

"నువ్వు నిద్రపొయ్యాక."

"ఇప్పుడే పోతా" అని కళ్ళుమూసి, పక్కకి తిరిగి పడుకుంది.

భోజనా లయ్యాక, వంటిల్లు బాగుచేసుగుని, సీతారత్నం హాలు పక్క గదిలో కొచ్చింది. తమలపాకులకి సున్నం రాస్తోంది.

"రాజమ్మకోసం స్టేషన్ కెళ్ళినరోజు నొచ్చింది ఆ కవరు. ఎవరి దగ్గరనుంచి — ?"

"రాఘవయ్యని నా స్నేహితుడు. పూనా మిలిటెరి ఎకౌంట్స్‌లో పని చేస్తున్నాడు."

"ఏమంటాడు—ఉద్యోగం ఏదన్నా.... ?"

"కాదు. మాణిక్యం అన్నకొడుకు—అరసయ్యని—యుద్ధంలో చేరాడు. రెండేళ్ళగా వాడిదగ్గరనుంచి జవాబు లేదుట. వాణ్ణి గురించి వార్త లేదట. వాడి ఫోటో యిచ్చి, ఎక్కడుండేదీ కాస్త వాకబు చేసి పెట్టమంటే, రాఘవయ్యకి ఫోటో పంపి, తెలుస్తే వ్రాయమన్నాను. నేవీలో చేరాడుట. రెండేళ్ళగా ఓడ ప్రయాణం సాగించి, దేశాలు చూసి, బొంబాయినుండి పూనా వచ్చాడుట. ఇది విను....మీ అరసున్న వో పట్టాన లొంగలేదు. వాడిమీద ఫిర్యాదనుకున్నాడో ఏమో, పేరు మాత్రం 'అసురు' అని మార్చేశాడు వాడే. అంబాలాలో ట్రైనింగ్ కూడా పూర్తయింది.

పెర్మనెంట్ కమిషనిచ్చి, మద్రాసు హార్బర్‌కి ఫోను చేస్తున్నారు. అక్కడ బంధువులు కూడా వున్నారుట. అక్కడికి వెళ్ళే వుంటాడు."

ఉత్తరం చదివి నిట్టూర్చాడు మాధవరావు. "మాణిక్యం గొడవలు రెండూ తీరినట్లే."

"ఇంకా నాలుగైదొంద లివ్వాలిటగా !"

"ఇప్పటికి నిల్చింది. మెల్లి మెల్లిగా తీర్చలేకపోతామా ?"

సీతారత్నం పక్కసర్ది కాసేపు నిద్రపొమ్మంది. ఉత్తరాలు వ్రాసి మంచంమీద పడుకున్నాడు.

"మరి నువ్వో ?"

"నే ఇల్లా వేసుకుంటాలెండి."

"వాటి కిందా—నేనూ కిందే వేసుకుంటా. చల్లగా వుంటుంది" అని తువ్వాలుతో గచ్చు దులిపి, దిండు లాగి ఆమె తలకింద పెట్టాడు. తమలపాకులకి ఎర్రబడిన పెదవుల వెనక పళ్ళవరస తళుక్కుమంది. జుట్టురేగి నుదుటిమీద గీత మీదికి జారింది. ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"కళ్ళకింద గీతలు చూసుకున్నావా ?"

"మీవి చూసుకున్నారా ?"

"ఏం ? మనప్పో అద్దం—" అని తల చేతిమీద ఆనించి వోర గిల్లాడు.

బైట పోస్టుజవాన్ పిలుపు వినిపించింది. మరో నాలుగయిదు క్షణాలలో 'అయ్యో' అన్న రాజమ్మ కేక బిగ్గరగా వినిపించింది. ఇద్దరూ చివాలున లేచి హాల్లోకి వెళ్ళారు.

రాజమ్మ నుదుటిమీద రెండు చేతులూ నొక్కుకుంటూ, గుమ్మం మీద వాలిపోయింది. వేళ్ళ మధ్యనుండి, చెవిమీదుగా రక్తం బొట బొట కారుతోంది. మంచం హాల్లోకి లాగి, దానిమీద ఆమెను కూర్చో బెట్టారు. తడిగుడ్డ కట్టారు. అరంగుళం పొడుగు గాయంపడింది నుదుటి మీద. మాధవరావు సైకిల్‌మీద వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన అయింటుమెంటు రాసి బాండేజి వేశాడు. రక్తం మరకల బట్టలు మార్చి,

కొత్తబట్టలు ధరించి, వరండా గదిలోకి మంచం పట్టించి, రాజమ్మ దిండ్లని వెనకాల వేసుకుని, గోడని జార్ల పడి కూర్చుంది.

టీ తెచ్చింది సీతారత్నం.

"పెద్ద దెబ్బే. ఇదంతా చిట్టెమ్మ పనే" అన్నది.

"అసలేం జరిగింది ?" అంటూ మాధవరావు గదిలో కొచ్చాడు.

"నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. పోస్టువాడికేక విని వీధిలో కొద్దామని హాల్లో గదిముందు కొచ్చాను. తలుపుమీద చెయ్యి పడిందేమో, తలుపుమీద వున్న గొళ్ళానికున్న తాళంకప్ప, చెవీ నుదుటిమీద పడ్డాయి" అంది రాజమ్మ. సీతారత్నం ఆమె తలదువ్వి జడవేస్తోంది.

"ఆమధ్య మనం కొన్న పెద్ద తాళంకప్ప, అక్కడ పెట్టుకుంటారా ఎవరేనా ?" అన్నాడు మాధవరావు.

"అది చిట్టెమ్మ పనే" అంది సీతారత్నం.

"దా న్నన్నేం ప్రయోజనం ? ఆ తలుపుమీద చెయ్యేస్తానని కల గన్నానా ?"

"తాళం నొక్కకుండా గొళ్లానికి బిగించడం తెలివితక్కువగాదూ?" అన్నాడు మాధవరావు. పాతాల కుర్రాళ్ళు హాల్లోకొచ్చారు. అతను బైట కొచ్చేశాడు.

మర్నాడు సాయంత్రం నాలుగైంది. మాధవరావు హాల్లోలాల్ సర్దడం పూర్తిచేసి, వరండా గదిలో కొచ్చాడు. రాజమ్మ కుర్చీమీద అద్దం పెట్టి చూసుకుంటోంది.

"ఇప్పు డెల్లా వుంది—నొప్పి తగ్గిందా ?"

"ఇంక ఈ మచ్చ పోదుగా."

అద్దంతీసి కూర్చోమంది. అతను కుర్చీ యివతలికి లాగడంలో మోచెయ్యి తలుపుకి తగిలి, మూసుగుంది. గోడకాన్చిన దిండ్లమీద వొరిగింది రాజమ్మ. తల దువ్వుకోలేదు. పాపిడ కదిలిపోయింది. ఊడివజుట్టును

పైకిలాగి బిగించి ముడేసింది. మెడలో నగలు లేవు. చెవులకి దుద్దులులేవు. చేతులకు గాజులు లేవు. బొట్టు చెరిగింది—ఎర్రగా పాపిడికేసి, మంచం మీద పూలరేకులు నలిగి వాడి పడున్నాయి. ముందుకి ఒరిగి నుదుటిమీద చెయ్యి ఆనించాడు మాధవరావు.

"హిస్టీరియా అంటే ఏమిటండీ ?"

"స్త్రీలకు సామూలుగా వుండే వ్యాధి —అన్నీ సక్రమంగా జరగక మానసికంగా కలతగాని, ఆందోళనగాని వుంటే, ఇవన్నీ కలిసి కలుగ జేసే అస్వస్థత హిస్టీరియా. ఫలానా అని తెలియనప్పుడు డాక్టర్లు ఈ పేరు చెబుతుంటారు."

"నా కదేట—"

"నా కట్లా గనిపించడంలేదు."

"మీకేం తెలుసు? మీరు డాక్టరుకాదుగా" దెబ్బ తగిలినచోట వేలికి కరుకుగా తగిలింది. చుట్టూ చర్మం నలిగింది—కొలనులో నిశ్చలంగా వున్న నీటిని తామంతో కదిలిన చేప కదిపినట్లు. ఆద్దంలో పగులు— ఆకాశంలో మెఱుపు, మంచు ప్రదేశంలో భూకంపం. వేలు వెనక్కి మళ్ళింది కళ్ళకింద కాకిపాదాల మాదిరి చిన్ని ముడతలు శ్వాసలో గులాబి కాలినట్లు చేపలు విడినట్లు అఖాతంలోంచి ప్రజ్వరిల్లినట్లు వాసన ఆవరించి అప్రయత్నంగా అతన్ని వెనక్కి నెట్టాయి.

"ఎట్లాగో వున్నానుకదూ—తలంటు పోసుకుందామని అన్నీ సిద్ధం చేసి వెళ్ళబోతున్నా, మీరొచ్చారు."

"మరోవారంలో అన్నీ తగ్గుతాయి, బాగుంటావు."

"ఇప్పుడు బాగలేనా ?"

ఆమె రెండుచేతులు అతని మెడచుట్టూ వేసింది.

"స్నానాని కెళ్ళనా ?"

"నేను వూరెడుతున్నా. అమ్మకి వొంట్లో బాగా లేదట నిన్న ఉత్తరం అదే. మళ్ళా రేపొచ్చేస్తాను, ఏం ?"

"డబ్బు కావాలా ? మణియార్డ రొచ్చిందిగా."
"వొద్దు. అడగడానికి వొచ్చా ననుకున్నావా ?"
"అల్లా గనుకుంటానని ఎందు కనుకున్నారు ?"
"ఇదివర కన్నదే...."
"అబద్ధం అంటారా ?"
"నిజం రోజురోజుకీ మారదుగా."
రాజమ్మ లేచింది. బుజంమీద చేతిని తొలిగించింది "అబ్బ చెమట" అంటూ.
తలుపులు తీసింది.
"వెళ్ళనా ?"
"అమ్మగార్ని అడిగానని చెప్పండి."
మాధవరావు నవ్వుతూ బైటకొచ్చాడు. ముందు కుర్రాడు హోల్డాల్‌తో నడుస్తున్నాడు. బైటికెళ్ళి రాజమ్మ గదికేసి చూశాడు మాధవ రావు. లోపలంతా నల్లగా కనబడింది. ఊచల మధ్య రాజమ్మ నుదురు— దానిమీద గీత. అది జైల్లో దృశ్యం; తను స్వేచ్ఛాజీవి.

తుది ఘట్టం — రెండు రోజుల తర్వాత.
మాధవరావు యింటి కొచ్చేటప్పటికి మధ్యాహ్నం మూడైంది. వీధిలో రాజమ్మ గదికేసి చూశాడు. కిటికీ మూసి వుంది. హాల్లోకి రాగానే సీతారత్నం వో కవరిచ్చింది. గబగబ గదిలో కెళ్ళాడు.
"రాజమ్మేది ?"
"వెళ్ళిపోయింది."
"అదేమిటి ? ఎప్పుడు— ?"

....ప్రశ్నార్థకంగా చూశాడు.

"వాళ్ళ కృష్ణమూర్తినీ, చిట్టెమ్మనీ సాయం వుంచి హరికథ విందామని వెళ్ళా. ఇంటి కొచ్చేటప్పటికి పదైంది. కృష్ణమూర్తి ఒక్కడూ వున్నాడు. చిట్టెమ్మ బండి తెచ్చిందిట. కూడా స్టేషను కెళ్ళిందిట. అన్నం పెట్టుకుని తిని వెళ్ళిం...."

"సీతో ఏమీ చెప్పలేదు?" అంటూ కవరు చూశాడు. చిరునామా టైపుకాబడి వుంది చించాడు. అందులోనుంచి రెండు కాగితాలు పడ్డాయి: వొకటి ఇంగ్లీషులో టైపు కాబడిన ఉత్తరం, రెండోది తెలుగులో—

ఇంగ్లీషుది మొదట చూశాడు. రాజమ్మకు జబ్బు చేసినప్పుడు తాము దగ్గరుంచుకొని ఎంతో ఆదరణగా కనుక్కుని చికిత్సచేసి నయం చేసి పంపిన దంపతులకు కృతజ్ఞత. కులభేదాలు గణించక యిట్లా సమానత్వం అందరూ కనబరిస్తే సంఘం పురోగమించగలదన్న ఆశ. పట్నం వస్తే వారి అతిథులుగా వుండాలని ఆహ్వానం—దాని సారాంశం—అసురు సంతకం.

"....మాణిక్యం మా అమ్మ. నన్ను మావ దగ్గర అట్టే వుంచి చదువు చెప్పించింది. అరసయ్య బావేగా. చేసుకుంటానని మావ సరదా పడేవాడు. ఇంకెవరేనా మనస్సులో వున్నారా అని వోసారి మీరడిగారు, జ్ఞాపకం వుందా. చెప్పానుగాను, నా విషయం తెలవకముందే వెళ్ళడం మంచిదనిపించింది. సీతగారికి మీరంటే వున్న అపేక్ష, మీకు ఆమె అంటే వున్న గౌరవం, కళ్ళారా చూశాను. నా విషయం మీకు తెలియదని నాకు తెలిసినప్పటినుంచీ, నాకు వొచ్చెయ్యాలని వుండేది. తాళందెబ్బ—తాళం చెవితో తలుపు తీసినట్లు—నేను రావడానికి కారణం. ఇంతకీ నా మొహాన అట్లా రాసిపెట్టి వుంది—"

మాధవరావు కిటికీ తలుపులు తెరిచాడు.

"బాగ్ మరచిపోయింది."

"ఖాళీబాగ్గే లెండి" అన్నది సీతారత్నం, టీకప్పు చేతికిచ్చి.

# 'తనను గురించిన నిజం'

"నే నెందుకు మంచివాణ్ణిగా ఉండాలి" అని భార్యని కసురుకున్నాడు రామ్మూర్తి. ఆ ప్రశ్నతో శాంతమ్మ ప్రశాంత జీవితంలో తుఫాను చెల రేగిందనొచ్చు.

ఇంతకీ తానుచేసిన అపరాధం ఏమిటి? బెల్లం కలిపిన కాఫీ ఇచ్చింది. భర్త కాఫీ తాగింతర్వాత "ఇది నాలుగో మాసం" అన్నది అంతే....

ఈ మాత్రానికి భర్తచేసిన వింత వ్యాఖ్యానం వితర్కించుకోడం కోసం, పెద్దబ్బాయి 'రఘు'తో వంటింట్లోకెళ్ళింది. శాంత ముగ్గురు పిల్లల తల్లి; మొగపిల్లలే. పెద్దాడిముందు అల్లా విసుక్కోడంలో అర్థమేమిటి? వాడి కింకా తొమ్మిదో ఏడే. ఐనా ఏమనుకుంటాడు? ఏమిటి మంచితనం? చేసుకున్న పెళ్ళానికీ, కన్నపిల్లలకీ ఇంత కూడెట్టడమేనా? ముందుంది ముసళ్ళపండగ. ఈసారి ఆడపిల్లైతే మరీను. అబ్బాయిల "సతుకు" లున్నాయి. బెల్లంకూడా లేని కాఫీ మహారాజులా తాగలా? సంసారంలో ఎన్నెన్నో చిక్కులు, ఇబ్బందులూ ఉంటాయి. దగ్గర దగ్గరగా ఇరవై ఏళ్ళనుంచి సాగుతున్న కాపురంలో ఎన్నో అవాంతరాలు సంభవించాయి. వాటన్నింటినీ సర్దుకుపోలా? ఎప్పుడేనా ఇలా విసుక్కున్నారా? ఐనా, ఎందుకు మంచివానిగా ఉండడమేమిటి నా తలకాయ....! హాల్లో అద్దంలో తన మొహం చూసుకుంది శాంత. ఏదో భావం స్ఫురించినట్లు చిరునవ్వుతో

పెదవి వొంపు తిరిగింది. ఆ నవ్వు మాయమవకుండానే భర్త దగ్గరకెళ్ళి "ఒకవేళ మూడో మాసమేనేమో లెండి" అంది.

రామ్మూర్తి మాట దిగమింగేసుకొని, ముందు గదిలో కెళ్ళి, పేపరు చదవడానికి యత్నం మొదలెట్టాడు. ఇందాక దిగమింగినమాటని పైకను కొని విన్నాడు. "ఇంకెంత కాలం మంచిగా వుండటం? మూడో మాసమైతే ఇంకా ఏడు నెలలా? బల్లమీద అద్దంలో మొహం చూచుకున్నాడు. కళ్ళకింద గీట్లు స్ఫుటంగా కనబడుతున్నాయి. తల్లో నెరుస్తున్న వెంట్రుకల సంఖ్య పెరుగుతోంది. రెండు మూడు రోజులదాకా క్షురకర్మ చేసుకోకుండా వుండడానికి వీల్లేదు. లెక్కకి పదహారు తెల్ల వెంట్రుకలు గడ్డంకింద, మళ్ళా జాగ్రత్తగా లెక్కపెట్టాడు; పందొమ్మిది చూసినకొద్దీ అల్లా కనిపిస్తూనే వుంటాయి. రెండోవాడు 'పేతు' బల్లకింద సిరాబుడ్డితో ఆడుకుంటున్నాడు. ఇదిగో ఈ పిల్లలే కారణం. సంతానం కలిగినప్పుడల్లా ఐదేసి నెరిసిన వెంట్రుకలు. సిరాబుడ్డి లాక్కొని, 'పేతు' వీపుమీద ఒక్క చరుపు చరిచి తోసేసి, తలుపు గడియపెట్టి, రామ్మూర్తి తన నిజస్వరూపంతో పెనుగులాట సాగించాడు.

రెండు మూడు నెలలనుంచి, మహత్తరమైన మానసిక శక్తులతో భర్త పెనుగులాడుతున్న సంగతి శాంత తెలుసుకోలేదు.

అహం తాండవించే స్మశానవాటిక అతని హృదయం. తీరని కోరికలు కళేబరాలు; సాధ్యంకాని ఆదర్శాలు మంటలు; శరీరంలో యింద్రియాలు కుంగదీసిన అహం ఏడ్చి ఏడ్చి నీరైన కలలనే నేతిని కళేబరాల మీదవేసి, ఎండిన తృష్ణ అనే కాగడాతో నిప్పు పెడుతుంది. వాటి ఆత్మలన్నీ మసిగా చీకటి విశ్వంలో మరో శరీరాన్ని వెదుక్కుంటూ పరిభ్రమిస్తున్నాయి. తనలోంచే ఆ కొత్త శరీరాన్ని సృష్టించుకోవాలి. దాని సృష్టి కోసమే యీ పెనుగులాట.

రామ్మూర్తికి నలభయ్యో సంవత్సరం వొస్తోంది. సంసారానికి

"వారింకా ట్యూషన్లు చెప్తూనే వున్నారే...." బైట పిల్లలు, భర్త చెప్పుకుంటున్న మాటలు వినబడుతున్నాయి. సీతారత్నం బైటకెళ్ళి "ఉస్, మెల్లగా! నిద్రపోతోంది" అని చెప్పి వచ్చింది.

"భోజనానికి పొద్దుపోతోంది, మీరు వెళ్ళండి" అంది రాజమ్మ.

"నువ్వు నిద్రపొయ్యాక."

"ఇప్పుడే పోతా" అని కళ్ళుమూసి, పక్కకి తిరిగి పడుకుంది.

భోజనా లయ్యాక, వంటిల్లు బాగుచేసుగుని, సీతారత్నం హాలు పక్క గదిలో కొచ్చింది. తమలపాకులకి సున్నం రాస్తోంది.

"రాజమ్మకోసం స్టేషన్ కెళ్ళినరోజు నొచ్చింది ఆ కవరు. ఎవరి దగ్గరనుంచి — ?"

"రాఘవయ్యని నా స్నేహితుడు. పూనా మిలిటెరి ఎకౌంట్స్‌లో పని చేస్తున్నాడు."

"ఏమంటాడు—ఉద్యోగం ఏదన్నా.... ?"

"కాదు. మాణిక్యం అన్నకొడుకు—అరసయ్యని—యుద్ధంలో చేరాడు. రెండేళ్ళుగా వాడిదగ్గరనుంచి జవాబు లేదుట. వాణ్ణి గురించి వార్త లేదట. వాడి ఫోటో యిచ్చి, ఎక్కడుండేదీ కాస్త వాకబు చేసి పెట్టమంటే, రాఘవయ్యకి ఫోటో పంపి, తెలుస్తే వ్రాయమన్నాను. నేవీలో చేరాడుట. రెండేళ్ళుగా ఓడ ప్రయాణం సాగించి, దేశాలు చూసి, బొంబాయినుండి పూనా వచ్చాడుట. ఇది విను....మీ అరసున్న వో పట్టాన లొంగలేదు. వాడిమీద ఫిర్యాదనుకున్నాడో ఏమో, పేరు మాత్రం 'అసురు' అని మార్చేశాడు వాడే. అంబాలాలో ట్రైనింగ్ కూడా పూర్తయింది.

పెర్మెనెంట్ కమిషనిచ్చి, మద్రాసు హార్బర్‌కి ఫోను చేస్తున్నారు. అక్కడ బంధువులు కూడా వున్నారుట. అక్కడికి వెళ్ళే వుంటాడు."

ఉత్తరం చదివి నిట్టూర్చాడు మాధవరావు. "మాణిక్యం గొడవలు రెండూ తీరినట్లే."

"ఇంకా నాలుగైదొందల లివ్వాలిటగా !"

"ఇప్పటికి నిల్చింది. మెల్లి మెల్లిగా తీర్చలేకపోతామా ?"

సీతారత్నం పక్కసర్ది కాసేపు నిద్రపొమ్మంది. ఉత్తరాలు వ్రాసి మంచంమీద పడుకున్నాడు.

"మరి నువ్వో ?"

"నే ఇల్లా వేసుకుంటాలెండి."

"వాటి కిందా—నేనూ కిందే వేసుకుంటా. చల్లగా వుంటుంది" అని తువ్వాలుతో గచ్చు దులిపి, దిండు లాగి ఆమె తలకింద పెట్టాడు. తమలపాకులకి ఎర్రబడిన పెదవుల వెనక పళ్ళవరస తళుక్కుమంది. జుట్టురేగి నుదుటిమీద గీత మీదికి జారింది. ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"కళ్ళకింద గీతలు చూసుకున్నావా ?"

"మీవి చూసుకున్నారా ?"

"ఏం ? మనస్సే అద్దం—" అని తల చేతిమీద ఆనించి వోరగిల్లాడు.

బైట పోస్టుజవాన్ పిలుపు వినిపించింది. మరో నాలుగయిదు క్షణాలలో 'అయ్యో' అన్న రాజమ్మ కేక దిగ్గరగా వినిపించింది. ఇద్దరూ చివాలున లేచి హాల్లోకి వెళ్ళారు.

రాజమ్మ నుదుటిమీద రెండు చేతులూ నొక్కుకుంటూ, గుమ్మం మీద వాలిపోయింది. వేళ్ళ మధ్యనుండి, చెవిమీదుగా రక్తం బొట బొట కారుతోంది. మంచం హాల్లోకి లాగి, దానిమీద ఆమెను కూర్చోబెట్టారు. తడిగుడ్డ కట్టారు. అరంగుళం పొడుగు గాయంపడింది నుదుటిమీద. మాధవరావు సైకిల్‌మీద వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన ఆయింటుమెంటు రాసి బాండేజి వేశాడు. రక్తం మరకల బట్టలు మార్చి,

కొత్తబట్టలు ధరించి, వరండా గదిలోకి మంచం పట్టించి, రాజమ్మ దిండ్లని వెనకాల వేసుకుని, గోడని జార్ల పడి కూర్చుంది.

టీ తెచ్చింది సీతారత్నం.

"పెద్ద దెబ్బే. ఇదంతా చిట్టెమ్మ పనే" అన్నది.

"అసలేం జరిగింది ?" అంటూ మాధవరావు గదిలో కొచ్చాడు.

"నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. పోస్టువాడికేక విని వీధిలో కొద్దామని హాల్లో గదిముందు కొచ్చాను. తలుపుమీద చెయ్యి పడిందేమో, తలుపుమీద వున్న గొళ్ళానికున్న తాళంకప్ప, చెవీ నుదుటిమీద పడ్డాయి" అందీ రాజమ్మ. సీతారత్నం ఆమె తలదువ్వి జడవేస్తోంది.

"అమధ్య మనం కొన్న పెద్ద తాళంకప్ప, అక్కడ పెట్టుకుంటారా ఎవరేనా ?" అన్నాడు మాధవరావు.

"అది చిట్టెమ్మ పనే" అంది సీతారత్నం.

"దా న్నెనేం ప్రయోజనం ? ఆ తలుపుమీద చెయ్యేస్తానని కల గన్నానా ?"

"తాళం నొక్కకుండా గొళ్ళానికి బిగించడం తెలివితక్కువగాదూ?" అన్నాడు మాధవరావు. పాలాల కుర్రాళ్ళు హాల్లోకొచ్చారు. అతను బైట కొచ్చేశాడు.

మర్నాడు సాయంత్రం నాలుగైంది. మాధవరావు హోల్డాల్ సర్దడం పూర్తిచేసి, వరండా గదిలో కొచ్చాడు. రాజమ్మ కుర్చీమీద అద్దం పెట్టి చూసుకుంటోంది.

"ఇప్పు డెల్లా వుంది—నొప్పి తగ్గిందా ?"

"ఇంక ఈ మచ్చ పోదుగా."

అద్దంతీసి కూర్చోమంది. అతను కుర్చీ యివతలికి లాగడంలో మోచెయ్యి తలుపుకి తగిలి, మూసుగుంది. గోడకాన్చిన దిండ్లమీద వాలి గిండి రాజమ్మ. తల దువ్వుకోలేదు. పాపిడ కదిలిపోయింది. ఊడినజుట్టును

పైకిలాగి బిగించి ముడేసింది. మెడలో నగలు లేవు. చెవులకి దుద్దులులేవు. చేతులకు గాజులు లేవు. బొట్టు చెరగింది—ఎర్రగా పాపిడికేసి, మంచం మీద పూలరేకులు నలిగి వాడి పడున్నాయి. ముందుకి ఒరిగి నుదుటిమీద చెయ్యి ఆనించాడు మాధవరావు.

"హిస్టీరియా అంటే ఏమిటండీ ?"

"స్త్రీలకు మామూలుగా వుండే వ్యాధి — అన్నీ సక్రమంగా జరగక మానసికంగా కలతగాని, ఆందోళనగాని వుంటే, ఇవన్నీ కలిసి కలుగ జేసే అస్వస్థత హిస్టీరియా. ఫలానా అని తెలియనప్పుడు డాక్టర్లు ఈ పేరు చెబుతుంటారు."

"నా కదేట—"

"నా కట్లా గనిపించడంలేదు."

"మీ కేం తెలుసు ? మీరు శాక్టరుకాదుగా" దెబ్బ తగిలినచోట వేలికి కరుకుగా తగిలింది. చుట్టూ చర్మం నలిగింది—కొలనులో నిశ్చలంగా వున్న నీటిని కామంతో కదిలిన చేప కదిపినట్లు. అద్దంలో పగులు—ఆకాశంలో మెఱుపు, మంచు ప్రదేశంలో భూకంపం. వేలు వెనక్కి మళ్ళింది కళ్ళకింద కాకిపాదాల మాదిరి చిన్ని ముడతలు శ్వాసలో గులాబి కాలినట్లు చేపలు విడినట్లు అఘాతంలోంచి ప్రజ్వరిల్లినట్లు వాసన ఆవరించి అప్రయత్నంగా అతన్ని వెనక్కి నెట్టాయి.

"ఎట్లాగో వున్నానుకదూ—తలంటు పోసుకుందామని అన్నీ సిద్ధం చేసి వెళ్ళబోతున్నా, మీరొచ్చారు."

"మరోవారంకో అన్నీ తగ్గుతాయి, బాగుంటావు."

"ఇప్పుడు బాగలేనా ?"

ఆమె రెండుచేతులు అతని మెడచుట్టూ వేసింది.

"స్నానానికి కెళ్ళనా ?"

"నేను వూరెడుతున్నా. అమ్మకి వొంట్లో బాగా లేదట నిన్న ఉత్తరం అదే. మళ్ళా రేపొచ్చేస్తాను, ఏం ?"

"డబ్బు కావాలా ? మణియార్డర్ వచ్చిందిగా."

"వొద్దు. అడగడానికి వొచ్చా ననుకున్నావా ?"

"అల్లా గనుకుంటానని ఎందు కనుకున్నారు ?"

"ఇదివర కన్నదే...."

"అబద్ధం అంటారా ?"

"నిజం రోజురోజుకీ మారదుగా."

రాజమ్మ లేచింది. బుజంమీద చేతిని తొలిగించింది "అబ్బ చెమట" అంటూ.

తలుపులు తీసింది.

"వెళ్ళనా ?"

"అమ్మగార్ని అడిగానని చెప్పండి."

మాధవరావు నవ్వుతూ బైటకొచ్చాడు. ముందు కుర్రాడు హోల్డాల్‌తో నడుస్తున్నాడు. బైటికెళ్ళి రాజమ్మ గదికేసి చూశాడు మాధవరావు. లోపలంతా నల్లగా కనబడింది. ఊచల మధ్య రాజమ్మ నుదురు— దానిమీద గీత. అది జైల్లో దృశ్యం: తను స్వేచ్ఛాజీవి.

తుది ఘట్టం—రెండు రోజుల తర్వాత.

మాధవరావు యింటి కొచ్చేటప్పటికి మధ్యాహ్నం మూడైంది. వీధిలో రాజమ్మ గదికేసి చూశాడు. కిటికీ మూసి వుంది. హాల్లోకి రాగానే సీతారత్నం వో కవరిచ్చింది. గబగబ గదిలో కెళ్ళాడు.

"రాజమ్మేది ?"

"వెళ్ళిపోయింది."

"అదేమిటి ? ఎప్పుడు— ?"

"రాత్రి."

....ప్రశ్నార్థకంగా చూశాడు.

"వాళ్ళ కృష్ణమూర్తినీ, చిట్టెమ్మనీ సాయంవుంచి హరికథ విందామని వెళ్ళా. ఇంటి కొచ్చేటప్పటికి పదైంది. కృష్ణమూర్తి ఒక్కడూ వున్నాడు. చిట్టెమ్మ బండి తెచ్చిందిట. కూడా స్టేషను కెళ్ళిందిట. అన్నం పెట్టుకొని తిని వెళ్ళిం...."

"నీతో ఏమీ చెప్పలేదు?" అంటూ కవరు చూశాడు. చిరునామా టైపుకొబడి వుంది చింపాడు. అందులోనుంచి రెండు కాగితాలు పడ్డాయి; వొకటి ఇంగ్లీషులో టైపు కొబడిన ఉత్తరం, రెండోది తెలుగులో—

ఇంగ్లీషుది మొదట చూశాడు. రాజమ్మకు జబ్బు చేసినప్పుడు తాము దగ్గరుంచుకొని ఎంతో ఆదరణగా కనుక్కుని చికిత్సచేసి నయంచేసి పంపిన దంపతులకు కృతజ్ఞత. కులభేదాలు గణించక యిట్లా సమానత్వం అందరూ కనబరిస్తే సంఘం పురోగమించగలదన్న ఆశ. పట్నం వస్తే వారి అతిథులుగా వుండాలని ఆహ్వానం—దాని సారాంశం—అసురు సంతకం.

"....మాణిక్యం మా అమ్మ. నన్ను మావ దగ్గర అట్టే వుంచి చదువు చెప్పించింది. అరసయ్య బావేగా. చేసుకుంటానని మావ సరదా పడేవాడు. ఇంకెవరేనా మనస్సులో వున్నారా అని వోసారి మీరడిగారు, జ్ఞాపకం వుందా. చెప్పాసుగాను, నా విషయం తెలవకముందే వెళ్ళడం మంచిదనిపించింది. సీతగారికి మీరంటే వున్న ఆపేక్ష, మీకు ఆమె అంటే వున్న గౌరవం, కళ్ళారా చూశాను. నా విషయం మీకు తెలియదని నాకు తెలిసినప్పటినుంచీ, నాకు వొచ్చెయ్యాలని వుండేది. తాళందెబ్బ—తాళం చెవితో తలుపు తీసినట్లు—నేను రావడానికి కారణం. ఇంతకీ నా మొహాన అట్లా రాసిపెట్టి వుంది—"

మాధవరావు కిటికీ తలుపులు తెరిచాడు.

"బాగ్ మరచిపోయింది."

"ఖాళీబాగ్గే లెండి" అన్నది సీతారత్నం, టీకప్పు చేతికిచ్చి.

# ‘తనను గురించిన నిజం’

“నే నెందుకు మంచివాణ్ణిగా ఉండాలి” అని భార్యని కసురుకున్నాడు రామ్మూర్తి. ఆ ప్రశ్నతో శాంతమ్మ ప్రశాంత జీవితంలో తుఫాను చెల రేగిందనొచ్చు.

ఇంతకీ తానుచేసిన అపరాధం ఏమిటి? బెల్లం కలిపిన కాఫీ ఇచ్చింది. భర్త కాఫీ తాగింతర్వాత “ఇది నాలుగో మాసం” అన్నది అంతే....

ఈ మాత్రానికి భర్తచేసిన వింత వ్యాఖ్యానం వితర్కించుకోడం కోసం, పెద్దబ్బాయి ‘రఘు’తో వంటింట్లోకెళ్ళింది. శాంత ముగ్గురు పిల్లల తల్లి: మొగపిల్లలే. పెద్దాడిముందు అల్లా విసుక్కోడంలో అర్థమేమిటి? వాడి కింకా తొమ్మిదో ఏడే. ఐనా ఏమనుకుంటాడు? ఏమిటి మంచితనం? చేసుకున్న పెళ్ళానికీ, కన్నపిల్లలకీ ఇంత కూడెట్టడమేనా? ముందుంది ముసళ్ళపండగ. ఈసారి ఆడపిల్లైతే మరీను. అబ్బాయిల “సతుకు” లున్నాయి. బెల్లంకూడా లేని కాఫీ మహారాజులా తాగలా? సంసారంలో ఎన్నెన్నో చిక్కులు, ఇబ్బందులూ ఉంటాయి. దగ్గర దగ్గరగా ఇరవై ఏళ్ళనుంచి సాగుతున్న కాపురంలో ఎన్నో అవాంతరాలు సంభవించాయి. వాటన్నింటినీ సర్దుకుపోలా? ఎప్పుడేనా ఇలా విసుక్కున్నారా? ఐనా, ఎందుకు మంచివానిగా ఉండడమేమిటి నా తలకాయ....! హాల్లో అద్దంలో తన మొహం చూసుకుంది శాంత. ఏదో భావం స్ఫురించినట్లు చిరునవ్వుతో

పెదవి వొంపు తిరిగింది. ఆ నవ్వు మాయమవకుండానే భర్త దగ్గరకెళ్ళి "ఒకవేళ మూడో మాసమేనేమో లెండి" అంది.

రామ్మూర్తి మాట దిగమింగేసుకొని, ముందు గదిలో కెళ్ళి, పేపరు చదవడానికి యత్నం మొదలెట్టాడు. ఇందాక దిగమింగినమాటని పైకను కొని విన్నాడు. "ఇంకెంత కాలం మంచిగా వుండటం? మూడో మాస మైతే ఇంకా ఏడు నెలలా? బల్లమీద అద్దంలో మొహం చూచు కున్నాడు. కళ్ళకింద గీట్లు స్ఫుటంగా కనబడుతున్నాయి. తల్లో నెరుస్తున్న వెంట్రుకల సంఖ్య పెరుగుతోంది. రెండు మూడు రోజులదాకా క్షురకర్మ చేసుకోకుండా వుండడానికి వీల్లేదు. లెక్కకి పదహారు తెల్ల వెంట్రుకలు గెడ్డంకింద, మళ్ళా జాగ్రత్తగా లెక్కపెట్టాడు; పందొమ్మిది చూసినకొద్దీ అల్లా కనిపిస్తూనే వుంటాయి. రెండోవాడు 'సేతు' బల్లకింద సిరాబుడ్డితో ఆడుకుంటున్నాడు. ఇదిగో ఈ పిల్లలే కారణం. సంతానం కలిగినప్పుడల్లా ఐదేసి నెరిసిన వెంట్రుకలు. సిరాబుడ్డి లాక్కొని, 'సేతు' వీపుమీద ఒక్క చరుపు చరిచి తోసేసి, తలుపు గడియపెట్టి, రామ్మూర్తి తన నిజస్వరూపంతో పెనుగులాట సాగించాడు.

రెండు మూడు నెలలనుంచి, మహత్తరమైన మానసిక శక్తులతో భర్త పెనుగులాడుతున్న సంగతి శాంత తెలుసుకోలేదు.

అహం తాండవించే స్మశానవాటిక అతని హృదయం. తీరని కోరికలు కళేబరాలు; సాధ్యంకాని ఆదర్శాలు మంటలు; శరీరంలో యింద్రియాలు కుంగదీసిన అహం ఏడ్చి ఏడ్చి నీరైన కలలనే నేతిని కళేబరాల మీదవేసి, ఎండిన తృష్ణ అనే కాగడాతో నిప్పు పెడుతుంది. వాటి ఆత్మలన్నీ మసిగా చీకటి విశ్వంలో మరో శరీరాన్ని వెదుక్కుంటూ పరిభ్రమిస్తున్నాయి. తనలోంచే ఆ కొత్త శరీరాన్ని సృష్టించుకోవాలి. దాని సృష్టి కోసమే యీ పెనుగులాట.

రామ్మూర్తికి నలభయ్యో సంవత్సరం వొస్తోంది. సంపాదానికి

అతన్ని కట్టిపడేసిన సంకెళ్ళు తెగాయి. సంఘానికి అర్థమయ్యే గౌరవమైన భావాలపై అతనికి గురితప్పింది. కుటుంబ మర్యాద, గౌరవమైన భాష అలవాటు తప్పి హాస్యాస్పదంగా కనబడసాగాయి. అతనికి అంతర్యంలో కలిగిన చాంచల్యం—ప్రజాస్వామ్య రాజ్యాంగంపై వ్యక్తిత్వం చేసిన తిరుగుబాటు — అనాదినుండీ కళలూ, సంస్కృతులూ దేనికోసం ప్రార్థిస్తున్నాయో అది అతనిలో అవతరించింది. మతానికీ, సాంప్రదాయానికీ, కట్టుబాట్లకీ, నియమాలకీ లొంగని వ్యక్తిత్వ ప్రకర్ష. అసలదేమిటో తెలుసుకుంటే దానిని జయించినట్లే.

ఈ మార్పుకి కారణం కొంతవరకు శారీరకమే. గతించిపోతున్న యౌవనానికి శరీరం ఇచ్చే వీడ్కోలు తాలూకు కోలాహలం. ఆరిపొయ్యే ముందు ప్రజ్వరిల్లిన మంటలాంటిది ఆ అనుభవం. జీవితం పాదాలకింద నుండి జారిపోతున్నట్లు ఏదో భయం. ఇల్లు, ఉద్యోగం, పిల్లలు, తిండి, నిద్ర—ఇంతేనా ఇంకేమీ జరగదు? తన ఉనికిని సంఘం గుర్తించినట్టు నిర్ధారణ లేదు. పిల్లల ద్వారా భార్య పరిపూర్ణత చెందొచ్చు. నిర్ధారణ చేసుకోవొచ్చు. తన కది చాలదు. పిల్లలు తన జీవితంలో ఆహ్లాదకరమైన మార్పును తీసుకురాలేదు. పైగా ముగ్గురూ వాళ్ళమ్మ పోలికే... శాంత అనాకారి కాదు. ఐనా ఆడపిల్ల లుండి వాళ్ళకి ఆమె పోలిక వస్తే, అందంగా వుండి వుందురేమో....ప్రస్తుతం అతనికి వార్ధక్యాన్ని మాత్రం సమకూర్చారు పిల్లలు. ఇంక ఆరునెలల్లో అతను వృద్ధుడన్నమాటే! అతని యవ్వనం ముగిసిందని సంతానం చాటింపు వేసింది.

రామ్మూర్తి చిన్నతనంలో ఎన్నో మధురమైన కలలు కన్నాడు. పాశ్చాత్య విద్యాసంపర్కంవల్ల అతనిలో విప్లవపూరితమైన భావా లుద్భవించాయి. పెండ్లి, ప్రేమ, సంతానం వీటిని గురించిన ఆధునికతత్వం

ఈనాటికి కలవరపరచసాగించింది. సంప్రదాయం నీడలో, పెద్దల చెప్పుచేతల్లో సమాజం పాతిన వేళ్ళ లేతచిగురువలె పెరిగాడు. చదువు కున్నాడు. అందరికి మల్లేనే పెండ్లి చేసుకున్నాడు. అందులో ప్రేమకి స్థానం లేదు.

శాంత ప్రేమను గురించి ఎప్పుడేనా మాట్లాడిందా? శాంత ప్రేమించడమన్న భావమే హాస్యాస్పదంగా తోస్తుంది. పెరిగిపోతున్న జనాభా సమస్య మరిచిపోయి అందరిలాగే పిల్లల్ని కన్నాడు. కళాతృష్ణ, కార్యసాఫల్యత, అన్వేషణ, సంస్కారారాధన—అన్నీ మంటగలిసినై. జీవితంలో ఔన్నత్యం, నూతనత్వం, ప్రతిభ—ఏవీ లేవు. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో పౌరుడల్లే అతనొక సామాన్యమానవుడై కనీసపు హక్కుల కోసం పెనుగులాట మాని పెద్ద లాదేశించిన బాధ్యతల్ని నిర్వహించుకునే గతిపట్టింది. ప్రజాస్వామ్యం పేలవంగా తయారవగలదని అతనే నిదర్శనం.

రామ్మూర్తి హృదయంలో కలిగిన ఈ పరివర్తనని జాత్యజీవిత ప్రకర్ష అనొచ్చు. కొందరి కిది అరవయ్యో ఏట సంభవించొచ్చు. మరి కొందరికిది నలభయ్యోఏట జరగొచ్చు. అవుతే, ఈ పరివర్తన అందరికీ కలుగుతుందా అంటే చెప్పలేం. బహిర్గతంగా బుజువు కాకపోవచ్చు అందరిలోనూ. పెండ్లి చేసుకున్న వారందరూ ప్రేమని పొందగలిగారా? తన మట్టుకు తను—స్త్రీ కోసం వివాహాన్ని అంగీకరించాడని ఒప్పుకోక తప్పదు. కోర్కెల్ని సాధించలేని వారందరూ విషాద జీవులయి, కళాకవ్య ముసుగు తొలగించి, కన్నీటిని స్పృశించి తేటపడిన చూపువెలుగులో అమరజీవులుగానో, సన్నగిలిన వెలుగులో అనామకులుగానో కాలవాహి నిలో కలిసిపోతున్నారు. వీరివి నశింపైన జీవితాలు; కొందరికి అట్లా నశింపు కావడమే జీవిత పరమావధి. రామ్మూర్తి చెడ్డవాడై నశించి, రెండో దశకి అనువైన వ్యక్తిత్వాన్ని సృష్టించి, నిజమైన మంచివాడు కావడానికి సమకట్టాడు.

తనమీద విసుక్కున్న నెలరోజులకే ఈ మార్పు నిదర్శనాలు, శాంతికి దొరకడం మొదలెట్టాయి. ఆ రోజున రామ్మూర్తి ఇంట్లో లేడు. కాంప్ వెళ్ళాడు. పోస్టు బంట్రోతు కవరు తెచ్చాడు. అది రామ్మూర్తికే. ఆమె తీసుకుని బల్లమీద పెట్టింది. సాయంత్రానికి, మూడో కుర్రాడు 'గోపి' యథాప్రకారం విధ్వంసకయజ్ఞం సాగించాడు. వాడి దృష్టికి గోచరం కాని వస్తువులు కొద్ది. ఈ కవరు వాడి సిద్ధహస్తాల్లో పడి నశింపు కాబోయే అవస్థలో శాంత దాన్ని లాక్కుంది. లోపల ఉత్తరం తెలుగులో ఉంది. అడ్రెసు, తేదీ లేవు. శాంతికి నాగరికతత్వం తెలియదు. ఉత్తరం చదవడం తప్పనుకోదు. భర్త ఆ చర్యని ఆమోదిస్తాడు కూడా. వారి అన్యోన్యానికి అదొక చిహ్నం.

"ప్రియమైన మూర్తీ—ఎంతో సాహసం చేసి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నీకు భార్యా, పిల్లలు వుండడంవల్ల నేనింతవరకూ తెగించలేక పోయాను. జీవితం గతించిపోతూ ఎప్పుడో అప్పుడు తెగించి దౌర్జన్యం చెయ్యాలికదా....ఇంతవరకూ అణిగి ఉండగలగడమే మనం సంఘం కోసం చెయ్యగలిగిన త్యాగం. నువ్వు నన్ను ప్రేమిస్తున్న విషయం ఏనాడో తెలుసు. కాని నా విషయం నీకంతగా తెలియదనుకుంటాను. స్త్రీ అన్వేషించదు. తలుపుసందున చూస్తూ నిరంతరం వేచి ఉంటుంది. తలుపు తోసి నువ్వు లోపలి కొచ్చావు. నేను గడపదాటక తప్పింది కాదు. ఎప్పుడో నన్ను ఏకాంతంలోకి తీసుకెడతావని ఆశిస్తున్నా. జవాబు కోసం నేను కాచుకోను. నాకు ఉత్తరాలెందుకు ? కావాల్సిందేమిటో నీకే తెలుసు —

నీ ప్రియభారతి.'

ఈ 'ప్రియభారతి' ఎవరా అని శాంతమ్మ క్షణం ఆలోచించింది. ఈ ఇరవై సంవత్సరాల్లోనూ భారతి అన్న వ్యక్తిగాని, పేరుగాని వారి జీవితంలోకి రాలేదు. ఆశ్చర్యంతో వొక్కసారి ఆమె కళ్ళు తళుక్కుమని మెరిశాయి. కనుబొమ్మల కదలింపులో సర్దుకుంది.

రామ్మూర్తి కాంప్‌నుంచి ఇంటికి రాగానే, చింపిన కవర్ను గురించి అడిగాడు.

"అబ్బాయి చింపబోతుంటే తీశాను" అన్నది శాంత.

"చదివావా ?"

"ఆఁ"—అని శాంత ఇంట్లో కెళ్ళింది.

తర్వాత ఆ ఉత్తరం విషయం ఎవరూ ప్రస్తావించుకోలేదు.

మరో రెండు వారాలు గడిచింతర్వాత, మంచం కింద వూడుస్తుంటే పనిపిల్లకి మరో ఉత్తరం దొరికింది. తీసుకెళ్ళి శాంతమ్మగారి కిచ్చింది.

"నువ్వు ఎప్పుడూ సుకుమారుడివిగానే కనిపిస్తావు. వయసులో నువ్వు పెద్దయినా, నీ హృదయంలో పసిపాప—లాలించబుద్దేస్తుంది. వయసు ముదిరిన కొద్దీ మనసు లేతదవుతుందనుకొంటాను; వార్ధక్యంలో పండి, పండులా రాలిపోతుంది. అప్పటికి నా జడలో పువ్వు వాడిపోతుంది. పండు, పువ్వురాలి మోడు మిగుల్తుంది. ఆ మోడు నీ భార్య, కొమ్మలు నీ సంతానం.

నీ ప్రియభారతి.'

శాంత ఆ ఉత్తరం మడిచి, భర్త కిచ్చేసింది. "ఏదో కాగితం, మీదే ననుకుంటా" అన్నది.

"అవునవును" అంటూ రామ్మూర్తి ఆతృతతో తీసుకున్నాడు. ఎవరూ, ఏమీ మాట్లాడలేదు.

నెల గడిచింతర్వాత 'రఘు' స్కూలు పుస్తకాలు సర్దుకుంటుంటే మరో ఉత్తరం దొరికింది. చదవబోయ్యాడు; భయపడి మానేసి, తీసుకెళ్ళి అమ్మకిచ్చాడు రఘు.

"ఏమిటే అమ్మా ఉత్తరం ?"

"ఏవో వారి ఆఫీసు కాగితాల్లే."

"అల్లా లేదే."

"నీ మొహం."

"కాదే—ఎవరో వాకావిడ రాసినట్లుంచే...."

"స్వరాజ్యమొచ్చింది కాదుట్రా. ఆడవాళ్ళు కూడా వ్యవహారాలు స్వంతంగా చూసుకుంటారమ్మా...."

"నాన్నని అడగనా ?"

"ఎందుకూ, ఆయనే అడుగుతార్లే."

రఘు స్కూలుకెళ్లాడు. శాంత ఆ ఉత్తరం చదివింది.

"మీ భార్య చాలా అమాయకురాలనీ, మంచిదనీ వింటాను. నన్ను హర్షిస్తుం దనుకుంటాను. నిజంగా అట్లా జరిగితే మన కింకేం కావాలి?—మన కలలన్నీ యథార్థా లవుతాయి. ఎంతటి దుర్భర జీవితాన్నయినా మీ కోసం హర్షించగలను. ప్రేమ చూపలేని ఓర్పు, సాధించలేని కార్యం ఏముంది ? రాత్రి కలలో కారిన కన్నీటితో దిండు తడిసింది. జడలో పుష్పం సిగ్గుతో ముడుచుకొని మొగ్గయింది. మీరు కోస్తూనే వికసించడం....

మీ ప్రియభారతి."

భద్రంగా ఈ ఉత్తరాన్ని మడిచి భర్త బల్లమీదపెట్టి, ఎగిరిపోకుండా పేపర్ వెయిట్ వుంచింది శాంత.

రెండో నెల పూర్తయేసరికి, నాలుగో ఉత్తరం కూడా వంటింటి గుమ్మం ముందే దొరికింది. అప్పుడు రామ్మూర్తి ఇంట్లోనే ఉన్నాడు. ఇల్లంతా దేనికోసమో వెదుకుతున్నట్లు గాలిస్తున్నాడు కూడా. 'ఇక్కడ కొన్ని కాగితా లుండాలి-ఎవరేనా చూశారా ?" అన్నాడు.

"ఏం కాగితాలు నాన్నా ?" అన్నాడు రెండోవాడు సేతు.

"ఇదేనా ?" అంటూనే శాంత, గుమ్మంముందు పడివున్న ఉత్తరం తీసి మడిచి భర్త కిచ్చింది.

"ఆ—ఇదే, ఇదే" అని దాన్ని తీసుకుని రామ్మూర్తి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా రామ్మూర్తికి నిద్రపట్టలేదు. డాబామీద వెన్నెల విరబోసినట్లు పడింది. లేచి వెళ్లాడు. రాత్రి పన్నెండు దాటింది. ఈనాటికి తన భార్య పరాయి స్త్రీగా కనబడసాగింది.

ఆమెతో గడిపిన ఇరవై ఏళ్ళలోనూ స్త్రీ మనస్సు తెలుసుకోడం కష్టమన్న లోకోక్తి ఒట్టిదని ఋజువు చేసుకున్నాడు. ఏ క్షణాన, ఏ సందర్భంలో తన భార్య ఏం మాట్లాడుతుందో, ఏమనుకుంటుందో, ఏం చేస్తుందో కూడా తను వూహించి నిర్ణయించగలడు. అతను అనుకున్నలా జరిగేది కూడా. అంత బాగా ఒకరి మనస్సు ఒకరు తెలుసుకోగలగడం అన్యోన్యానికి ముప్పే కావచ్చు. అది వేరే విషయం. స్త్రీ హృదయంలో రహస్య మందిరాలు లేవని తెలుసుకోవడంలో శృంగారమయ జగత్తుపై మమకారం క్షీణించింది.

కాని ఈ రాత్రి తనకి తన భార్యని గురించి ఏమీ తెలీదని ఒప్పుకోవల్సి వొచ్చినందుకు విచారిస్తున్నాడు. రహస్య మందిరంలో తను వొస్తువులమీద దుమ్ము, బూజు దులిపాడు. కాని ఏ వస్తువుకీ మెరుగు పెట్టలేదు.

స్త్రీకి అసూయ మెండంటారు. తన భార్య కొంచెమైనా అసూయ కనపర్చదేం? పోనీ, అసూయక్కర్లేదు. కుతూహలం కనబర్చి "ఎవరండీ, ఈ ప్రియభారతి అనే మహా ఇల్లాలు?" అనేనా అడగొచ్చుగా. నాలుగు ఉత్తరాలు శాంతలో ఏ మార్పూ తీసుకురాలేదు. మాట, వైఖరి, చేష్ట అన్నింటిలోనూ ఎప్పటిలాగే ఉంది. శాంతలో ఆధునిక తత్వానికి సంబంధించిన సంస్కారం లేదు. ఉన్నతాదర్శాలు, ఉజ్వల భావాలు కనబడవు. 'ఇది మూడో మాసం'—అన్నది ఆమె చెయ్యగల కోమల కవితా గానం. ఆమె పూర్వకాలపు స్త్రీ. యుగయుగాల పవిత్రతతో పరిపూర్ణత చెందిన భరతమాత జడలోంచి వాడి విడిపోయిన పుష్పం.

పోనీ, తన భార్యతో 'ప్రియభారతి' విషయం ప్రస్తావిస్తే? 'కాపేపు

అసూయ ప్రకటిద్దూ' అని తనే భార్యను కోరడమా! ఓవేళ భారతి అభిప్రాయాలు, ఆశయాలు తనకేమీ పట్టలేదేమో? ఒక స్త్రీకి అవతల స్త్రీ ఏమనుకుంటున్నదీ అక్కర్లేదేమో....? ఆమె క్కావల్సింది తన భర్త ఏమనుకుంటున్నాడు—అన్న వొక్కటేనేమో....!

ప్రియభారతి వ్రాసినట్లుగా తనే ఎడమచేత్తో ఆ ఉత్తరాలు నాలుగూ వ్రాశాడు. ఇప్పుడు వాటికి సమాధానంగా తనే కుడిచేత్తో వ్రాసి, తన భార్య కంటపడేటట్లు చేస్తే....? 'ప్రియభారతి'ని కవితా కన్యగా సృష్టించు కున్నాడు రామ్మూర్తి. ఆమెచేత మాట్లాడించాడు. ప్రేమింపబడ్డాడు. ఇహ ఆమెతో విహరించాలి. ఆమె ఎట్లా ఉంటుంది?

నేటి ప్రపంచంలో ఆదర్శమైన సౌందర్యాన్ని విడమర్చి చూస్తే, సుప్రసిద్ధ ఫిలింతారలు, పుస్తకాలలో నాయికలు, పత్రికలలో అడ్వర్టైజ్ మెంటు చిత్రాలు ప్రత్యక్షమవుతాయి. అనేకమైన అందాలని గుణిస్తే, పరిపూర్ణ సౌందర్యం సిద్ధించదు. ప్రత్యేకత, అందంలోని ప్రత్యేకత. కోలమొహం, తీర్చిన సన్నని పొడుగాటి కళ్ళు, పల్చటి ముక్కు, అమాయకంగా ముడుచుకున్న పెదవులు. ప్రాణం తెచ్చుకున్న గడ్డిపోచలా సుకుమారమైన శరీరం-ఆకలి దప్పులు లేని అయోమయపు ఆశ, దారుణా లెరుగని దైవత్వం, హద్దులులేని అనుభవం—ఆమె 'ప్రియభారతి'.

తను కొంపతీసి నిజంగా కవినేనేమో అన్న అనుమానం కలిగింది రామ్మూర్తికి. ఎందుకు కాకూడదూ? కవిత్వం నేర్చుకుంటే వొస్తుందా? అదొక ప్రవాహం, సుడిగాలి, జలపాతం, పేలి ద్రవించిన అగ్నిపర్వతం. నలుగురి ముందూ బహిరంగంగా చెబితే అర్థంకాని రహస్యం, వ్యావహారికంగా బైటబడని సత్యం—నేటి సమాజం హేళన చేస్తుందని భయపడి బైటపడని అందమైన బాధ - కవిత్వం.

ప్రియభారతి సృష్టిలో లేదు. నీలో సౌందర్యం అంతటినీ ఆమెకి ఆపాదింపవొచ్చు: నీ ఆబద్ధపు బ్రతుకు నంతటినీ అమెలో యథార్థం చేసు

కోవచ్చు. నీ రహస్య భావాలని ఆమె చుట్టూ విహరింప చెయ్యొచ్చు. పేలవంగా నిర్జీవంగా ఉన్న తన జీవితంలో అలజడి, చాంచల్యం కోరు తున్నాడు రామ్మూర్తి. వార్తాపత్రిక, తను ఆడని పోటీ ఆటలు చూడ్డం, సినిమాలు, పగటికలలు ఇవి మిగిలాయి ప్రజాస్వామ్యంలో సామాన్య మానవుడికి. ఇవి తృప్తినివ్వలేవు. ప్రియభారతి అతని పగటికలల చీకటి కాంత. ఆమెను అన్వేషించి తెలుసుకోడంలో తనని తానే తెలుసుకుంటు న్నాడు. అదే కళాజీవితపు పరమావధి. సామాన్య మానవు లందరూ తలో చీకటి కన్యనీ ఆరాధిస్తున్నారు. ఒకరి కొకరు అర్థంకారు. "నన్ను చూడండి" అని రోదిస్తూ వింత దుస్తులు ధరించి వికృత సౌందర్యాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈ చీకటి కన్యకాములు—ఆధునిక కళాకారులు నేటి కళలో సౌందర్య శూన్యతకీ, అర్థవిహీనతకీ, అగమ్యగోచరమైన రీతులకీ, అరాజక దృక్పథానికీ ఇదే కారణం కాబోలు! ఎవరి కళాసృష్టిద్వారా వారు తమ నిజస్వరూపాన్ని తెలుసుకోవడం, పీరి ఆధ్యాత్మిక జీవిత సౌధానికి ప్రథమ సోపానం.

ప్రియభారతికి రామ్మూర్తికి వ్రాసిన ఉత్తరంలో తన్ని గురించి నిజం చెప్పేసుకున్నాడు. ఇదీ ఉత్తరం—

"ఇన్నాళ్ళకు తెగించి నువ్వు చేసిన సాహసానికి కృతజ్ఞుణ్ని. నువ్వు సాహసం చెయ్యగలవన్న ధీమాయే నన్ను నీకు దాసుణ్ణిగా చేసింది. భార్య, పిల్లల్ని గురించి ఆలోచింపక పోలేదు. మానసికంగా ప్రతి వ్యక్తి స్వేచ్ఛాజీవి, అరాజకుడు. సంసారం సంకెళ్ళు భౌతికంగా నన్ను సంఘా నికి కట్టిపడేశాయి. ఈనాటికి నువ్వు వాటిని తెంపావు. నేను నిన్ను ప్రేమించలేను. ప్రేమించడం మరిచిపోయాను. నువ్వు నేర్పాలి. నీ ప్రేమతో నా హృదయం వికసించి పెరిగింది, నువ్వు దూరమైనకొద్దీ, రేకులుగా ఇంద్రియాలు విడిపోయి, మొండి శరీరం మిగులుతుంది. దాన్నిండా సంసారం ముళ్ళు. ఏ పక్షి గూడు కట్టలేదు. మృత్యుదేవత దృష్టిలోకూడా పడని ఏకాంతజీవి—ఆ చెట్టు, నేనే.

ఇందులో భార్యకి ద్రోహం చేస్తున్నా ననుకోను. అనేకమంది పిల్లలు కలిగి, నడివయస్సులో వున్న కుటుంబీకుడు ఏ కారుకిందో పడి అకాలమరణానికి గురై, భార్యాపిల్లల్ని నిరాధారుల్ని చేసినప్పుడు ఆ వ్యక్తిని ద్రోహిగా పరిగణిస్తున్నామా ? ప్రేమరథం కిందపడి హతుడైనా అంతేనంటాను. ఈ అవాంతరాలకి ఎవ్వరూ బాధ్యులు కారు. జననం, ప్రేమ, మరణం—ఇవి జరుగుతాయి; అంతే.

ఇన్నాళ్ళు ఏకపత్నీవ్రతుడుగా వుండడం చాలా శ్రమ. ఉన్నాను; అదీ త్యాగమే. పురుషులు, స్త్రీలు ఏ వొక్కరితోనో వుండగలిగే అలవాటు అలవర్చుకున్నా, స్వభావసిద్ధంగా వారు బహువాంఛాప్రేరితులు. ఒకరితో వునికి, అనేకులతో విహారం ఇది మానవుడి సహజ ప్రవర్తన. రేపు మనం అంతే. ఈ యథార్థాన్ని ఎదుర్కొని, ఈనాడు ప్రేమజ్వాలలో నశింపు కావడంకంటె వేరే పరిపూర్ణత లేదు.

నేను నిజంగా మంచివాణ్ణే కాని మంచివాడి మంచితనాన్ని ఎవరూ గమనించరు. ఈ వయస్సులో ఈ విధంగా ఒక మహత్తరమైన వాంఛకి లొంగిపోయినందుకు సిగ్గుపడటం లేదు. ఈనాటికైనా నన్ను లొంగదీసే శక్తులున్నందుకూ, వాటిని ఆహ్వానించగల చైతన్యం నాలో ఇంకా అడుగంటనందుకూ గర్వపడుతున్నాను. దక్షిణపు గాలి పిలిస్తే మేఘం మెల్ల మెల్లగా కొంచెం కొంచెం కదిలిపోదు; అసలు మొత్తంగా కదిలిపోతుంది; ఎందుకు ? ఏ మూలనో ఒక్క వర్షపు చుక్క అంటిపెట్టుకుంది. దాన్ని వదల్చుకునేందుకు కాదంటావా ? నువ్వు నా పాలిటి దక్షిణపు గాలివి. నాలో వున్న బరువునీ, మొద్దుతనాన్నీ నువ్వు తొలగిస్తేనేకాని నేను రాణించను. నేనొక పసిపాపనైతే, నా జన్మ నక్షత్రం నువ్వు...."

ఈ ఉత్తరం ఎల్లా ముగించాలో రామ్మూర్తికి తెలియలేదు. ఇది ఉత్తరం కాదు. ప్రేమతత్వాన్ని గురించిన వొక గ్రంథంగా తయారవు

తోంది. ఉత్తరాలతో తృప్తి చెందే యౌవ్వనపు ఆవేశం రామ్మూర్తిలో లేదు. మనస్సులో యధార్థాలు, అసత్యాలు, ఊహలు, నమ్మకాలు, తాత్కాలికావేశాలు, శాశ్వతానురాగాలు మెరుపుల్లా తరుముకుంటూ, మాటల్లో బంధించబడడానికి వ్యవధి లేకుండా మాయమౌతుంటాయి — ఆకులు, ఫలాలు రాలిపోయిన మోడులాగుంది అతని మనస్సు. పిట్టలు వేసిన రెట్టలా మీదనే కొత్త చిగుళ్ళు !

"ఇది నిజం" — 'ఇది నేను' — అని పాపం పురుషుడు మేఘాన్ని పట్టుకుని చూపిస్తాడు — అక్కడేమీ వుండదు — అని స్త్రీకి తెలుసు. ఆమె చేతుల్లో పడింది వర్షపుచుక్క. అతనికది తెలీదు. అతనింకా మేఘం కేసి చూపుతుంటాడు. ఆమె నవ్వక చేసేదేముంది? ఆ నవ్వే స్త్రీలో నిగూఢత్వానికి ప్రతిధ్వని.

మొర్నాడు శాంత ఈ ఉత్తరం చదువుకొని నవ్వింది. భర్త రహస్యంగా వ్రాస్తుంటే తను ప్రక్కనే కూర్చుని చూసినదానికిమల్లే....

"ఇక్కడో ఉత్తరం ఉండాలి — చూశావా?" అన్నాడు రామ్మూర్తి.

"ఎక్కడ?"

"ఇక్కడ" అని డ్రాయరుకేసి చూపించాడు.

"ఇదేనా?" అని ఉత్తరం తీసుకొచ్చింది శాంత.

"ఎక్కడ దొరికింది?"

"దొరకడాని కేముంది? మండువా కడుగుదామని వెడితే అక్కడ పడివుంది."

"[illegible] లోపల?"

తల పంకించి శాంత వంటింట్లో కెళ్ళింది. అక్కడ ఆవిడ నవ్వినట్లు రామ్మూర్తి కనుమానం కలిగింది.

వారం గడిచాక, శాంత పినతల్లి పురిటికి తీసుకెళ్ళడాని కొచ్చింది. శాంత, పిల్లలు ప్రయాణమయ్యారు. రామ్మూర్తి స్టేషన్ కెళ్ళాడు సాగనంప

డానికి. రైలు కదలడానికి మరో పదినిమిషాలుంది రామ్మూర్తి అనేకసార్లు ఏదో అడుగుదామని గొంతు సవరించుకొని చేతులు నలుపుకున్నాడు. ఆఖరికి శాంతే మాట్లాడింది.

"చాకలిపద్దు దానుగాణ్ణి చూడమనండి. ఇంకా రెండు తువ్వాళ్ళు, ఒక చీర అట్టే పెట్టుకున్నాడు. ఆరున్నర, పైన అణా కూడా యివ్వ కండేం ? ధోవతులన్నీ చించి తీసుకొచ్చాడు."

"సర్లెద్దూ, సోదీ" అని రామ్మూర్తి నవ్వుతూ విసుక్కున్నాడు. రైలు కదిలింది.

"బైట కెళ్ళేటప్పుడు దొడ్డిగుమ్మం గడియవేసి మరీ వెడుతుండం డేం—" అంటోంది శాంత. భర్తకేసి భక్తి పూర్వకంగా చూస్తూ, కారుణ్యంతో నవ్వుతూ. ఆ నవ్వులో అమాయకత్వమో, అల్లరితనమో ఏది ప్రబలంగా వుందో రామ్మూర్తి నిర్ణయించలేకపోయ్యాడు.

ఆ రాత్రంతా రామ్మూర్తికి నిద్రలేదు. చిన్నతనం, సిగ్గు, వోమాదిరి బిడియం అతన్ని ఆవరించాయి. ఉత్తరాలన్నీ మళ్ళా సావధానంగా చదువుకున్నాడు. ప్రియభారతి వ్రాసినట్లు తను రాసిన ఉత్తరాల్లో స్త్రీ దస్తూరి అనుకరించినా, శైలిలో దొరికిపోయ్యానా అన్న సందేహం వొచ్చింది. స్త్రీలభావాలు, శైలి అల్లా ఉంటయ్యా ? సంస్కారంగల స్త్రీ అల్లా ఎందుకు వ్రాయకూడదూ ? ఈ విషయాలని స్త్రీలు ఆరో ఇంద్రియం ద్వారా పసికట్టేస్తారు. మొత్తానికి ఆ ఉత్తరాలన్నీ భర్త వ్రాసినవేనని శాంత పసికట్టేసింది. అదీ అతని తలవొంపుకి కారణం.

శాంత తెలుసుకున్నా తెలియనట్టుగా నటించి, వాదానికి దిగి, కాస్త అసూయ ప్రకటింపవొచ్చుగా. సంసారం జీవితాన్ని మధురం చెయ్య టానికి ప్రేమ, ద్వేషాలకి సమాన శక్తి ఉంది. అందుకనే భార్యాభర్తల కొట్లాటలు, పుస్తకాల్లో నాయికలా విరుచుకుపడాలి. నాటకం ఆడాలి. ప్రియభారతి ఉత్తరాలగాథ భర్తతో తగాదానికి కూడా తగనంతటి అల్ప మైన దానికింద జమకట్టేసింది శాంత. అదీ అతని సిగ్గుకు కారణం.

ఏ స్త్రీ తన భర్తను ప్రేమించిందంటే, శాంత నమ్మలేకుండా వుంటున్నమాటేగా! ఎంతవరకూ తన భర్త స్త్రీల ప్రేమకి పాత్రుడో, అర్హుడో అని తేల్చుకున్నట్లేగా! దాన్నిబట్టి తనని గురించి ఆమెకి ప్రేమైక జీవిత విషయంలో ఎట్లాంటి అభిప్రాయం వుందో ఊహిస్తే కలిగే ఫలితం విడియం.

ఏ స్త్రీ కూడా అతన్ని ప్రేమించదూ? ఋజువు చెయ్యడానికి సంకల్పించాడు. తనని గురించిన నిజాన్ని తనే ఋజువు చేసుకోడం మానవుని కడసారి ఆశయం. సత్యాన్వేషణ సాహసంతో కూడిన పని. అందులో మజా వుంది. ఈ సాహసం వ్యక్తిత్వ ప్రకర్ష. అది సంఘంలో స్థిరత్వాన్ని, వెనుక చూపునీ, మందగమనాన్ని ధిక్కరించి రభసచేస్తుంది. ఆ ఉద్రేకాన్ని అరికట్టడమే ప్రభుత్వాలు చేస్తున్న పని. ప్రజాస్వామ్య ప్రభుత్వాలకి పెద్ద సమస్య.

మతము, నీతి, ఆర్థిక స్వాతంత్ర్యము, ప్రాణంపై తీపి, ఇవన్నీ పరస్పరానికి, అన్యోన్యానికి పురిగొల్పుతాయి. కాని ఆదిమ నివాసులు, మన పూర్వులిచ్చిన ద్వేషపూరితమైన ఉద్రేకాలు, 'నిరంతరపోరాటం జీవుల ప్రకృతి శాసనం' అన్నభావం—అందరూ వొకర్నివొకరు ప్రేమించుకుంటే ద్వేషించేటందుకెవ్వరూ వుండ'రన్న చైతన్యం—ఇవన్నీ వ్యతిరేకంగా ప్రబోధిస్తాయి. మానవ సౌభ్రాతృత్వం సానసాగాలంటే, ఈ ప్రాచీనతత్వాలకీ, ద్వేషాలకీ, ఉద్రేకాలకీ, బైటపడే అవకాశాలను కల్పించి, అరికట్టే మార్గాలని సమాజం ఆలోచించాలి. నేడు రాజకీయ వేత్తలకీ, ఫిలింతారాలకీ ఇట్లాంటి 'మజా' అనుభవాలు లభిస్తున్నాయి. రామ్మూర్తి ఈ అనుభవాన్ని పొంది. తనని గురించిన నిజాన్ని ఋజువు చేసుకోడానికి సమకట్టి పూరంట తిరగడం సాగించాడు. ఉత్తరాలు, ఊహించుకున్న అనుభవం చాలవు. రక్తమాంసాలతో సజీవమైన వ్యక్తిపై తన అంతరంగికాన్ని పరిశోధించుకోవాలి.

ఎవరిని ప్రేమించడం? తనని ప్రేమించేటందుకు భర్త వున్న స్త్రీ కూడా సిద్ధంగా వుండదు. ఒకవేళ ఉన్నా, భర్తతో తగవులాట, సంఘంలో తలవొంపు తప్పదు. అంచేత సంసారం పితలాటంలేని, కన్యకోసం గాలించసాగాడు. బాంక్ వీధి చివర్లో ఎవరిదో మేడ. మేడమీద గది. గదిముందు బాల్కనీ వుంది. ఆ బాల్కనీలో కుర్చీమీద కూర్చుని, వీధిలో వచ్చేపొయ్యేవాళ్ళని చూస్తూ కూర్చుంది. ఆమె ఎవరో! అంత మరీ చిన్నది కాదు. ఇరవై యేళ్ళుండొచ్చు. పాతిక లోపే. తను ఆ వీధమ్మట నడచిన నాలుగురోజులూ అల్లానే కూర్చుంది. అతనికేసి చూసింది కూడా. వెడల్పాటి గుండ్రని మొహం—అతనికి కోలమొహం ఇష్టం, కాని ఏం చెయ్యడం? పెద్దకళ్ళు, మబ్బు విడిచిన ఆకాశంలా నిర్మలమైన శరీరచ్ఛాయ—జడలో రంగు రంగుల పూలు—ఆకుపచ్చరంగు చీర. వయ్యారమైన చీరమడతలు. అతను ప్రేమించదగ్గదే అన్నివిధాలా.

పాశ్చాత్య దేశాలలో నడివయస్సులో వున్న పెద్దమనుష్యులు, పని మనిషితో లేచిపోవడం మామూలే. అది మోటు వ్యవహారం. అందులో సంస్కారం, అందం, వ్యక్తి గౌరవం లేవు. అయినా రామ్మూర్తికి కావలసింది మానసిక చైతన్యంగాని, భౌతిక తృప్తి కాదు.

ఆమెకి వివాహమైందో లేదో తెలుసుకోడం ఎట్లా? పోస్టు బంట్రోతు నడిగితే? వాళ్ళకి బట్టలుతికే చాకలాణ్ని అడిగితే? స్కూలు పిల్లలు ఇండ్లకి చేరుకుంటున్నారు. ఇద్దరు కుర్రాళ్ళు, ఓ ఆడపిల్ల ఆ మేడలోకే వెళ్ళారు. వాళ్ళని బుజ్జగించి మెల్లిగా ఆరాతియ్యాలి.

నాలుగురోజులైన తర్వాత, అవకాశం చిక్కింది. ఆ కుర్రాళ్ళకి చాక్లెట్లు, పిప్పరమెంట్లు పెట్టి, మెల్లిగా వాళ్ళతో కబుర్లు సాగించి, స్కూలువరకు నడిచివెళ్ళి ఆరాతీశాడు. పెండ్లి కాలేదు అమ్మయ్యకి! అనుకున్నాడు. ఇంకా ఎందుకు కాలేదో, ఆమె వాళ్ళ కేమవుతుందో యివన్నీ అడిగాడు. కాని వాళ్ళు సరైన సమాధానం యివ్వలేదు. రోజూ ఆ వీధంట

వెడుతుండేవాడు. ఆ అమ్మాయి అల్లా తనకేసివీధి మళ్ళేవరకూ చూస్తూనే

రామ్మూర్తి మనస్సు ఉండబట్టలేకపొయ్యాడు. ఆమెతో మాట్లాడి అడిగెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. తీరా వ్యవహారం బెసిగిపోయి, నలుగుర్లోనూ పడితే ఏం చెప్పడం? నేనో నవల వ్రాస్తున్నాను. అందులో ఒక పాత్ర ప్రవర్తన ఎంతవరకూ జీవితాన్ని అనుసరించి ఉందో నిర్ధారణ చేసుకోడానికి అలా చేశాను—అనొచ్చు. అట్లాగంటే నమ్ముతారా? నలభై యేళ్ళ పెద్దమనిషి, గౌరవ కుటుంబీకుడు, పౌరుడు, మరో ఉద్దేశంతో అల్లా చేస్తాడనుకుంటే, మన సంఘం నేడు ఎంతటి దుర్దశలో వుందో విశదమవుతుంది. అట్లాంటి సంఘానికి తనకి విలువకట్టి, తీర్పు చెప్పే అధికారం లేదు; ఉండకూడదు.

ఆమెతో ఏమనాలో ముందుగా ఓ కాగితంమీద వ్రాసుకున్నాడు. రకరకాలుగా వ్రాసి చూశాడు. అతనికి ఆఖరికి నచ్చింది ఇల్లా ఉంది.

"నువ్వెవరవో నాకు తెలీదు. ఐనా నాకు సన్నిహితురాలవే. మనకి వెనకటి జన్మలో బాంధవ్యం ఏర్పడి ఉంటుంది నేను నిన్ను కోరుతున్నాను. నీకు భర్త పిల్లలు వున్నా కోరి ఉందును. నాకు ఉన్నారు. తెగించి సాహసిస్తేగాని ప్రేమకి విలువలేదు. నువ్వంగీకరిస్తే, మనది మహోన్నతపు జీవిత మవుతుంది. నిరాకరిస్తే భగ్నజీవినై, పిచ్చివాడినై చెడిపోతాను. పాపాలు, ఘోరాలు చేస్తాను. మరో ప్రపంచ సంగ్రామానికి నేను కారకుణ్ణి అవొచ్చు.

ప్రేమ దాస్యం కోరడంలేదు. సంసారంనుండి విమోచన కోరుతున్నాను. నీ స్పర్శకి పంజరం కడ్డీలు వూడి, అందులోంచి పిట్టలాగ ఆత్మ ఆధ్యాత్మిక సీమలో కెగిరిపోతుంది. ఆత్మ విముక్తి గీతాసారం.

ప్రేమలేని ఆత్మకి విలువలేదు, ఆత్మలేని ప్రేమ పెండ్లి. రెంటినీ ఇవ్వాలి నువ్వు.

తర్వాత నిన్ను త్యజిస్తానని భయమా? మంచి చెడ్డలు, ముందు వెనుకలు, జమాఖర్చులతో నిమిత్తం లేనిది మహోజ్వల ప్రేమ. అందులో నశింపవుతాను. ఒక్క సమిధె నువ్వు సమర్పించాలి.

నాకేం కావాలో నిన్ను కలుసుకున్నంతవరకూ తెలిసింది కాదు. తెలుసుకునేటందుకు నలభై సంవత్సరాలు పట్టింది.

ఇవీ అతను అనదలచుకున్న ముక్కలు. కంఠస్థం చేసుకున్నాడు. సందర్భానుసారంగా అవతలవ్యక్తి చెప్పే వాక్యాలను వూహించి, వాటి కనువైన సమాధానాలను కూడా అనుకున్నాడు.

తనని గురించిన నిజం ఆ వాక్యాలలో ఎక్కడో ఉందనిపించింది రామ్మూర్తికి. ఎందులోనో తెలియడంలేదు. తేల్చుకోక తప్పదు.

మాట్లాడేటందుకు తగిన ధైర్యం పురస్కరించుకునేప్పటికి, మరో పదిరోజులు గడిచాయి. ఆ రోజున విద్యాధికారి స్కూలు తనిఖీ వుంది. పొద్దోయింతర్వాతగాని పిల్లలు యిళ్ళకి రారు. ఆ యింట్లోంచి ఒకామె బైటకొచ్చి వీధమ్మట నడుస్తూ వెళ్ళింది.

సాయంత్రం ఆరు దాటింది. సూర్యుడు పడమటి ఆకాశంలో ఆవులిస్తూ మంచంమీద నిద్రకి కూలబడినట్లు దిగుతున్నాడు. దిగిపోయ్యాడు, ఎర్రశాలువా కప్పుకుని. సంధ్యలో మేఘాలవెనక మొదటి నక్షత్రం తళుక్కుమనగానే రామ్మూర్తి తలుపుతోసి లోనికి ప్రవేశించాడు. తను వొంటిగా ఉండటం — చీకటి—ఈ రెండూ కొత్త ఉత్సాహాన్నీ, తెగింపునీ యిచ్చాయి అతనికి. హాల్లో మూలగా మేడమీదికి మెట్లున్నాయి. గబ గబ ఎక్కి బాల్కనీలోనికి చేరుకున్నాడు. ఆ అమ్మాయి కుర్చీలో కూర్చుని ఉంది. లేవలేదు. అతను నిలబడాల్సి వొచ్చింది. వెనకాల గదిలో కుర్చీ తెచ్చుకుని కూర్చుంటే? వ్యవధి లేదు. మళ్లా ఎవళ్ళైనా రావొచ్చు. ఇందాక వెళ్ళినావిడ అప్పుడే రాదు కదా! కంఠస్థం చేసుకున్న వాక్యాలు చదవడం మొదలెట్టాడు. ఆమె కళ్ళల్లోకి తీవ్రంగా చూస్తూ, ఉద్రేకపు తీవ్రతలో కొన్ని వాక్యాలు వొదిలేశాడు.

"నీకు భర్త, పిల్లలు వున్నా కోరి వుందును, నాకు వున్నారు."

"సంసారంనుండి విముక్తి కోరుతున్నాను."

"తర్వాత నిన్ను త్యజిస్తానని భయమా ?"

"తెలుసుకునేందుకు నలభై సంవత్సరాలు పట్టింది...." అవి రామ్మూర్తి వొదిలేసిన వాక్యాలు. గడియారంకేసి చూసుకున్నాడు. రెండు మూడు నిమిషాలు పట్టిందేమో !

సమాధానం కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు. ఆమె ఏమీ మాట్లాడ లేదు. చీరకొంగు వేళ్ళకి చుట్టుకుంటూ వింతగా నవ్వుతూ కూర్చుంది. రెండుమార్లు లేవబోయి కూర్చుంది.

"చెప్పవూ ?"

ఆమె మాట్లాడలేదు.

"తొందర్లేదు. ఆలోచించుకుని చెప్పు. రేపీపాటికి వొస్తాను."

ఆమె జడ సర్దుకుంది. తల్లో పూలు కిందపడ్డాయి. అతను తీసి ఆమె చేతి కిచ్చాడు.

"మళ్లా రేపొస్తాను. వెళ్ళిరానా !"

ఏమీ సమాధానం లేదు.

రామ్మూర్తి మెట్లు తొందరగా దిగి హాల్లోకి చేరుకున్నాడు. వెనక ఎవరో కదిలినట్లనిపించింది. మెట్లకింద తలుపుకేసి చూశాడు.

హాల్లో తలుపు వెనకాల నిలబడి వుంది. ఆమె యిందాక వెళ్ళి నామెలా ఉంది. తను రాగానే ఆ తలుపు వేసి వుండకూడదూ ? సన్నటి దీపం వెలుగులో బాగా కనబళ్ళేదు.

"నేనంతా విన్నానండి బాబూ ! మా అక్కయ్య కూతురే. మీ కెవరేనా తమ్ముళ్ళుగాని, మొగపిల్లలు ఉండి పెళ్ళి చేసుకుంటే మా క్కావలసిం దేముంది ? ఏం చెయ్యం, దాని కర్మ ! పెండ్లి కావడంలేదు. మూగపిల్ల. మీ ఎరికలో ఎవరేనా ఉంటే చూద్దురు బాబు !" అన్నా దామె.

రామ్మూర్తి ఎట్లాగో శ్వాస తీసుకుని ఊడిపడ్డాడు. ఉద్యోగం కోసం మొదటి ఇంటర్వ్యూకి వెళ్ళిననాటిమల్లే, కాళ్ళ చేతులు తిమ్మెర్లెక్కి, వొళ్ళంతా చెమట్లు పోశాయి. విశ్వమంతా తన చుట్టూ కూలి పడితే అట్లా గుంటుంది కాబోలు.

లాఠీదెబ్బలకీ, కత్తిపోట్లకీ, తుపాకీగుండ్లకీ బలి కావడానికి శరీరం సిద్ధపడుతుంది. అహం ఒక్కమాటతో మూర్ఛిల్లుతుంది. ముసలామె చేసిన తీర్పు — జన్మాంతరశిక్ష. మూగపిల్లకి కూడా తను తగడు. తన ఎరికలో ఎవరేనా వుంటే చూడాలిట! అంతకంటే ఉరికంబం మేలు.

స్వార్థం గాయపడినప్పుడు బుద్ధి స్తంభిస్తుంది. ఊహ భీభత్సంగా తయారవుతుంది. ఉద్యోగానికి రాజీనామా ఇవ్వాలనిపించింది. ప్రపంచ మంతా ఒక కాలుమీద గెంతుకుంటూ చుట్టి రావాలనిపించింది. సన్యాసం పుచ్చుకోవాలనిపించింది. ఎవరినో హత్య చెయ్యాలనిపించింది. దీని కంతకీ బాధ్యురాలు శాంత. తనచేత కూలివాడి మాదిరి వెట్టిచాకిరీ చేయించుకుని, శక్తుల్ని ధ్వంసంచేసి, వార్ధక్యం వప్పగించి, తను పిల్లలతో హాయిగా పురిటి మంచంలో కులుకుతోంది. స్త్రీకి బాధ్యతలే లేవు. పిల్లల్ని కనడం ఆమె హక్కు. వాళ్ళకి అన్నం పెట్టడం మొగాడి బాధ్యత. తను పట్టుచీర సింగా రించుకుని పేరంటానికెళ్ళడం ఆమె హక్కు. సంతానాన్ని తోడేలు ఎత్తుకుపోకుండా కాపలా వెయ్యడం వీడిబాధ్యత. హక్కులు, బాధ్యతలు.... ఈ బాధ్యతలూ, హక్కులు అనే మాటలు పదేళ్ళవరకూ ఏ పత్రికా వాడ కూడదని ఐక్యరాజ్యసమితి శాసిస్తే బావుండును. ఇంటికి చేరుకున్నాడు రామ్మూర్తి. గుమ్మంలో పోస్టుబంట్రోతు సైకిల్ దిగి టెలిగ్రాం అన్నాడు. ప్రసవించి, శాంత మరణించిందన్న వార్తా!

శాంత పినతండ్రి పంపిన టెలిగ్రాం అది. నొప్పులు ప్రారంభ

మయ్యాయనీ, ఆ సమయంలో తను దగ్గర వుండడం అవసరం గనుక తక్షణం బైలుదేరి రమ్మనీ—ఉంది.

రామ్మూర్తి మెట్లమీద వాలిపోయ్యాడు. శాంతలేని సంసారం ఊహించలేకపోయ్యాడు. తన కీనాడు జరిగిన పరాభవాన్నుండి తేల్చగల శక్తి మరింకెవరి కుంది? ఆమె దగ్గర తను దాచలేడు. చెప్పకపోయినా ఆమె ఎట్లాగో తెలుసుకుంటుంది. తనకి విషాదంగా తోచిన వాటిని నవ్వి పారేస్తుంది. తన కప్రస్తుతమని తోచిన చాకలిపద్దు విషయం ఎంతో పట్టింపు చేస్తుంది. చిత్రమైన మనిషి. వారి అన్యోన్యానికి కారణం ప్రేమా? కాదు, అదేమిటో అతనికి తెలీదు. ప్రేమను గురించి ఆమె ఎప్పుడూ ముచ్చటించలేదు. ఉత్తరాల్లో వ్రాయలేదు. ఆమెతో మాట్లాడేందుకు ఏవీ కనుపించవు. ఆమె వుంటుంది. లేకపోతే తన జీవితంలో ఏదీ చొరలేని ఖాళీ ఏర్పడుతుంది. ఆమె మరణం అనూహ్యం. భాషా భావాలు లేకుండా వాతావరణంపై ఒత్తిడి కలిగించి పరివర్తన తీసుకురాగల కవయిత్రి ఆ యిల్లాలు, శాంత.

ప్రయాణమయ్యాడు. రైల్లో ఎన్నో ఆలోచనలు; తన వివాహం; కొత్తలో శాంత సిగ్గు; చీరకొంగులో నవ్విన దృశ్యం, వికృతంగా ఆవులించడం— ఆమె వికృతంలో, అల్పత్వంలో సౌందర్యం ఉంది.

తనో ?

తనని గురించిన నిజం, మూగపిల్ల ముందు కంఠస్థంచేసి చెప్పిన ఉపన్యాసంలో, వొదిలేసిన వాక్యాల్లో ఉంది. అప్రయత్నంగా వాటిని విడిచి పెట్టినట్లా, లేక కావాలని వొదిలేసినట్లా ?

తెల్లవారింది.

కొంత దూరం బండిమీద ప్రయాణం చెయ్యాలి.

ఇంటికి చేరుకునేటప్పటికి, సాయంత్రం ఏడుగంటలు కావస్తోంది. శాంత పినతండ్రి కలుసుకున్నాడు గుమ్మంలో.

"అమ్మాయి వొద్దండి. నేనే ఇచ్చా టెలిగ్రాం, ఎందుకేనా మంచి దని. నిన్ననే ప్రసవించింది. తల్లి, పిల్ల క్షేమంగానే ఉన్నారు. ఏమీ ఎక్కువ కష్టపడలేదు. పైవాళ్ళ ఆదుర్దా...."

"ఆడపిల్లా" అన్నాడు రామ్మూర్తి.

చూడొమ్మనన్నారు. తొందరగా గదిలోకెళ్ళాడు అంతా నిశ్శబ్దం. వెన్నెట్లో వొస్తువులన్నీ తెల్లటి పొర కప్పుకున్నట్లుంది. ఇంటి కప్పుమీద నుంచి జారిన వెన్నెల వెలుగు శాంత నుదుటిమీద గీతలా పడుతూంది. ఆనాడు సౌందర్యం తన యాత్ర ముగించుకుని పవ్వళించింది ప్రక్కనున్న "సత్యం" అనే పాపని జోకొడుతోంది.

శాంత నీరసంగా నవ్వింది. పాప కేసి చూపించింది.

దీపం పెద్దదిచేసి చూశాడు. అతను నమ్మలేకపోయాడు. భ్రమా? నిజమా? నవ్వుకి శాంత మూతి వొంకరయింది. నిశ్చలంగా అతని కళ్ళ ల్లోకి చూసింది. గాలికి లేచిన నురగలో స్వచ్ఛత, తుఫాను ముగిసిన తర్వాత కొండ శిఖరాల నిశ్చలత్వం, భూకంపం అనంతరం శిథిలాల ఏకాగ్రత, సంద్రాల నడిగుహలో తిమింగలం నిద్రపోయిన తర్వాత మిగిలిన నిర్మలత్వం, సూర్యకిరణం తాకిడికి మత్తెక్కి వికసించలేని ఉదయపు మొగ్గలోని మూగబాధ—అన్నీ ఉన్నాయి ఆ చూపులో.

రామ్మూర్తి జీవితంలో సత్యాన్ని ఎదుర్కొన్న వానివలే వొణికి పొయ్యాడు. చెప్పేటందుకు ఏముంది? వెనక్కి తిరిగాడు.

మాట" అంది శాంత మెల్లగా నిలబడ్డాడు. దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసింది.

'మావాళ్ళకి తొందర. నాతో చెప్పకుండా టెలిగ్రాం ఇచ్చారు" అంది.

"దానికేం, మంచిపనే చేశారు. నాకూ చూడాలనుంది" అన్నాడు రామ్మూర్తి.

"ఇదుగో" అని —ఏదో అనబోయింది.

"ఏం ?

"ఏమీలేదులెండి" శాంత పక్కగా తిరిగి పడుకుని దుప్పటి రొమ్ము పైకి లాక్కుంది.

రామ్మూర్తి వీధిలోకి వొచ్చేసి అరుగుమీద కూర్చుని చంద్రుడికేసి చూస్తూ పదినిమిషాలు గడిపాడు. రెండోవాడు "సేతు" వొచ్చి—

"ఇదుగో నాన్నా, ఏదో కాగితంట, అమ్మ నీ కివ్వమంది" అని కాగితం ఇచ్చాడు.

"మన స్వప్నం ఫలించింది. ఆడపిల్లకి "రామప్రియ" అని పేరు పెట్టుకుంటా. ఇంక మీరు మంచివాడుగా ఉండనక్కర్లేదు.

మీ ప్రియభారతి.'

అనుంది అందులో.

రామ్మూర్తి అప్రయత్నంగా నవ్వేశాడు. గదిలోకెళ్ళి పాపకేసి చూశాడు. సందేహం లేదు. అంతా తన ఊహలో చిత్రించుకున్న ప్రియభారతి పోలికే. ఆ కోలమొహం, నవ్వేటి తీర్చిన కళ్ళు, మధురంగా ముడుచుకున్న పెదవులు—అంతా ఆమే. బైటకి వొచ్చేశాడు.

అసంభవం. తను స్వప్నంలో బాధించుకున్న కవితా సతిఛాయల్ని తన భార్య నవమాసాలు మోసి, పెంచి కన్నదా ?

భ్రమ.

అవుతే భ్రమ నిజం. బైటకి రాగానే అతని కో అనుమానం తట్టింది. గబగబ గదివైపు నడిచాడు. తలుపు తొయ్యబోయాడు. పాప ఏడ్పు వినబడింది. 'అమ్మయ్య' అనుకున్నాడు.

# వనకన్య

ఊరవతల ఎడం ఎడంగా నాలుగైదు పూరిగుడిసెలూ, గొడ్ల పాకలూ, వాటవతల పడిపోయిన మట్టిగోడా, దానవతల రావి చెట్టూ, వార్ధక్యంతో వొంగిపోతూ వున్న చింతచెట్టూ అక్కడనుండి ప్రారంభమవుతుంది. బొటనవ్రేలి ఆకారంలో వొందగజాల వైశాల్యంగల నిరుపయోగమైన స్థలం. ఆ స్థలం అంత మేరా, అయిష్టంగా ఎదిగే సర్వి చెట్లు, నడుమ పాడుబడ్డబావి. అక్కడికి మనుషులూ వెళ్ళరు. పశువులూ వెళ్ళవు. ఎప్పుడన్నా మందనుండి తప్పించుకున్న ఏ మేకన్నా కంచి మెయ్యడానికి వొస్తుందేమో; ఏకాంతాన్ని అన్వేషిస్తూ సోమరితనాన్ని ఋజువు చేసుకోడానికి ఏ గాడిదన్నా పెడుతుందేమో, దట్టంగా ఎదిగిన ముళ్ళపొదలూ, పాకి పాకి నేలని చీల్చి పైకి తేలిన చెట్ల వేళ్ళూ, రక్తమాంసాలను పోగొట్టుకున్న ఆకుల కళేబరాలూ, బావిచుట్టూ పెనవేసుకున్న పూలమొక్కలు, మ్రానులు, దయ్యాలు శ్వాస తీస్తున్నట్లు ధ్వనించే సర్విచెట్లు, మట్టిలో దూసుకుపోయిన రంగురంగుల గుడ్డపీలికలూ, ముళ్ళ, నాచు, మట్టి, దుప్పలు, శిథిలాలైన రాళ్ళ గుట్టలు, సూర్యచంద్రులు భయంతో తొంగిచూసే ఆ ప్రాంతంలో భూతాలు కాపురం వుండొచ్చునేమో అనిపిస్తుంది. మనుషులుండటానికి వీలుకాదు.

అక్కడికో మనిషొచ్చాడు ఆ సాయంత్రం. కోటువిప్పి అదీ ఎగిరి పోకుండా రాయిపెట్టి, చొక్కా చేతులు మడిచి, ఆకుల మధ్య గాలించడం

మొదలెట్టాడు. సూర్యుడు ఆకాశం అంచు చివర దిగిపోయి తన వునికి తెలియజేస్తూ, ఆవేశంలో ఇంత పసుపు కుంకుమ వెదజల్లి వెళ్ళాడు. కొమ్మలనడుమ గబ్బిలాలు బైటపడటానికి సంశయిస్తూ వింతధ్వనులు చేస్తున్నాయి. చీకటి తరుముకొస్తూ వుంది. కీచురాళ్ళు మట్టిపురుగులు తీతువులు గొంతులు సవరించుకుంటున్నాయి.

నడుంగా ఆ దుప్పలు పొదలు విడిపోయిన చెట్లకొమ్మలు చీపురు పొద ఆ మధ్య ఖాళీ ఏమిటో శోధించడానికి ఆ వ్యక్తి ముందుకు నడిచాడు. అది పాడుబడ్డ బావి. వెడల్పుగా వుంది. లోపలంతా చీకటి. నలుపు గోడలు. అంచులు కనబడ్డంలేదు. లోపలి వారలచుట్టు పొదలు ఎదగడం మానేసిన చెట్లకొమ్మలు చీపురు కాడల కుప్పలా కమ్మివేశాయి. వాటిమధ్య తీక్షణంగా చూస్తే లోపల పచ్చటి నీరు. ఏవేవో ఆకులు—ఆ కదిలేది తాబేలుపిల్ల. జడుసుకున్నట్లు అడుగు వెనక్కి వేశాడు. ఏవో కొన్ని ఆకులనూ, వ్రేళ్ళనూ తుంచి కాగితంలో కట్టి కోటుజేబులో ముడుస్తున్నాడు. చీకటి దట్టమైంది. గబ్బిలం తెగించి బైటపడింది. గుడ్లగూబ ప్రేయసిని పలకరిస్తోంది. రకరకాల ధ్వనులు—అతను పోల్చలేడు. ఆకులు రెపరెపలు—అడుగుల చప్పుడు కోటు దులిపి తొడుక్కుంటున్నాడు. ఆ సర్వీచెట్టు వెనక ఎవరో వొకామె నిలబడి వుంది. చివాలున అటు తిరిగింది గడ్డిలో కూర్చుంది.

ఎవరామె? ఇక్కడికెందుకొచ్చిందో? అతను ఆశ్చర్యపడ్డాడు. తనెందుకొచ్చినట్లు?—అవును, ఆకు, అలము, వేరు మాను—వింత వింత రకాలని ఇంటికి తీసుకెళ్ళి, ద్రావకాలు పోసి, మాడ్చి వాటి లక్షణాలు పరిశీలించి, దేనికన్నా మందుగా ఉపయోగపడతాయేమో కనుక్కోవాలి—అతని పేరు సుదర్శనం—డాక్టరు దగ్గర కాంపౌండరు. డాక్టర్ చదివింది [illegible]షు వైద్యమే అయినా, బీదలకి "నేటివ్" మందులు వాడుతుంటాడు. [illegible] సుదర్శనం ఆకులూ, వేళ్ళూ పోగుచేసి పరిశోధించ

డానికి అనుమతిచ్చి, ప్రోత్సహిస్తాడు. ఏ ప్రాంతంలో వున్న ఓషధులు ఆ ప్రాంతం రోగులకు మందులుగా ఉపకరిస్తాయని ఆయనకో నమ్మకం.

సువర్ణసం కోటు తొడుక్కుని వెళ్ళడానికి సిద్ధపడుతున్నాడు. ఆమె వొంటిగా వెళ్ళగలదా? ఆమెని దిగవిడిచి వెళ్ళడం మంచిదా? అనుకుంటుండంగానే ఆమె లేచి, వెడుతోంది "అమ్మయ్య" అనుకున్నాడు ఆమె దూరంగా వెళ్ళాక అతనూ ఇంటికి బైలుదేరాడు. అతని వయస్సు పాతిక, కాలేజీలో చదువు పూర్తవ్వకుండానే; కుటుంబ పరిస్థితుల వొత్తిడి వల్ల కాంపౌండరుగా కుదిరిపోయ్యాడు. ఆ వొచ్చినామె అక్కడికెందుకొచ్చిందో ఊహించలేకపోయ్యాడు.

* * *

ఆ మర్నాడు మళ్ళీ ఒక్కడికి చేరుకున్నాడు కాస్తంత పెందరాళే, ఆకులు పీస్పు ఏరడం మొదలెట్టాడు. అతనికి ఆ మొక్కల పేర్లు తెలియవు. కొత్తగా కనబడిన ఆకులన్నీ పోగు చేస్తున్నాడు. సాయంత్రం ఐదు దాటింది; అయ్యింది; సూర్యుడు చెట్ల వెనుక ఎర్రకాలువలాంటి వెలుగుని ఆకాశంలో విప్పి పారేసి; కిందికి దిగుతున్నాడు. ఆ చెట్టువెనుకే నిన్న వొచ్చినామె కూర్చుంది. అక్కడి గడ్డిని పరీక్షగా చూశాడు. అక్కడ ఏ పూలమొక్కలూ లేవు.

ఏదన్నా వాస్తువు పాతడానికొచ్చిందా? పాతినదాన్ని త్రవ్వి తీసుకెళ్ళడానికొచ్చిందా? లేదు ఆకాశంలో ఎఱుపు నలుపుగా కరుగుతోంది, గబ్బిలం రెక్కలు విప్పుతోంది, కీటకాలు సన్నగా రొద సాగిస్తున్నాయి. కాసేపు గడ్డిలో కూర్చున్నాడు. ముళ్ళుగా తగిలినవాటిని అటూ ఇటూ త్రోసివేసి ప్రకృతి దిగులుగా వున్నా, అతని మనస్సు ప్రశాంతంగా వున్నట్టనిపించింది. ఆ నిర్జన ప్రదేశం తనది అని అనుకోడంలో ఆనందం వుంది. చూడంగా; నిన్న తాను కూర్చున్న గుట్ట దగ్గరకొచ్చింది, ఆమె— నిన్న వొచ్చినామె అతన్ని చూసింది. కంగారుపడి వెనక్కి తిరిగి వెళ్ళబో

తూంది. పలకరిస్తేనేం? ఆ ఊళ్ళో ఆమెని ఎక్కడో, ఎప్పుడో; చూసి నట్లుంది. చిన్నామె; ఇరవై లోపేమో. వాడిన మందార లాంటి వెలుగులో ఆమె కళ్ళు మెరిసినట్టనిపించింది. వైఖరి; వాలకం చూస్తే, బీదకుటుం బంలో పిల్లలాగుంది. అదేమిటి అల్లా వెళ్ళిపోతూంది? వెళ్ళిపోయింది. గొడ్లపాకలు దాటి—ఇంకా దూరంగా వెళ్ళిపోయింది.

కొమ్మలపై తమ జాగాలపై హక్కులు చలాయిస్తూ పిట్టలు; అటూ ఇటూ ఎగిరి పోటీలు పడుతున్నాయి. కీచురాళ్ళ రొద ప్రారంభమైంది. ఆకా శంలో అక్కడక్కడ నక్షత్రాలు—అటుకేసి ఆకులనడుమ చందమామ. సన్నటిగాలి మొదలెట్టింది. గాలి, చంద్రుడు, నక్షత్రాలు కొస్తంత ధైర్యా న్నిచ్చినా వొక ఖావరం మెదడులో రేగి! భయంతో క్షణం గగుర్పాటు చెందాడు. ఊరవతల నిర్జనప్రదేశం—పాడుబడ్డ బావి—అట్లాంటిచోట దయ్యాలు తిరుగాడతాయంటారు. ఆ వొచ్చినామె అలాంటి స్వరూపమా? తొందరగా లేచి వెళ్ళాడు సుదర్శనం. ఆ రాత్రల్లా ఆమెని గురించిన ఆలోచనలే. ఆమె ముఖాన్ని మరిచిపోలేకుండా వున్నాడు. ఆ పెద్దకళ్ళతో తన కనురెప్పల వెనుక చూసినట్టవుతోంది. భూతం అందంగా వుంటుందా? బీదదయ్యం అంటూ వుంటుందా? నల్లదుస్తులు ధరించాలి కాని, ఆకుపచ్చ రంగు చీర కట్టుకుందా? ఆమె రవిక రంగేమిటో అతను గమనించలేదు. ఎవర్నైనా అడిగి తన సందేహాలు తీర్చుకోవాలి. నిద్ర పట్టేసింది.

* * *

మరి నాలుగురోజులు అటుకేసి వెళ్ళలేదు సుదర్శనం. ఆమెని గురించి ఎవర్నీ అడగలేదు. అంతగా ఆలోచించే అవసరమూ కనబడ లేదు. తనదంతా భ్రమ. ఆమె ఆ ఊళ్ళో మనిషే—ఏదో పనిమీద అటు వెడుతూ అక్కడికి వొచ్చి వుంటుంది.—తనని చూడగానే సిగ్గుపడో, భయపడో వెళ్ళిపోయింది. గొడ్లపాకకేసి వెళ్ళడం తను చూడనే చూశాడు దయ్యంలేదు. గియ్యంలేదు అనుకున్నాడు.

సుదర్శనానికి వివాహం కాలేదు. ఆమె మొహంలో ఏదో వుంది. ఆ క్షణం చూపుతోనూ ఆమె తనని ఆకర్షించిందని ఒప్పుకోక తప్పడం లేదు. ఆమెని దగ్గరగా పరీక్షగాచూస్తే ఎలా వుంటుందో ఊహించుకోడంలో ఆనందం లేకపోలేదు. ఏదో రోజు అక్కడికి వెళ్ళాలనుకున్నాడు, ఆమె మళ్ళా అక్కడికి వొస్తుందనిగాదు. ఆ నూతిలోపల వరల రెండువైపులా ఎన్నెన్నో మొక్కలు, సగం సగం లేచిన పొద, చెట్ల కొమ్మలూ మొలిచి వున్నాయి. అందులో కొన్నింటిని పోగుచెయ్యాలి. కాని దిగడం ఎట్లా? ఎంత లోతుందో తెలియదు. పూరిపాకలు దాటాక గొడ్లపాకల దగ్గర కొచ్చాడు. అది చివరిపాక. అక్కడ ఎవ్వరూ లేరు— దిబ్బేసిన గడ్డి వామిలో భాగం తప్ప. అక్కడ పశువులుకూడా లేవు. కాని పాకలో తడి కలకి తగిలించిన నిచ్చెన కనబడుతోంది. మధ్యలో మెట్లు కర్రలు లేవు. చాలాచోట్ల తాళ్ళతో మెలితిప్పి నిచ్చెన గట్లున్నాయి.

పాకలోకెళ్ళి అటూ ఇటూ చూశాడు. ఎవ్వరూ లేరు. సూర్యుడు దిగిపోవడానికి సంసిద్ధుడవుతూ, పిడోక్కలుకై మేఘాలని పిలుస్తున్నాడు. కాస్తంత ముందుగా వొచ్చి వుండకూడదూ? ఏమైతేనేం తీరా బైలు దేరాడుగా....అతని దగ్గర బేటరీలైటు లేదు. సైకిల్‌కి తగిలించే లైటుంది కోటు జేబులో, ఇంకా కాస్తంత పొద్దుంది. పాకలో తడకల కానించిన ఆ నిచ్చెన తీసుకుని చరచరా నడుచుకుంటూ సర్వీచెట్లవైపు నడుస్తున్నాడు. చెట్ల నీడల నడుమ చీకటి అలుముకుంటోంది. ఆ చింతచెట్టుకింద మరీ చీకటిగా వుంది. ఆకుల నడుమ కాస్తంత ఎదిగిన చందమామ. నిచ్చెన చెట్టుప్రక్కనున్న గుట్టమీద జార్లవేశాడు. ఏదో చప్పుడైంది. వింత రొద. భయమేసి అటు ఇటు చూస్తున్నాడు. ఎవ్వరూ కనబడరు. మళ్ళీ ఏదో చప్పుడు—ఎక్కడనుంచి? స్థలం నడుంగా వున్న నూతి అంచుకేసి వొచ్చాడు. ఆ రొద. బావి లోపల్నించి వొస్తున్నది. కోటుజేబులో లైటువేసి బావి లోపలకు చూశాడు. అడుగున ఆమె.

నాలుగు రోజులక్రితం చూసినామె. పరిగెత్తి నిచ్చెన లాక్కొచ్చి బావిలోకి దించాడు దీపం గట్టునపెట్టి, కోటు తీసేసి, పంచి మడిచికట్టి, తనూ లోపలికి దూకాడు. మనిషి మునిగేటంతటి లోతు నీళ్ళు లేవు. నిల బడితే అతని భుజం నీళ్ళపైన వుంది. ఆమె చేతులని తన మెడచుట్టూ బిగించమని నడుం పట్టుగుని నిచ్చెన మెట్లు ఎక్కుకుంటూ పైకి వొచ్చాడు. నిచ్చెన మెట్లు అంతటితో ఆఖరు. ఇంకా మూడడుగుల ఎత్తునగాని నూతి అంచు తగలదు. అతను వొంగి, ఆమె రెండు కాళ్లూ తన భుజంపైమోపి, ఎగప్రాకుతున్నాడు. ఆమె రొప్పుతోంది. తడిసి విడిపోయిన చీర మడతలు మధ్య అతని తల ఇరుక్కుంది. పొట్టమీద చీరముడి విప్పి, బలంగా ఆమె నడుం వెనక చేతిని నొక్కిపట్టి పైకితోశాడు. అంచుకు చేరుకుంది. కుడివైపున సగం సగం ఎదిగిన కొమ్మల ఆధారంగా నిచ్చెనను పైకిలాగి తాను నూతి అంచుపైకి చేరుకున్నాడు సుదర్శనం.

ఆమె అయాస పడుతోంది. ఊడిన చీరమడతలు పిండుతున్నాడు. ఆమె కాళ్ళు చేతులు ఊపి సవరిస్తున్నాడు. పొట్టమీద చేతులతో గట్టిగా నొక్కాడు, నోట్లోంచి నీళ్ళు వొచ్చి ఉక్కిరి బిక్కిరవుతోంది. ఆయాసం కాస్త తగ్గింది. సిగ్గుతో పక్కకు తిరిగింది. తన కోటుతో ఆమె వొంటిని తుడుస్తున్నాడు. కోటు లాక్కుని పక్కకు వంగి వొణికిపోతూవుంది.

"కాస్తంత అటుకేసి ఉండండి" అన్నది జీరబోయిన సన్న కంఠంతో. అతను దూరంగా వెళ్ళి చొక్కా పంచె నీరు పిండుతున్నాడు. నిచ్చెన కర్రమీద తల ఆనించి, పరుండి నక్షత్రాల కేసి చూస్తున్నాడు. చీకటి ముసుగులా కప్పుతోంది. ఆమె శరీరం తాకిడినుండి అతని వొళ్ళు తేరుకుని విడి తనదవుతోంది. భుజాల గుండ్రతనం, నడుం ఒంపు, తీక్షణమైన శ్వాస, తడిని ఆవిరిచేసే పొట్టకింద వేడి, చేతిలో ఇమిడి ఇమడక ఎగిరిపడే స్తనాల గుండ్రతనం, నునుపు, గట్టితనం—వింత స్పర్శ—ఎన్నో కత్తులు విరిగి, వంగి, గుండ్రంగా ముద్దకట్టి రబ్బరుకి

మల్లె సాగుతూ తన చర్మం లోపలికి దూరి, మళ్ళా కత్తులుగా మారి వేడితో కాలుస్తూ, పొడుస్తూ దూరంగా పారిపోయి నక్షత్రమైనట్లు ! గాలికి, పంచి ఆరిపోయింది. ఖద్దరుచొక్కా ఇంకా అక్కడక్కడ తడిగానేవుంది. బట్టలు వేసుకున్నాడు, ఆమె దగ్గరకెళ్ళి కూర్చున్నాడు. చీరను ఒంటిమీద దుప్పటిలా కప్పుకుంది. పాదాలని చేత్తో రాసి వేడిచేస్తున్నాడు. అరిచేతుల్ని రాసి వేడిచేస్తున్నాడు.

"ఏమిటి నువ్వు చేసిన పని ?"

"నచ్చిపోదామని" కంఠం నీరసంగా ఉంది—ఒణుకుతుంది ఇంకా. పొడుగాటి ఒంకులజుట్టు—పెద్దకళ్ళు—గుండ్రని కనుబొమ్మలు — పెదవుల వెనక పళ్ళ తళుక్కు సన్నటి కోలమొహం—

"ఎందుకు ?"

సమాధానం లేదు.

"ఏం, చెప్పకూడదా ?"

మాట్లాడదు—పక్కకి తిరిగింది. వేళ్ళతో అతని చేతిని క్షణం నొక్కిపట్టి తోసేసింది.

"ఇంక వెడతా. అమ్మ కూకలెడుతుంది. మీరు రాకుంటే ఈపాలికి హాయిగా సచ్చిందును."

"అదే ఎందుకని అడుగుతున్నాను. అసలు నువ్వెవరవు ?"

"అచ్చమ్మ కూతుర్ని—నేను మిమ్మల్నెరుగుదును. డాక్టర్ గారింట్లో మందులిస్తావుంటారుగా. దొడ్లో పనిచేసుకుంటా వుంటే కంత లోంచి కనబడేవోరు. పక్కనే కిష్టయ్యగారింట్లో పనిచేసేదాన్ని."

ఎప్పుడో ఆమెని చూసేవుంటాడు—కాని పరీక్షగా గమనించలేదు. ఇప్పుడు బాగా గుర్తొస్తోంది. మళ్ళా చేతులతో రాస్తున్నాడు.

"అమ్మో" అని తోసేసింది.

"ఏం ?"

"మంటెడతా వుంది."

సైకిల్ లైట్ వెలిగించి ఆమె ఒంటిమీద వేశాడు.

మోచేతికింద చర్మం రేగిన గాట్లు, కోసినమచ్చలు, రక్తంలేదు. నూతిలో పడినప్పుడు బొదలు, కొమ్మలూతాకి రేగిన పుండ్లు.

"ఆస్పత్రి దగ్గర కెడదాం. మందేసి బాండేజి కడతా."

"అమ్మో! అమ్మ సంపుద్ది."

"ఈ పుళ్ళేమిటంటే ఏం చెప్తావు ?"

"సెర్లో జారిపడ్డానంటా" నవ్వుతోంది.

"ఎందుకూ నూతులోపడటం ?"

"పడదామని రొండుసార్లొచ్చా మీ రుంటిరి. ఎట్లాగని ఎళ్ళి పొయ్యా"

"అదే ఎందుకని ?"

పక్కకి తిరిగి వెల్లకిలా పడుకుంది మొహం ఒక పక్కకి వాల్చింది.

"రంగమ్మ సెప్పింది డోకులూ అయ్యి సూసి. మూడో మాసమంట. అమ్మ సంపేస్తుంది అమ్మ సంపడం దేనికి? నేనే సద్దామని."

ఏవో కొన్ని సందేహాలున్నాయి కాని ఎట్లా అడగాలో తెలియటం లేదు సుదర్శానికి.

"చావడం దేనికి మందులున్నాయిగా"

"ఉన్నయ్యా—ఇస్తారా—అమ్మకి తెలీకండా ?"

పక్కకి తిరిగి అతని కళ్ళల్లోకి చూస్తోంది. అతని తల ఆమె వక్షంపై వాలింది. గాలికి ఆకులు కదిలి ఎడమైనప్పుడల్లా సన్నటి వెన్నెల వారి శరీరాలపై కదుల్తోంది.

"రేపిస్తారా మందు ?"

సమాధానం లేదు.

"మిమ్మల్నే"

ఉలిక్కిపడ్డాడు. కళ్ళు తుడుచుకున్నాడు.

"చూస్తాలే"

ఆమె లేచింది. దూరంగా వెళ్ళి బట్టలు సరిచేసుగుని నడుస్తోంది.

"రేపొచ్చేదా ?"

"చెప్తాగా"

"నే పోతా ?"

అతను లైటు సరిచేశాడు. ఆ వెలుగులో నడుస్తోంది. గొడ్లపాకలు దాటి వెళ్ళింది. సుదర్శనం కోటు వేసుగుని నిచ్చెన బుజాన తగిలించుగుని గొడ్లపాకకేసి వెళ్ళాడు. నిచ్చెన పాకలో వదిలేసి ఇంటికెళ్ళాడు.

* * *

అన్నాడే కాని ఆ మందేమిటో డాక్టర్ని అడిగే ధైర్యం లేదు సుదర్శనానికి. అక్కడున్న పుస్తగాల్లో చూశాడు. కాని తనకి కావల్సింది వాటిల్లో లేదు. ఏం చెయ్యాలి ? అమ్మకి తెలియకుండా మందివ్వమంది. ఆస్పత్రికే ఒస్తుందా ? వాళ్ళ ఇల్లెక్కడ ? ఆమె పేరేమిటో ! తనకి ఆమెని గురించి ఏమీ తెలీదు. అయినా ఆమె నెరుగున్నంత గాఢంగా మరెవర్నీ అతనెరుగడు. అతని స్నేహితుడు గున్నాథం పై ఊర్లో డాక్టరు; అతనికి వ్రాసి కనుక్కుంటే ? ఇట్లాంటివి ఉత్తరాల్లో వ్రాయకూడదేమో. ఆ ఊరెళ్ళి గున్నాథంతో స్వయంగా మాట్లాడి తెలుసుకోడానికి నిశ్చయించాడు. ఆ రాత్రికి నిశ్చితంగా నిద్రపొయ్యాడు. మర్నాడు, ఊరు వెళ్ళడం బదులు, డాక్టర్ స్నేహితుడికి ఉత్తరం వ్రాసిపడేశాడు. జవాబు కోసం ఎదురు చూసిన నాలుగు రోజులూ, అతను పూరవతల బావి దగ్గరకు వెళ్ళలేదు.

ఐదోనాడు సాయంత్రం అటుకేసి వెళ్ళాడు. సాయంత్రం ఐదు దాటింది. అవే చెట్లు అదే బావి—లోపల తాజేలు పిల్ల. మరో రోజు కాస్తంత పెందరాళే నిచ్చెనతో వొచ్చి, ఆ బావిలో మొక్కల్ని తీసికెళ్ళి

పరిశీలించాలి. ఆ సాయంత్రం వారిద్దరూ ఎట్లా పైకొచ్చిందీ స్మరించాడు. ఆమె అక్కడ పడుంది తనిక్కడ చొక్కా ఆరబెట్టుకున్నాడు. ఈ గడ్డిలో ఆమె జడ – అంగుళం మేరలో అవి ముళ్ళు, బావిలో పడ్డప్పుడు, ఏ కొమ్మ ఆమె చేతిని గాయపరిచిందో? సంధ్య వెలుగు చెట్ల వెనక దాగిలి మూతలాడుతోంది. ఆ మబ్బుల నడుమ నలుపు నీడలు—ఆమె శరీరపు చాయ ఆ రకం నలుపే మధ్య పాపిడినుండి విడిపోయిన తలవెండ్రుకలు కనుబొమ్మల మీదికి జారినప్పుడు, ఏదో క్రౌర్యం—కోపం కొండమీదికి పాకినట్లు, కొత్తనీటిని మీదికి సోకనివ్వకుండా, వేడెక్కి పైకుబికిన నేలకి మల్లె – చితిలో బిగించిన పుష్పం జడలో కత్తిగా దూసుకుపోయినట్లు—అదేదో వుంది ఆమెలో—అతను విడమర్చి చెప్పలేడు. ఇదేదో నూగు నడుమలో కొత్తరకం ఆకులా వుంది. ఏరడం మొదలెట్టాడు.

పశ్చిమ ఆకాశంలో ఎఱుపు కరిగి, దట్టమైన నల్ల మేఘాలు అలుము కున్నాయి గాలి జోరుగా వేస్తోంది. ఇంకెక్కడా జాగాలేనట్లు సర్వేచెట్ల మధ్య తారట్లాడుతూ; ఆవులింత ఆపుతూ చిటికలు వేసినట్లు ఎండుకొమ్మలు విఱిగి పడుతున్నాయి. నేలమీద ఆకులు పైకి లేస్తున్నాయి. పల్చటి ఆకులు పక్కకి ఎగురుతున్నాయి. చీకటి ముసుగులా కప్పి జోలపాడుతున్నట్లు వింత ధ్వనులు రేగాయి. క్షణం అంతా నిలిచిపోయింది; ఆ క్షణంలోనే నిండైన వర్షపు చుక్కలు బరువుగా పడుతున్నాయి. కాసేపు ఆ దిక్కు, కాసేపు ఈ దిక్కు—దిక్కు తెలుసుకున్నాక, తొంభై డిగ్రీల కోణంలో తిన్నగా పడుతున్నాయి. సుదర్శనం, పరుగెట్టి గొడ్లపాకలో చూరుకిందికి చేరుకున్నాడు. పాతగోనెసంచుల కుప్ప వెనక కూర్చున్నాడు. అంతా చీకటి—ఛీకటి స్వరూపం చూపెడుతూ మెఱుపులు — ప్రక్కనే నిలబడ్డ ఆమెను చూశాడు.

"నువ్వా ?"

"మందు తెచ్చా :"

"ఉహూ"

"తెస్తానంటిరిగా. కలుద్దామని రోజూ వొచ్చిపోతుంటా. ఊ రెళ్ళారా?"

"ఉహూ"

"రేపొచ్చేదా ?"

"ఉహూ"

పశ్చిమ ఆకాశంలో పిడుగుల ప్రతిధ్వనులు.

"ఇక్కడెందుకున్నావు ?"

"అహ" అందామె.

"అహ ఏమిటి ?"

"పోనీ 'ఉహూ' అనేదా ?"

"ఓ, అదా" నవ్వుతూ అనడం ఆమెకి చీకట్లో తెలియదు.

"మీ రొస్తే కనుక్కుందారని బైలుదేరేతలికి వర్షం — ఇక్కడి కొచ్చా" ఆమె నవ్వుతూ అన్నది ఇతను చూడలేదు.

"ఆ రోజున నిచ్చెన తెస్తం దేనికి ? నూతిలో పడతానని ఎట్ట తెలుసు ?" వర్షం నిలిచిపోయింది. శత్రువుని వెంబడిస్తున్నట్లు పిడుగులు దూరదూరంగా ప్రతిధ్వనించి కంఠాలు పోగొట్టుకుంటున్నాయి.

"అందుకోసం కాదు. నూతి పశ్చిం దిగువలో మొక్కలు కోద్దా మని — మందుకి పనికొస్తాయేమో చూద్దామని, ఇదుగో ఈ నిచ్చెనే తెచ్చాను." అని అక్కడున్న నిచ్చెనకేసి చూపాడు. మెఱుపు వెలుగులో నిచ్చెన చూసిందామె.

"అదేంమ్మందు ? నాకిచ్చేదా ?"

"నీకు తెలీదులే."

"మరిగవి రేపొచ్చేదా ? — చొప్పున ఇంటికెళ్ళాలె, అమ్మ పెందలకడే వొస్తానంది. ఈ పాలికి వొచ్చే వుంటుంది. మరిగవి పోయేదా ?" అంటూనే, కట్టిన చీర అంచులు మడమలపైకి లాగి, పడిపోకుండా,

అటూ ఇటూ కదుల్తూ, తూలుతూ వెళ్ళింది. ఏమిటో ఈ వర్షం గొడవలో ఆమె పేరుకూడా అడగలేదు. ఏవో కొన్ని ప్రశ్నలు అడగదల్చాడు. నాటికి సమాధానం తెలిస్తే మూడో మాసమో, రెండో మాసమో తెలుసుకోవచ్చు. కాని ఎలా అడగడం? ఆస్పత్రికి రప్పించి మంత్రసాని బంగారమ్మని చూడమంటే? చావబోయ్యేదాన్ని రక్షించాక, ఆమె పట్ల తనకేదో బాధ్యత వున్నట్లనిపిస్తోంది. రక్షించడం మంచిపని. ఆమె కోరింది చెయ్యడం తప్పు. అంతా గంద్రగోళంగా వుంది. ఇంటికెళ్ళాడు సుదర్శనం. సాయంత్రం టపాలో వచ్చిన డాక్టర్ ఉత్తరం చూసుకున్నాడు. అందులో తను అడిగినదానికి మందేమిటో వ్రాయలేదు. సరికదా, ఎవరికి, ఎందుకు వివరాలు తెలుపవల్సిందిగా వుంది. కలసి మాట్లాడుకుందాంలే, అని ముగిసింది గుర్నాథం ఉత్తరం. సరేలే—అనుకున్నాడు. మళ్ళా మూడురోజులయ్యాక బైలుదేరాడు. పాడుబడ్డ బావి స్థలం దగ్గఱకు. స్థలంపట్ల ఇదివరకున్న మక్కువ అతనిలో ఇవాళలేదు. ఆకులూ, రెమ్మలూ, వ్రేళ్ళూ ఇదివరకే కోసుకెళ్ళాడు, పరిశోధనికి కావల్సిన ద్రావకాలు, పరికరాలు డాక్టర్ గారి ఆస్పత్రిలో లేవు. అది ఒకరివల్ల అయ్యే పనికాదు. ఎందరో రసాయనిక శాస్త్రజ్ఞులు పూనుకుంటేనే ఆ పరిశోధనలకి ఫలితం వుంటుంది. అందుగు తగినంత పరిజ్ఞానం, శిక్షణకూడా తనకి లేవన్న జిజ్ఞాస ప్రస్తుత నైరాశ్యానికి కొంత కారణం.

నిజమే, బావిలోపలి భాగంలో కొన్నింటిని పైకిలాగి తీసుకెళ్ళాలి మరెప్పుడన్నా, మళ్ళా ఆ గొడ్లపాకలో నిచ్చెన తెచ్చుగుని, ఆ ఉడతని చూస్తున్నాడు. ఏదో పోగుచేసి బంతిలా చుడుతుంది. చీపురుపుల్ల నూగుని దారంలా పెనవేస్తుంది ఎందుకో. అల్లా వెడుతోంది ముంగిస, ఇక్కడ పాములుకూడా వుండొచ్చు. తనకేదో దిగులుగా వుంది. సర్వీచెట్ల దిగువ గడ్డిని సరిచేసుకుని పడుకుని ఆకాశంలోకి చూస్తున్నాడు. అతనికి పెండ్లి కాలేదు. ఇద్దరు తమ్ముళ్ళకి చదువు చెప్పించే భారం తనమీద పడింది.

అందుకే చదువు పూర్తవకుండా డాక్టర్ దగ్గర కాంపౌండర్‌గా కుదురు కోవాల్సి వొచ్చింది. ప్రెసిడెంట్ భద్రయ్యగారు తనకి స్కాలర్ షిప్ ఇప్పిస్తామన్నాడు నిజమే. ఎవరన్నా పెద్దకట్నంతో పిల్లనిస్తే, కొంత కలిసొస్తుంది. కాని కట్నం పుచ్చుకోవాచ్చా? అతని కిష్టంలేదు. అంతా గంద్రగోళంగా వుంది. శరీరం వేటినో కావాలంటుంది. దాని వొత్తిడి అదొక రకమైంది. దానికి అభం శుభం, మంచి చెడుగు తెలియవు. అప్యాయత, వెచ్చదనం, మెత్తగా, దగ్గరగా, కాల్చేసే వేడి—అబ్బో శరీరం ఎంత వేడి!—రక్తానికి ఎంత వేగిరపాటు! నాళాలు, నక్షత్రం మినుకు మన్నట్లు అల్లా గుండెతోబాటు కలిసి దడ దడ కొట్టుకుంటూ వుంటాయి. అదే జీవుడు. వెనక్కి ముందుకీ, అటు ఇటు అల్లా కొట్టు కుంటూ వుండాలి.

నక్షత్రాలు, విశ్వంలో గోళాలు—అన్నీ అంతే—అల్లా కొట్టు కుంటూ ఉంటాయి. అదే సృష్టి. కాని జీవుడు స్వయం పోషకం, స్వయం ప్రకాశం కాదు. మరొక దాంట్లోపడాలి—కలవాలి—కలిసి ఏకమవాలి. ఆ మరొక దాని కోసరం అన్వేషణ. కళ్ళంట నీళ్ళుకమ్మి, చుక్కలుగా బుగ్గలమీదికి జారడం అతనికి తెలుసు, అదొక బాధ. అందులో వింత, ఆనందం వుంది. కన్నీటిని ఆపే యత్నం చెయ్యలేదు. తనొక మనిషి— ఆ కన్నీరొక మనిషివి. కాని గమనించే లోకానికి ఒకే మనిషి, ఇద్దరు లేరు. అక్కడ గమనించే వారెవ్వరూ లేరు. రెండు రోజుల్లో పూర్ణిమ. పెద్ద చందమామ చల్లగా కదుల్తోంది. మేఘాల నడుమ. చందమామలో ప్రాణులు లేరట! నిర్జీవమైన గోళంట. అయినా చిత్రం, భూమిచుట్టూ తిరుగుతూ వుంటుంది! సముద్రంలో కెరటాలని రేపుతుంది. సుదర్శనం లేచి, బట్టలు సర్దుకుని, బయలుదేరాడు.

చింతచెట్టు దాటగానే ఆమె ఎదురైంది. అకుపచ్చ చీర, అదేదో రంగుది గళ్ళరవిక—వొగరుస్తూ, తమాయించి తేరుకుంది.

"మీకోసరమే వస్తుండా—తెస్తిరా ?"

"ఏమిటి ?"

"అందేనండీ—మందు"

"ఓ అదా—ఆస్పత్రికి రా, పరీక్ష చేయిస్తా. అసలు అదో కాదో - తేల్చుకోవాలి ముందు."

"ఇంకా నయం—పరాయోడికి తెలిస్తే అమ్మ సంపదూ" అని ఎబ్బెట్టుగా తన గుండెమీద చెయ్యి మోపింది.

"ఎందుకంత భయం. అసలేం జరిగింది ? పెండ్లి చేసుకో రాదూ ?"

"రండి ఇట్ట కూకోండి సెప్తా, ఆయనకి పెండ్లా మందిగా"

"ఓ, అల్లాగా."

చెట్టుకింద గడ్డిలో కూర్చుని మోకాళ్ళమీద గడ్డం ఆనించి, చేతులు పాదాలచుట్టూ బిగించి మాట్లాడుతోంది.

"పిల్లలు కూడా"

అతనేమీ మాట్లాడలేదు.

"ఏం అట్ట దిగులుగుంటారేం ? పోసీ లెగండి. మరిటొచ్చి మందుకు తొందరసెయ్యాను లెండి— బావిలో పడి సావనంటండీ."

"అదే కూడదు. చాలా తప్పు, మనం ఏం చేసినా బ్రతికుండగానే, అది చెయ్యనని చేతులో చెయ్యివెయ్యాలి" అని చెయ్యి చాచాడు. కళ్ళు తుడుచుకుంటోంది కాబోలు. చీర కొంగు మొహం అంతటా కప్పింది.

"మట్టి చెయ్యి, దేనికిలెండి. అమ్మ సంపుద్దనే భయం—మరే బెంగ లేదు. ఇంక సావనులెండి....ఏం ?"

"అల్లా వుండాలి, ఎవరాయన ?"

"నా కింకా తెలిసింది కాదు. బుబ్బతో పెళ్ళాం మేడపై గదిలో మంచం దిగదు. ఈస పట్టుగున్నాడు. రోజూను డబ్బులిస్తాడు. తొందర

పేత్తాడు. సిత్రంగా ఉంటాను గమ్మత్తు సెప్పోదా ? మతిమరుపంట, మరిసి పోకుండా ఉంటాని కని రూపాయలు, నోట్లు అగ్గిపెట్టెలో దాసుకుంటాడు. అగ్గిపెట్టెలో పుల్లలు అయిపోగానే, పెట్టెని పారేస్తే, దాసిన నోటు ఇసయం మరిసినట్టేనంట. సావిడిగదిలో రెండుమార్లు దొరికినై ఖాళీ అగ్గి పెట్టెలు. అటిల్లో రూపాయల నోట్లునైన్ని. చేతికిచ్చా. నవ్వి "నువ్వు తీసు కోవే నోట్లు" అన్నాడు. ఓ దఫా పదిరూపాయల నోటు దొరికింది. గోడవతల ఊడ్చినకాడ, పడేసిన అగ్గిపెట్టెలో మరోమాలి, ఐదు రూపా యలు—అదేటో మతిలేని తతంగం. ఎంత కాలం—ఏటిసెయ్యను. ఓపాలి ఇట్టసేస్తే అమ్మగారితో సెప్తానన్నాను. గడ్డంబట్టి బ్రతిమలాడాడు, డబ్బిచ్చాడు, మరో పాలి సంపుకానని పైన బడ్డాడు. అదిరిపోయినా పన్లో కెడతం మానుకున్నా, అమ్మ కసిరింది. మరో లోగిలి నూసుకు సావ మంది—సద్దామని ఊడకొస్తే, మీరుంటిరి. ఆ నిచ్చనోటి తెచ్చి, పొద్దో తోంది అమ్మోస్తుంది. సాయంతలం పన్లోకెడుతుండగా—అప్పుడే ఇటు రావడం. రంగమ్మ సూత్తానంది లెండి మందు ఇసయం, మరెల్తా" అని లేచింది.

"అమ్మో, అటెవరో వొస్తుంటారల్లె వుంది సెట్టువెనక కూకుంటా" అని వెళ్ళి కూర్చుంది.

"నీకు చాలా భయముందే—లే, లే—వాళ్ళు అటుపోతున్నారులే, పొలంకేసి"

"మీకు తెల్దులెండి. మీకూ నాకూ ఏదో వుందని వూళ్ళో సెప్పు కుంటున్నారుట. రంగమ్మ సెప్పిందిలెండి" అని లేచి చెట్టుదాటి. కంప తప్పించుగుని, పెద్ద పెద్ద అంగలువేస్తూ నడుస్తోంది ఆమె.

"మొదటి రెండుసార్లు నువ్వు వెళ్ళిపోవడం చూసి దయ్యమను కున్నాను తెలుసా ?" అన్నాడు.

"అమ్మో, దయ్యాలంటె భయం. పోనీ, ఎక్కడన్నా పన్లో కుదర్చ గలరా ?"

"ఎల్లుండి రా — ఆ విషయం చెప్తా"

"పన్లో కుదురుస్తారా ?"

"అదికాదు — మందు విషయం" అన్నాడు.

"ఓ...."

వెళ్ళింది సుదర్శనం బైటకి వెళ్ళాడు పొలం కేసి. దానివతల పంటకాలవ, అక్కడ పదినిమిషాలు కూర్చుని, ఇంటివైపు నడిచాడు. తన విషయం తనకే ఆశ్చర్యం వేసింది. ఆమె పేరూ - తెలుసుకోలేదు. ఆ మరో వ్యక్తి పేరు తెలుసుకోలేదు. రంగమ్మెవరు ? తెలియదు నిజమే, అందుకే నిశ్చింతగా వుంది. ఏదో బరువు తొలగినట్లయింది. సగం భారం ఆ రంగమ్మది. హాయిగా నిద్ర పట్టేసింది.

*　　　　*　　　　*

ఎల్లుండి కూడా వొచ్చింది. పైవూర్లో డాక్టర్ గుర్నాథంకి మరి కొన్ని వివరాలువ్రాసి, వీలైతే ఓ పూట రావల్సిందిగా కోరాడు సుదర్శనం. తను పనిచేసే డాక్టర్ మధ్యాహ్నమే మరో వూరు వేరే పనిమీద వెళ్ళడం వల్ల, నాలుగింటికే డిస్పెన్సరీ మూసేసి తన గదికొచ్చి, టీ కలుపుకొని, ఖద్దరు పైజామా, చొక్కా వేసుకుని, ముస్తాబై, పైన కోటువేసుకుని బైలుదేరబోతుండగా, గుమ్మంలో మోటారు సైకిల్ ఆగిన చప్పుడైంది. లోపలి కొచ్చిన వ్యక్తి స్నేహితుడు భూషణం. ఎగ దువ్విన క్రాఫ్, పాంట్, బుష్షర్ట్ బుజాన ఒక బాగ్, లావుగా, పొడుగ్గా ఉంటాడు. భూషణం, సుదర్శనం ఒకే పాఠశాలలో రెండేళ్ళు కలిసి చదువుకున్నారు. భూషణం తండ్రి బాగా ఆస్తిగలవాడు. కాలేజి చదువు చాలా కాలానికి పూర్తిచేశాడు. తెలివైన వాడని చెప్పుకునేవారు. కాని కాలేజీ కెళ్ళాక, పెద్ద పరీక్ష ఫేలవుతూ వచ్చాడు. నాటకాలంటే సర్దా. పాఠ్య పుస్తకాలు చదవక, నవలు — ముఖ్యంగా డిటెక్టివ్ నవల్సు చదువుతూ, పరీక్షపట్ల శ్రద్ధ కనబరిచేవాడు కాదు. పొడుగాటి మనిషుండనూ పోలీసు శాఖలో

చేరాలన్న అభిప్రాయంవల్ల కాదోలు. తండ్రి పలుకుబడివల్ల, సబిన్స్పెక్టర్ ఉద్యోగం సంపాదించాడు. అక్కడికి నాలుగు మైళ్ళలో వున్న ఊరికి బదిలీ అయ్యాడు. ఈ మధ్యనే చార్జీ పుచ్చుకున్నాడు. సుదర్శనం ఇక్కడున్నట్లు విని చూసి పోదామని వొచ్చాడు.

"నాకు తెలుసోయ్ నువ్వు ఉత్తరాలు వ్రాసే ఘటం కావని, లేడీ బర్డ్. రంగమ్మ నెరుగుదువుగా.... ?"

సుదర్శనం ఆలోచిస్తాడు.

"ఏ రంగమ్మ ?"

"సర్లే, నాకు తెలుసు మరిచిపోతావని. పోలీసుతనానికి మతిమరపు కూడా జోడైందన్నమాట ! రంగనాథాన్నెరగవూ ? లెక్కల్లో ఫస్టు — ఆడపిల్లలై కులికేవాడు — రంగమ్మని ముద్దు పేరు, అతను వ్రాశాడు నువ్వు ఈ కోన్లో వున్నావని ఆదర్శమూర్తిని అన్వేషిస్తూ, తన్నుకు మందులిచ్చి, దేశం జనాభా తగ్గిస్తున్నావని ..." అని విరగబడి నవ్వడం సాగించాడు భూషణం.

స్కూల్లో గడిపిన దినాలు, అప్పటి స్నేహితులు, విడిపోయ్యాక ఎవరెవరు ఏమైంది చెప్పుకుంటూ, మధ్య మధ్య టీ త్రాగుతూ, గంట గడిపారు. ఐదున్నరైంది.

"కృష్ణమూర్తికి పెండ్లయింది తెలుసా ?" అన్నాడు భూషణం.

"కృష్ణమూర్తంటే.... ?"

"నాకు తెల్సునోయ్....నీ కెవ్వరూ గుర్తు రారు. మన్వాక దంతపు బురుజు నివాసివని — కృష్ణమూర్తి రాధికా స్వాంతుడోయ్ — అస్తమానూ తులాభారం నాటకంలో పద్యాలు చదివే వాడే....వాడు; ఏం చేశాడు — ఓ పిల్లతో స్నేహం చేశాడు — పెండ్లయిన ఏడు మాసాలకే భార్య పిల్లాడిని కందిట రెండు రెండు కలుపు — సర్లే నీకు లెక్కల్లో సున్నాయేగా ఎప్పుడూ — అంటే పిల్లకి ముందే హసమయ్యి నిర్ధారణమంగానే, పెండ్లి

చేసుకోక తప్పింది కాదు....” అని నవ్వుతున్నాడు భూషణం సుదర్శనం మనస్సు ఎల్లాగో అయింది. తబ్బిబ్బై తమాయించుకున్నాడు.

అరవాస్తోంది.

“చూడు, వో పదినిమిషాలు అల్లా ఊళ్ళోకెళ్ళి ఓ పేషంటుని చూసి రావాలి నువ్వు ఈ పత్రిక చూస్తూ కూర్చో” అన్నాడు సుదర్శనం.

“ఈ ఊరి జనాభాలో మరొక మనిషి తగ్గిపోతాడులే! పేషంట్ ఆడా, మగా....?”

“సర్లెద్దూ నీ జోక్సూ కేం నీకు పెండ్లయిందా ?”

“ఓ, మా ఫాదర్ ప్రెషర్. పెద్ద కట్నం పట్టుపట్టుమని చేసేశారు. ఏడాది పిల్లాడు ”

“ఫామిలీ వొచ్చారా ?”

“వెళ్ళి తీసుకురావాలి....”

“ఇప్పుడే వొస్తా — ఇద్దరికి కారియర్ ఏర్పాటు చేసొస్తాను.”

“ఒద్దు బ్రదర్. వెనకాల కూర్చో హాయిగా వెన్నెట్లో మా వూరు పోదాం. అక్కడ ఫస్టు క్లాస్ భోజనం వొండి పడేస్తారు....”

“సర్లే—ఇప్పుడే వొస్తా.”

“పద, నేనూ వొస్తాను—మోటర్ సైకిల్‌మీద పోదాం” అని లేచాడు భూషణం.

“ఒద్దు, ఒద్దు, నా మందుకి నీ సైకిల్ చప్పుడు జోడైందంటే, పేషంట్ హరీ మంటాడు....నే వెళ్ళొస్తాలే....”

“సో —నువ్వూ వేస్తావన్న మాట జోక్సు. తీసుకు రాలేదనుకో— హాట్స్ ఆఫ్ సరే పో.”

సుదర్శనం తొందరగా వెళ్ళాడు. అరున్నరైంది, చీకటి పడుతోంది చింతచెట్టు కింద చేరుకునేటప్పటికి. అటు ఇటు చూశాడు. ఎవ్వరూ లేరు ముంగిస వరుగెత్తింది. పక్షులు కొమ్మల మధ్య కొట్లాడుకుంటు

న్నాయి. కీటకాలు రోదిస్తున్నాయి. సర్వీచెట్టుకింద కాసేపు పడుకుని ఆకాశంలోకి చూస్తున్నాడు. ఎవరో అటు నడుస్తున్న చప్పుడైతే, లేచి చూశాడు. ఎవరూ కనపడలేదు. పదినిమిషాలైంది. పావుగంటైంది. చీకటి దట్టమవుతోంది. నూతి దగ్గరకొచ్చాడు. కోటు తీసేసి పక్కన పెట్టాడు. చొక్కా చేతులు మడిచి, నూతి వర దిగువనున్న మొక్కల్ని చూస్తూ, అందిన వాటిని ఒక్కొక్కటే పైకి లాగుతున్నాడు.

వొంగి లేవడంవల్ల కలిగిన ఆయాసం నుండి కోలుకునేందుకు, మొహాన్ని మోకాళ్ళ మధ్యపెట్టి కాసేపయ్యాక: మళ్ళా లోపలికి వొంగి మొక్కల్ని వెదుకుతున్నాడు. ఏదో పెద్ద చప్పుడైంది. మరో క్షణంలో ఎవరో తోపు త్రోసినట్లయినది. ఆ, ఆ, అని పెద్దగా కేకేసి నూతిలో పడి పోయాడు.

పడేటప్పుడు కొమ్మ తగిలి వెన్నుమీద గాయమైంది. మొకాళ్ళ గుచ్చుకుని వొళ్ళంతా మంటలు, నీళ్ళలో లేచి నిలబడ్డాడు.

"ఇదుగో, నిన్నే, నిన్నే," అని పెద్దగా అరుస్తున్నాడు. భయంతో వొణికిపోతున్న కంఠం, నూతి గోడల నడుమ ప్రతిధ్వనించి; భయంకరంగా వినబడుతోంది. దెబ్బల్ని, గాయాల్ని చూసుకుంటున్నాడు. నెప్పివల్ల, అబ్బ అనుకుంటున్నాడు.

"ఎవరక్కడ — నిన్నే — ఇదుగో నేనే — ఇక్కడ. లోపల, ఇదుగో యీ నూతిలో. ఎవరది? ఏమర్రో" అని మళ్ళా కేక వేస్తున్నాడు. ఆమె తల నూతి గట్టున కనబడింది. "అమ్మో, సచ్చిపొయ్యారు. అమ్మో" అని కేక వేస్తోంది.

"చావలేదు— బాగానే వున్నాను. ఆ నిచ్చెన తీసుకురా గొడ్లపాక లోది" అని బిగ్గరగా అరిచాడు సుదర్శనం. కాసేపయ్యాక ఆమె తల మళ్ళా కనబడింది. నిచ్చెన లోపలికి దింపుతోంది. కిందికి అనడం లేదు.

"ఒదిలెయ్యి" అన్నాడు. ఒదిలేసింది. పైజామా పైకి మడిచేసి

నిచ్చెన మీదికెక్కుతూ పైకొస్తున్నాడు. పై మెట్టుకి చేరాడు. నూతి అంచు ఇంకా దూరంగా వుంది. చేతికి అందడంలేదు. ఆమె చేతులు లోపలికి అందిస్తూ ముందుకు వొంగింది. అతని చేతులు పట్టుకులాగుతోంది. కాసేపు పెనుగులాడాక, పైకి చేరుకున్నాడు. నేలమీద పడిపోయ్యాడు. అతని తలని తొడమీదికి లాగింది. చొక్కాని పైకి లాగేసింది. నీళ్ళని పిండుతోంది. చీర కొంగుతో తడిని తుడుస్తోంది.

"నీళ్ళు మింగలేదుగందా ? అమ్మో ? ఇయ్యన్నీ దెబ్బలే రక్తం. ఉండండి బండిని కేకేస్తా. అస్పత్రి కెడుదురుగాని. లాంతరు తెస్తా. నూతులో పడ్డారేంది ?

"నీ మాదిరే చచ్చిపోదామని"

"మీకేం వచ్చిందండీ ?"

అతనేమీ మాట్లాడలేదు. మళ్ళా మొదలెట్టింది.

"నాకు అట్టాంటి పనులొద్దని మీరు సేసిన పనేంది ? ఇంక సెయ్య నని వొట్టెయ్యండి సేతులో" అని ఆమె చేతిని ముందుకు చూపింది.

"వొద్దులే—ఇవి రక్తం తడిసిన చేతులు, నిజంగా చావాలని దూకానను కున్నావా—లోపలికి చూస్తుంటె కళ్ళు తిరిగి పడ్డానంతే" అతని తలని మెల్లగా దించి బైటకెళ్ళింది. పది నిముషాలు ఆకాశంలోకి చూస్తూ పడు న్నాడు సుదర్శనం. కాసేపటికి ఎద్దుబండి, లాంతరు ఆమె, మరో ఇద్దరు ఆసాములు వచ్చారు. లాంతరు పెద్దదిచేసి వింతగా చూశాడు. ఏమైందని గుసగుసలు సాగించారు. ఆమె ఏదో చెప్తోంది—"కాలు జారి పడ్డాడంట" ఆ ఇద్దరు ఆసాములూ, బండివాడూ సుదర్శనాన్ని లేవదీసి, చేతులు మీద మోసుకెళ్ళి బండిలో చాపమీద పరుండబెట్టారు. ఆమె బండి వెనకాలే నడుస్తూ వాళ్ళింటి సందులోకి రాగానే దిగడిపోయింది. పావు గంటలో బండి సుదర్శనం గది దగ్గరకొచ్చింది. భూషణం నివ్వెర పోయ్యాడు. అతనూ వొక చెయ్యేసి సుదర్శనాన్ని లోపలికి తెచ్చి

మంచంపైన పరుండబెట్టారు. బండి వాడికి డబ్బులిచ్చి పంపించివేసి, ఆస్పత్రి తాళాలు తీసుకుని నౌకరు సుబ్బయ్యని రమ్మని గాయాలకి మందులు, బాండేజిలూ తెచ్చి, ప్రథమ చికిత్స కానిచ్చాడు భూషణం. వెన్ను మీద మూడంగుళాల పొడుగు గాయం, మోకాలుమీద కొంచెం చిన్నగాయం. చేతులుమీద గీసుకుపోయిన మచ్చలు — అరగంట కళ్ళు మూసుకుని లేచి మాట్లాడడం సాగించాడు సుదర్శనం. రాత్రి తొమ్మిదైంది. ఆస్పత్రి నౌకరు సుబ్బయ్యని కారియర్ భోజనం పట్టుకురమ్మని పంపాడు. జరిగిన ఉదంతం అంతా విపులంగా చెప్పాడు భూషణంతో.

"ఏదో పెద్ద చప్పుడైంది — ఎవరో తోసేసినట్టు పడ్డానంటు న్నావ్. అంటే ఏమిటి అడిగాడు భూషణం.

"అప్పుడల్లా గనిపించింది. మళ్ళా ఇప్పుడు జ్ఞాపకం చేసుకుంటే, కళ్ళు తిరిగి పట్టుజారి ప్రమాదవశాత్తు పడిపోయ్యానా, అనిపిస్తుంది" ఎవరో వొచ్చిన సందడైంది. ఆమె లోపలికొచ్చి తలుపు పక్కనే నిలబడింది.

"ఎవరది?" అన్నాడు భూషణం.

"అరికెట్లాగుందండి ఇదుగోనండి అరి కోటు. బావికాడ పడుంది. ఎల్లితీసుగొచ్చా." అని సుదర్శనం కోటుని భూషణానికి అందజేసింది.

"చీకట్లో దానికోసం వెళ్ళావా వొక్క దానివీ? నాకు బాగానే వుందిలే. ఇంటికెళ్ళు మీ అమ్మ కేకలేస్తుందేమొ"

"మరి రేపొస్తాలెండి"

ఆమె వెళ్ళింది.

"ఎవరోయ్ ఈ పిట్ట?"

సుదర్శనం నవ్వుతున్నాడు.

"నేను చెప్పానే కథ — అందులో ఆమె — ఇంతవరకూ పేరడగ లేదు."

"తెల్పకయె తెల్పుదున్నది — కంట్రిబ్యూటెప్ అనుకో. నాట్ బాడ్ నాపెటాల్ బాడ్" అని ఆమె తెచ్చిన సుదర్శనం కోటుజేబులు వెలికి, ఒక జేబులోంచి ఒక కాగితాన్ని తీసి, మడత విప్పి చూశాడు. అదొక ఉత్తరం, అందులో తను ఆత్మహత్య తలపెట్టినట్లు, అతని చావుకి ఎవరూ బాధ్యులు కానట్లు రెండే వాక్యాలున్నాయి సుదర్శనం సంతకంతో. లోపల చదువు తుంటూ వుండగా, ఆ ఉత్తరాన్ని లాక్కుని చూశాడు సుదర్శనం.

"ఇదెల్లా వొచ్చింది? నేను వ్రాసింది కాదే!" అన్నాడు ఆశ్చ ర్యంగా.

"నువ్వు వ్రాసింది కాదా?"

"ఎబ్బె, ఇదెవరి పనో. ఆత్మహత్య చేసుకుందామని ఎప్పుడూ అనుకోలేదు" అన్నాడు సుదర్శనం.

"మాంచి ఖూనీకేస్ మధ్యలో వొచ్చి పడ్డాను. నా థీరీ విను. నువ్వు బావిలో తొంగి చూస్తుండగా, వొక వ్యక్తి—నిన్ను చంపడానికి సంక ల్పించిన వ్యక్తి — నిన్ను లోపలికి తోసేశాడు. ముందుగా తనే వ్రాసి సిద్ధంగా తెచ్చిన ఈ జాబుని నీ కోటు జేబులో పెట్టాడు. సాయంత్రం రోజూ ఆ బావికే వెడుతూండడం గమనిస్తూన్న వ్యక్తి. నేరం జరిగిన చోటు Scene of the crime — శోధించాలి — మరికొన్ని క్లూస్ దొరుకుతాయి, ఇప్పుడెళ్ళి చూసిరానా?"

"ఇంత చీకట్లోనా, ప్రొద్దున్నే వెడుదువుగానిలే" అన్నాడు సుదర్శనం. బాండేజ్‌ని సరిచేసుకుంటూ.

ఆ ఉత్తరం ఇల్లాగియ్యి. ఈ దస్తూరిద్వారా, దీన్ని వ్రాసిన వ్యక్తినీ పట్టొచ్చు. దీనిమీద వ్రాసినాయన వేలుముద్రలుంటాయి. పట్నంలో నా ఫ్రెండొకడున్నాడు — ఫింగర్ ప్రింట్స్ శాఖలో. అతనికి పంపించి వేలు ముద్రల ఫోటోగ్రాఫ్ తెప్పిస్తాను" అని చీటిని భద్రంగా మడచి కవర్లో నుంచి తన బాగ్‌లో దాచాడు భూషణం. రాత్రి గడిచిపోయింది.

తెల్లవారిం తర్వాత టిఫిన్ కాఫీలు అయ్యాక ఆస్పత్రి నౌకరు సుబ్బయ్యని తీసుగుని బావిదగ్గర కెళ్ళాడు భూషణం. స్థలాన్ని శ్రద్ధగా పరిశీలించాడు. రాత్రి సుదర్శనం పడున్నచోటు బెడ్డలమధ్య రక్తం మరక లున్నాయి. చింత చెట్టు వెనక దట్టంగా అలుముకుని గోడలా పాకిన కంపలో మధ్య ఒకచోట కంత వుండడం గమనించాడు. మనిషి దూరేం దుకు వీలుగా ఎవరో చేసిన కంత. అందులోంచి దూరి చూశాడు భూషణం. కంతకీ, చింత చెట్టుకీ నడుమ వొక ఇనపకడ్డీ—రెండుగా మెలి కలు తిరిగినదీ—పడి వుంది. మోటార్ స్టార్టర్ ఆకారంలో పాత ఇనప కడ్డీ. బావిచుట్టూ పరిశీలించాడు. అతనికింకేమీ ఆనూకీలు దొరకలేదు. నూతిలోపలికి వొంగి చూశాడు. దిగువ పాచినీళ్ళలో తాబేలు పిల్ల వుంది. ఇరుపై పులా, కొమ్మలు, ఆకులు, తీగెలు నూగు ముసిరి ఉన్నాయి. రెండు కొమ్మల్ని పెనవేసుకున్న ఎంకుతీగెలో చిక్కుకుని వొక అగ్గిపెట్టె కను పిస్తోంది. పూచిక పుల్లలతో పంగల కర్రలాచేసి, అగ్గిపెట్టెను పైకి లాగాడు. మోగించాడు. చప్పుడు లేదు. ఖాళీది. దాన్ని వొక కవరులో వుంచి, ఇనుపకడ్డీ చివరలో పట్టుకుని, సుబ్బయ్య తెచ్చిన బండిలో ఇంటి కెళ్ళాడు.

"ఇవిగో క్లూస్. ఇదీ—ఈ కడ్డీ.

మర్డర్ వెపన్. ఇప్పుడు విను. ఆ వ్యక్తి కంపలో కంత చేసుకుని నువ్వు బావి దగ్గర కెళ్ళగానే కంతలోంచి బైటకొచ్చి చింతచెట్టు వెనక దాక్కున్నాడు—చేతులో ఇనుపకడ్డీ పట్టుకుని దాన్ని వాడే అవసరం లేక పోయింది. నువ్వు వొంగి బావిలోకి చూస్తున్నావు. కడ్డీని అలా పడేసి, నిన్ను వొక్కతోపు తోశాడు. వెనకనుండి నువ్వు పడగానే తెచ్చిన ఉత్తరం నీ కోటుజేబులో పెట్టి ఉడాయించాడు మళ్ళా కంతగుండానే. అతను వెళ్ళగానే—ఆమె వొచ్చింది-వనకన్య. కాని ఒక్కటే సందేహం; బావి దగ్గర వుండవలసిన ఇనపకడ్డీ, కాస్తంత దూరంగా వున్న చింత

చెట్టు వెనక ఎందుకు పడివుందా అన్న సందేహం. కంతలోంచి దూరి వెడుతూ అది చేతులో వుండగా ఎవరన్నా చూస్తే ప్రమాదమని భయపడి అక్కడ పడేసి పోయాడా ? రిమెంబర్—అతను వెళ్ళగానే ఆమె ఒచ్చింది. ఆమె రావడం గమనించే వుంటాడు హంతకుడు" అని కను బొమ్మలు ఎగరేస్తూ, చేతులు తిప్పలు తిప్పుతూ, కంతలోంచి దూరిన విధంచేసి చూపుతూ తన సిద్ధాంతాన్ని యాకరువు పెట్టాడు ఇనస్పెక్టర్ భూషణం.

"ఉస్ మెల్లగా. ఇప్పుడు ఎవ్వరూ హత్య కాబడలేదుగా. కాబట్టి హంతకుడనటానికి వీల్లేదు. డిటెక్టివ్ నవల్స్ చదివి, ఊహాగానాలు చేస్తు న్నావు" అన్నాడు సుదర్శనం.

నాకు తెలుసు; ఋజువు దొరికేవరకూ నువ్వు నమ్మవని. ఈ కర్ర మీద హంతకుడి వేలుముద్ర ఉంటుంది. దీన్ని ఉత్తరం మీద వున్న వేలు ముద్రనీ పోల్చి చూస్తే, అవి ఒకటవుతే, నా థీరీ నిజమైనట్లు. సరేనా; రేపే పట్నం పంపుతా వీటిని. ఎటొచ్చీ. ఏ కారణంవల్ల హత్యకి తెగిం చాడో తెలీడంలేదు What is motive ? ఓవేళ ఆ వనకన్యే హత్యకి పూనుకుందా ? అవుతే ఎందుకు ? తర్వాత చెప్తాను.

తనతో వాళ్ళ వూరు రమ్మన్నాడు సుదర్శనాన్ని. డాక్టరుగారు ఊళ్ళోకొచ్చాక, వొస్తాలే అన్నాడు సుదర్శనం. భూషణం మోటారు సైకిల్‌మీద తన వూరు వెళ్ళిపొయ్యాడు.

* * *

డాక్టర్‌గారొచ్చాక, తమ్ముళ్ళని స్కూళ్ళల్లో చేర్పించేటందుకు, ఇంటికి వెళ్లాలని, రెండు మూడు వారాలు శెలవడిగి వాళ్ళ వూరు వెళ్ళాడు సుదర్శనం. అక్కడ వున్న రోజులో బావి వెంపు వెళ్ళలేదు. ఆమెను చూడనూలేదు. ఇంటి దగ్గర పన్లు పూర్తిచేసుకుని తిరిగి పనిలోకి చేరగానే తనకి స్కాలర్‌షిప్ వొచ్చిన వార్తొచ్చింది. ప్రెసిడెంట్ భద్రయ్యగారి

ప్రయత్నంపైన. పై చదువు కెడుతున్నానని డాక్టర్ దగ్గర శలవుతీసుగుని మళ్ళా యింటికి ప్రయాణం అయ్యాడు సుదర్శనం. వెడుతూ భూషణాన్ని చూద్దామనుకుని ఆ ఊళ్ళో దిగాడు. కాని భూషణం పట్నం వెళ్ళా డన్నారు.

సుదర్శనం కాలేజీలో చేరిన మూడు నెల్లకి భూషణం దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. తన సిద్ధాంతాన్ని విపులీకరిస్తూ వ్రాసిన భాగాలు కొన్ని: హంతకుణ్ణి "ఎక్స్" అందాం. నువ్వు రోజూ బావిదగ్గర కెళ్ళడం. ఆమెతో మాట్లాడడం గమనించాడు. ఎక్కడిదో పాత కార్ స్టార్టర్ కడ్డీ తెచ్చి, కంతచేసుగుని, దూరి చింతచెట్టు వెనక్కి వొచ్చాడు. నువ్వు అటూ యిటూ పచార్లు చేస్తున్నప్పుడు చెట్టు మొదల్లో కొమ్మమీద కెక్కాడు. నువ్వు బావిలోకి తొంగి చూసే క్షణం రాగానే, ఇనపకడ్డీని చెట్టుకొమ్మ మొగలో కొమ్మమీద ఉంచేసి, గబ గబ బావిదగ్గర కొచ్చాడు. చెట్టుకొమ్మ మీద నిలబెట్టిన కడ్డీ. సరిగ్గా ఆనక కాబోలు, కింద రాళ్ళమీద పడింది. నువ్వు విన్న చప్పుడు అది. అతను నిన్ను తోసేసి, తెచ్చిన ఉత్తరం నీ కోటుజేబులో పడేసి చింతచెట్టు దగ్గరకొచ్చాడు. కొమ్మమీద వుంచిన కడ్డీ కనబడలేదు. ఇంతలో ఆమె రావడం చూశాడు. కడ్డీని వెదికే వ్యవధి లేదు. కంప కంతలోంచి దూరి వొచ్చేశాడు. కడ్డీమీద వేలుముద్ర స్పష్టంగా రాలేదు. ఫోటోలో, ఆ రోజున హడావిడిలో చెప్పడం మరిచాను. బావి దిగువలో కొమ్మల నడుమ ఇరుక్కున్న అగ్గిపెట్టెని పైకి తీశాను. మోగించి చూస్తే చప్పుడవలేదు. ఖాళీదనుకున్నాను; ఇంటికొచ్చాక తీసి చూశాను. అందులో రెండు పుల్లలున్నాయి. మూలగా అట్టకింద పడి అవి చప్పుడు కాలేదు.

అగ్గిపెట్టెలో రెండు రూపాయల నోట్లున్నాయి. అప్పుడు తెలుసుకున్నాను. "ఎక్స్" ఎవరో. నువ్వు గ్రహించే ఉంటావు అతనెవరో.

జ్ఞాపకం వుందా కామందు కిష్టయ్యగారి మతిమరపు కథ—వనకన్య చెప్పిందిగా—జ్ఞాపకం చేసుకోడానికి అగ్గిపెట్టెల్లో నోట్లు పెట్టే ఆలవాటుం దని చెప్పింది. నిన్ను బావిలోకి తోసినప్పుడు తనూ కొంత వొంగి వుంటాడు. ఆ వొంగినప్పుడు, అతని జేబులో అగ్గిపెట్టె బావిలోపడి, తీగల నడుమ చిక్కుకుంది. ఈ అలవాటే అతని కొంప తీసింది. అగ్గిపెట్టె మీద వేలుముద్ర ఉత్తరంపైన వేలుముద్రా ఒకటేనని ఫోటోలు నిర్ధారణ చేశాయి. కిష్టయ్య మా ఊరొచ్చినప్పుడు కరణంగారింట్లో కలిశాను. కబుర్లలో పెట్టి వారి అడ్రస్ వ్రాసి ఇమ్మని నా కలం ఆయన చేతికిచ్చి వ్రాయమన్నాను. ఆ కలం పైన వేలుముద్ర ఈ వేలుముద్ర వొకరిదే దస్తూరి కూడా కొంత ఆయనదేనని తేలిపోయింది. ఇదంతా నేను పట్నం వెళ్ళాక శోధించి, నిర్ధారణ చేసుకున్నాను.

హత్యకు కారణంకూడా తెలుస్తూనే వుంది. వనకన్యకి మూడో మాసం తనింట్లో పని మానేసింది. బైట యాగీచేస్తుంది. నువ్వా ఆ అమ్మాయి ఊరవతల కలుసుకోడం గమనించాడు. ఉత్తరం వ్రాసి హత్య చేస్తే వనకన్య పట్ల నువ్వు చేసిన అపచారానికి తలవొంపు భరించలేక, నలుగురికీ తెలిసి అల్లరవుతుందని ఆత్మహత్య చేసుగున్నట్లు పుట్టిస్తే, తనకే భయమూ వుండదు; అందుకని ఆ ఉత్తరం. ప్రతి హంతకుడూ ఏదో ఒక్క పొరబాటన్నా చేసితీరతాడంటారు. ఆ వ్యక్తి శీలం ముద్ర, హత్యతంతుపైన పడి తీరుతుందిట. కిష్టయ్యకి మతి మరుపు జాస్తి. ఆ ఉత్తరంలో ఫలానా ఆమెని చెరచిన అపరాధానికి పరితపించి, తాను యీ ఆత్మహత్యకి వొడిగట్టినట్లు వ్రాయడం మరచిపొయ్యాడు.

వనకన్య ఇక్కడికి అగ్రికల్చరల్ ఫారమ్‌లో తోటపనికి కుదిరిందిట ఆ మధ్య చూశా. గర్భిణి చిహ్నాలేవీ కనబడలేదు. చెపొద్దూ.

కావల్సిన ఎవిడెన్స్ దొరికింది. "ఎక్స్"ని అరెస్టు చేయించాలి."

ఈ ఉత్తరానికి సమాధానంగా సుదర్శనం వ్రాసిన జాబులో కొన్ని భాగాలు.

"నువ్వు చెప్పినవన్నీ అక్షరాలా నిజం. ఇదంతా రంగమ్మ పనిట— నాకు తర్వాత తెలిసింది. వనకన్యని తప్పించి కిష్టయ్య గారింట్లో పనికి కుదరడానికి చేసిన పన్నాగంట ఆమెకి అంటే వనకన్యకి ఎందులో ఏం కలిసిందో, డోకులు. మూడోమాసం అనేసరికి నమ్మేసింది. నాకూ ఆమెకీ ఏదో వుందని కిష్టయ్యగారితో చెప్పింది. అప్పుడు తట్టింది ఆయనకి నన్ను చంపివేస్తే, ఆమె స్థితికి నేను కారకుణ్ణనుకుంటారు ఊళ్ళో జనం. రంగమ్మ వారింట్లో కుదిరింది. నీ పుణ్యమా అంటూ వనకన్యకి ఫారమ్‌లో పనీ దొరికింది. నేనిక్కడ క్షేమంగా వున్నాను. నీ శ్రమకి కృతజ్ఞుణ్ణి. మనం చర్య తీసుకోనక్కర్లేదు. కిష్టయ్యగారు చనిపోయినట్లు నిన్ననే జాబొచ్చింది—మా డాక్టర్‌గారు వ్రాశాడు. పత్రికలవాళ్ళ భాషలో హృద్రోగానికి గురై ఆకస్మికంగా మరణించారట. కవినికాను—ఒక్క కన్నీటి బిందువు కార్చనా! ఇంతకీ నువ్వూ వ్రాశావుకాదు. వనకన్య పేరేమిటో."

# ఇంటాయన X ఐదు

ఇంతకీ ఇది కథో: జీవితచరిత్రో, లేక వృత్త చిత్త వ్యాసమో తెలీక యిల్లా నామకరణం చేశాను. ఇంటాయననగానే, నేనో స్త్రీననీ ఆయన నాభర్తనీ మాత్రం నిర్ణయించకండి. స్వతంత్ర భారతంలో నేనొక మొగాణ్ణి. నాకొక భార్య కూడా వుంది. నేనో కొంపలో వుంటున్నాను. దాని ఆసామీ, "యజమాని"—"లాండ్ లార్డ్" ఇంటాయన.

నేనీ పాతికేళ్ళల్లో ఐదు కొంపల్లో వున్నాను. కాబట్టి, ఐదుగురు ఇంటాయన్లు గలవాణ్ణి— ఏదో, పిల్లలు గలవాణ్ణనట్లు! ఈమధ్య వో విషయం ఆరాతీశాను. ఈ ఐదుగురు యజమాన్లు, అన్నదమ్ములేనట, ఏం చెయ్యను ? "ఇంటాయన X ఐదు" అవక తప్పిందికాదు.

ఇంటాయన సన్నిధానంలో, సర్వస్వతంత్రాలకీ తిలోదకా లొదిలి, బైరాగులై కడుగండ్ల పాలవుతున్న దౌర్భాగ్యపు కాపరాలకున్న వాళ్ళతో ఏకీభవించి, సానుభూతి ప్రకటించి ఇంటాయన్లపై కత్తికట్టి, దెబ్బలా పత్రికలకి, వ్రాసి వాళ్ళని నిర్మూలన చెయ్యడానికి వొక విప్లవం, వొక రాజకీయోద్యమం లేవదీయ సంకల్పించిన ధీరోదాత్తుణ్ణనుకుంటే మీరు పొరబడుతున్నారు. X గుర్తు, ఇంటి యజమాని పీక కత్తిరించే 'కత్తిరి' నిగూఢ ట్రేడ్ మార్క్— ఉద్యమ 'చిహ్నం' అనుకోవద్దు. నా కల్లాంటి అనాగరీకమైన, ప్రాచీన కొండ మనుషుల భావాలు లేవు. నేను ఆధునికుణ్ని: అంటే స్వార్థపరుణ్ని. నా సమస్య వేరు.

ఐదుగురు ఇంటాయన్ల విషయం క్లుప్తంగా చెప్పివేస్తే నా స్వార్థపరత్వం ఎట్లాంటిదో మీకే తెలుస్తుంది. మొదటాయన పేరు పంచేంద్రియం. ఆయన్ని నేనెప్పుడూ చూళ్ళేదు. అసలాయన్ని చూసినవాళ్ళని కూడా నే చూళ్ళేదు. ఆయన ఏ దేశంలో వుంటాడోకూడా చాలా

మందికి తెలీదు. నిజంగా ఆయన బ్రతికే ఉన్నాడంటే కాస్త సందేహిస్తాను. మరి అద్దె ఎవరికివ్వను ?

"ఈ గృహం నాది; నేనే యింటాయన్ని, అద్దీ నాకియ్యి." అని ఆంధ్రదేశంలో ఒక్కడూ నాతో అన్లేదు. నాకు సిగ్గేసింది. అద్దె లేకుండా ఎట్లా వుండను ? "నీచుడా—సిగ్గులేదూ ? పో వెళ్ళు. దేవుడికోసం తీర్థయాత్రలు చేస్తావు; ముక్తికోసం ఆసనాలేస్తావు; మోక్షంకోసం జపం చేస్తావు. ఇంటాయన్ని కనుక్కోలేవు ? పో....ఖాళీచెయ్యి. అద్దె పుచ్చుకునే మహానుభావుణ్ణి వెదుక్కో—" అంది అంతరాత్మ తక్షణం ఖాళీ చేశాను, ఐదేళ్ళ తర్వాత.

రెండో ఆయన పేరు పంచప్రాణం. నేనంటే ఆయనికి పంచప్రాణాలూను. ఆయనది పెద్ద యిల్లు. అసలు యిళ్ళల్లో "పెద్ద"ంటూ లేవంటే నే చెప్పలేను. ఇంటి వైశాల్యం కుటుంబ విస్తీర్ణతనుబట్టి ఉంటుందని ఒక ఇటలీ వాస్తు శాస్త్రకారుడన్నాడు. సంతజనంగల కుటుంబానికి గవర్నర్‌గారి భవనం ఇరుకే. మేము లింగులింగుమంటూ యిద్దరం. అందులోనూ మా ఆవిడ మంచంబద్దీ అంత మనిషి. పెద్ద హాల్లో కుర్చీలో కూచుంటే కనబడదని మూలగదిలో వాలేసి కూకుంటుంది. ఆ యింటికి అన్ని హంగులూ ఉన్నవి.

ఆ యింటిలో మా ఆవిడెక్కడుంటుందో ఎవరేనా చెప్పగలిగితే సగంవాటా అద్దికిస్తారు. ఇంతకీ ఇంటాయనకీ నాకూ పేచీ, సగంవాటా అద్దెకివ్వడంలో వొచ్చింది. ఇల్లు అంతే అనుకోండి. దాన్ని నాలుగెట్టి గుణించండి. ఎందుకంటే అది నాలుగంతస్థుల మేడ. "ఇంతిల్లు నాకెందుకయ్యా, కింద వాటాలో మేముంటాం. మిగతాది ఎవరికేనా, మీ ఇష్టం వొచ్చినవాళ్ళకి — ఇన్సూరెన్సు ఏజంట్లకి తప్ప — యివ్వండి." అని ప్రాధేయపడ్డాను; బ్రతిమిలాడాను. మాపై అధికారిచేత వ్రాయించాను.

ప్రధానమంత్రి అంతరంగిక సెక్రటరీచేత చెప్పించాను. రెంట్ కంట్రోలర్‌తో ఫిర్యాదు చేశాను. టౌన్ ప్లానింగ్ కమిటీకి వ్రాశాను. ఎసెంబ్లీలో బిల్లు ప్రతిపాదించమని మెంబర్లని కోరాను. ఇన్ని చేసినా మా పంచ ప్రాణంగారు వినలేదు.

"నువ్వంటే నాకిష్టం. హాయిగా అనుభవించు. వాళ్ళకీ వీళ్ళకీ యివ్వడం నాకిష్టంలేదు. వాళ్ళకి యిళ్ళల్లో కాపరం ఎల్లా వుండాలో చేతి గాదు. నువ్వు గొప్ప కాపరం గాడివి."

అంటూ నవ్వేసి వెళ్ళిపోయాడు. ఏం చెయ్యను? మా ఆవిడ ఒక సలహా యిచ్చింది. "మూడు వాటాలు ముగ్గురికి అద్దెలకి మనమే యిచ్చి ఆ డబ్బు వసూలు చేసుకుని హాయిగా అనందిద్దాం. అదే మార్గం" అంది.

బుద్ధి గడ్డి తిని, ఆ సలహా అంగీకరించి, ముగ్గురి వాటాదార్ల కోసం దేశం గాలించడం సాగించాను. చిత్రం, వొక్కడూ రాలేదు. అద్దె లేకుండా వచ్చి కాపరం వుండాల్సిందోహో" అని టముకు వేయించాను. జనం రాలేదు. ఇదేదో కుట్ర అనుకున్నారుట.

"నువ్వు యింటి యజమానివా ?" అని అడిగారు జనం.

"కాను."

"మరి అద్దికిచ్చేందుకు నువ్వెవడవు ?"

కాబట్టి పంచప్రాణంగారే శరణ్యం. ఆఖరికి వొళ్ళుమండి, మిగతా యిల్లు మరొకళ్ళకి అద్దెకివ్వకపోతే, యిల్లు ఖాళీ చెయ్యాల్సి వస్తుందని బెదిరించాను, తక్షణం ఖాళీ చేశాను—ఐదేళ్ళకి.

నా మూడో ఇంటి యజమాని పేరు పంచమహాపాతకం. ఆయన చేసిన అపచారం యేమీలేదు. ఆయనింట్లోనే కాపురం వున్నాను. అది బాగా పాతిల్లు. హిందూదేశ చరిత్ర జాగ్రత్తగా, వొళ్ళు దగ్గర బెట్టుకుని చదివిన వాణ్ణి కాను; అంచేత ఆ యిల్లు యేకాలం నాటిదో నేను నిర్ణయించలేను. ఇక్ష్వాకుల నాటిదా? ఏమో! రాములవారు సీతాదేవి అరణ్యవాసం చేసిన

నాటిదనడానికి ఆధారం వుంది. ఆంజనేయులు లేక అతని అనుచరుల్లో, ఆ యింట్లోనో, లేక ఆ యిల్లు వున్న స్థలంలోనో, ఆ వాక్కాయ పుట్టినా మకాం చేసివుండాలి. ఎంచేత నంటారా?

మా యింటిమీద వో డజను కోతుల బృందము విడిది చేస్తాయి. దేశంలో ఉన్న కీటకజాలం మచ్చుకొకటి చొప్పున చూరును అంటిపెట్టు కొని వుంటుంది. సృష్టికి పూర్వం, జీవకణువులోంచి ప్రథమ ప్రాణి ఉద్భవించి, వివిధ రూపాలుగా పరిణామం చెంది, తుదకు మానవుడుగా అవడం వరకూ జరిగే ప్రాణుల జీవిత నాటకంలోని మధుర ఘట్టాలన్నీ మా వాక్కాయ వంటింట్లోనే తిలకించవచ్చు. ప్రకృతికి "కళా" ప్రాతిపదికన్నట్లే, ఆ ప్రాచీన, ప్రాకృతిక వైభవానికి మా ఆవిడ ప్రదర్శించిన శిల్పనైపుణి, కళా చమత్కృతి, నూత్న వైభవాన్నీ, ఒక కొత్త చైతన్య శృంగారాన్నీ ఆపాదించిందనడం సమంజసం. కుంపటికోసం ఉద్దేశింపబడ్డ బొగ్గులు అందులో తప్ప, ఇల్లంతా తాండవిస్తాయి. వృద్ధనారి తలలో నెరసిన శిరోజములవోలె, బూజులు ఇంద్రజాలాన్ని అల్లుతాయి. ఓహోహో! ఏం వైభవం! ఏ మూల చూసినా చినిగిన బట్టలే, ఏకింద చూసినా దుమ్ము, దుబ్బు, దూగరా; ఏపైన చూసినా, ప్రచండ అగ్నిజ్వాలా నీడలే! ఏమని వర్ణింతురా, ఎట్లు వర్ణింతురా, నా త్యాగరాజా!

పంచమహాపాతకంగారితో ఒకటే చిక్కు. ఆయన చాలా మంచి వాడు. చెడ్డవాళ్ళని గురించి అడ్డమైనవాడూ లెక్చర్లు దంచుతాడు గాని, మంచివాళ్ళవల్ల దేశానికి, మానవాభ్యుదయానికి జరిగే హానిని గురించి, సంక్రమించే అరిష్టాన్ని గురించీ, ఒక్క వాజమ్మా నోరు పెగల్చదేం! మరి నావొళ్ళు మండుతోంది. లేకపోతే పంచమహాపాతకం అల్లా అనగలడూ! నాయినా, నీకు మరో కొత్త యిల్లు కట్టించి యిస్తాను. అంతవరకూ యీ ఇంట్లో ఎల్లానో రోజులు వెళ్ళబుచ్చు" అన్నాడు.

"ఇంతద్దె యిచ్చుగుంటూ అంతవరకూ ఈ ఇంట్లో వుండమంటావు టయ్యా" అన్నాను.

ఆయన వొక్క మహాపాతకం మాత్రం నవ్వినట్లు నవ్వాడు. "ఇట్లాంటిల్లు ఎల్లా కట్టించావు? ఎప్పుడు, ఎవరు కట్టించారు?" అంటూ ప్రశ్న పరంపర కురిపించాను. "ఈ ఇల్లు నాదికాదు. మరొకరి దగ్గర అద్దె కుచ్చుకున్నా మీకోసం. నేను కట్టించే యిల్లు నెల రోజుల్లో పూర్తవుతుంది. అంతవరకూ ఎల్లాగో గడపండి. ఈ ఇంటికి మీరు అద్దెకూడా యివ్వొద్దు నేనే యిచ్చుగుంటాను." అని వెళ్ళిపొయ్యాడు ఆయన. ఏం చెప్పమం టారు? ఈయన కథ ఇల్లా వుంది. నాకిదేదో పన్నాగంలా కనబడ సాగింది. ఇంత మంచివాళ్ళుండటం, నిజంగా దేశానికి నష్టం. మంచితనం పైన ఏదైనా పన్నుంటే బాగుండు ననిపించింది. నాకు పుట్టబొయ్యే అబ్బాయికి, వాళ్ళమ్మాయిని యిద్దామన్న యత్నం కాదు గదా కొంపతీసి! పోనిద్దురూ, తీసేటందుకు మనకి కొంపెక్కడేడిసింది అని మా ఆవిడ తన జన్మకల్లా ఒక్క ఛలోక్తి నామీద ప్రయోగించి బొగ్గుల నృత్యానికి బూజుల గజ్జకట్టి కాలని కట్టెల చుంమ్ చుంమ్ సంగీతంలో శృతి కలు పుతూ, గరిటె సంబరంలో నిమగ్నురాలైంది.

నా బుర్రలో — బూజు దులిపింతర్వాత సుమాండి — ఒక గొప్ప భావం ప్రవేశించి, స్థావర పడింది. వెంటనే ఆచరణలో పెట్టాను. అచ్చాఫీసుకెళ్ళి కొన్ని ఆహ్వాన పత్రాలు అచ్చొత్తించి తీసుకొచ్చాను.

"అయ్యా! అమ్మా, నేడు సాయంత్రం 4 గంటలకి పుట్కుట లగ్నమున నేనూ, నా సతీమణియు మా యింటి యజమాని మా కోసం కుదిర్చిన గృహంలో, గృహాలంకరణ మహోత్సవం జరుపుటకు పెద్దలు నిశ్చయించిరి గావున, ఏతత్శుభ ముహూర్తమునకు తాము యథా పరికర ములతో విచ్చేసి, ఉత్సవము జయప్రదముగా సల్పి, మదర్పిత బొగ్గు, బూజు, దుమ్ము, దుమ్మ, కీటక సంపదను గైకొని మమ్మానందింప జేయ కోరుచున్నాడ.

వరా "మీమీ తట్టీలు, చీపుళ్ళు, గంపలు, జల్లెడలు మీరే తెచ్చుకో వలెను."

ఆహ్వానాలు ఓ యాభై అడ్రసులు వ్రాసి సిద్ధం చేశాను. అది చూసి మా ఆవిడ ఆనందానికి మేరే లేదు. ఆకస్మిక ఛాయా చిత్రంలాగ చేతిలో గరిటవి మూల పడవైచినదై, సంభ్రమముతో అరుదెంచి ఇట్లు చెప్ప దొడంగె :

"ప్రభూ, నాచేత కాదగిన కార్యకలాపమంతయూ, పలువురు పుర ప్రముఖులకి పంచుట మీ ఔదార్యము చాటుచున్నది. రేపీపాటికి మన గృహ మెట్లుండునో వూహింప నోపునె!"

ఊహించడంలో నిమగ్నులమయ్యాము. అహహా! మా ఆహ్వా నాలు అందుకోగానే స్నేహితులు, బంధువులు ఒచ్చేసి ఇల్లంతా శుభ్రపరు స్తారు. ఎవరెవరికి ఏమేం పనులు పురమాయించాలో నిర్ణయం చేసు కున్నాను. నా మిత్రుడు శరభయ్య మాసిన బట్టలన్నింటినీ ఒక దరికి చేరేసి, బొత్తిగా పనికిమాలినవాటికి నిప్పు పెడతాడు.

కృష్ణావతారం చినుగులు కుడతాడు. రాఘవమ్మగారు దుమ్మెత్తి పోస్తారు. హనుమాయమ్మగారికి తేలువిషం ఎక్కుడుట. అందుచేత తేళ్ళవి చంపి పోగుచెయ్యడం ఆవిడపని. మరి బూజులో—నా ప్రాణ స్నేహితుడు గురుమూర్తి. బూజుల విషయంలో వాడు కేవలం పరమాత్ముడే—సిగరెట్టు పొగతోనే వాటిని భస్మీభూతం చెయ్యగల్గు. అతని సతీమణి, రమణమ్మ గారు ఆమె కోమలహస్తంతో ఆ బొగ్గుల మసిని తుడిచివేస్తుంటే, ఓహోహో!

నేనో పాతికా, ఆవిడో పాతికా—రమణమ్మగారు కాదు, మా ఆవి దన్నమాట—ఆహ్వానాలు తీసుకుని, నలుగురికీ స్వయంగా యిచ్చి పిలవ డానికని వూళ్ళోకి బయలుదేరాము. ఇంటికొచ్చేటప్పటికి మధ్యాహ్నాం మూడున్నర దాటింది. అతిథులందరూ మరో పావుగంటలో ఏతెంచ నున్నారు. అమితోత్సాహంతో కొంపలోకి తలుపుతీసి ప్రవేశించాం గదా, మమ్మల్ని ఎదుర్కొన్న దృశ్యం ఎట్లాంటిదని మీ వూహ!

ఇల్లంతా శుభ్రంగా, అద్దంలాగ చేసేశారు ఎవరో. మడత దువ్వటిలాగ ఫ్లాస్కులో వ్యాక్యూమ్ గ్లాసులాగ, ముత్యంలాగ, చంద్రుడిపై తెల్ల మేఘంలాగ ఇల్లంతా కడగబడి, ముగ్గులెట్టబడి, అలకబడి, సున్నం కొట్టబడి, సూర్యోదయంలా గుండంటే నమ్మండి. దొడ్లో నుయ్యుంది లెండి. నా సంకల్పం మా గురుమూర్తిని అందులో దించి నీళ్ళు తోడించాలని; అనేక మహత్తరమైన దిగుడు బావి. భూగోళశాస్త్రం పరీక్షలో యిట్లాంటి ప్రశ్న అడుగుతుంటారు. "నూతిలో చేదవేస్తే, న్యూయార్కు పట్నంలో ఆ చేద తేలింది. దీన్నిబట్టి ఆ నుయ్యి ఏ పట్నంలోదో కాకపోయినా ఏ దేశంలోదో చెప్పుకోండి? మీకిచ్చిన ప్రపంచ పటంలో ఆ పట్నం దగ్గర గుర్తుపెట్టండి" అని అడుగుతారు. దానికి సమాధానం మా దొడ్లో నుయ్యి. ఇల్లంతా శుభ్రం చెయ్యడం కాకుండా ఆ నూతిలోంచి నీళ్ళుతోడి, అర డజను గంగాళాలు నింపారు ఎవరో. ఈ దురంతం చేసిందెవరు? ఎవరైనా శుమూర్ఖులు కారు. క్షణంలో నలుగురు అతిధులా వొస్తారు. నా పనేంగాను! ఎంత పరాభవం! ఏదీ మీ బొగ్గుల దొంతరంటే ఏం చెప్పను? బూజులేవమ్మా అంటే మా ఆవిడే మనగట్టు? అన్నీ గతించినై. ఆ తేళ్ళ పరంపరలు, ఆ బొజ్జింకల వయ్యారపు సముదాయము: ఎలుకల మంద హాసము; సాలీండ్ల మూగతపస్సు; మాసినబట్టల స్థాన చలనము — అన్నీ నశింపు. మా ది కేపక్కు? ఏది దోవ? నేను మా ఆవిడా గోదావరీ, కృష్ణా యీ రెంటిలోనూ ఎవరు ఎందులో పడటమా అనే విషయిం తర్కించుకుంటుండగా ఒక చిరునవ్వు వినిపించింది. ఒకటి కాదు, రెండు చిరునవ్వులు. వాటిని ఉద్భవింపచేసినవారు పంచమహాపాతకంగారు, ఆయన సతీమణి.

"మీరు పడుతున్న అవస్థ చూడలేక, మీరు యింటిలో లేని సమయంలో నేనే యిదంతా శుభ్రం చేయించాను. మన కొత్తిల్లు వారంలో సిద్ధం కాబోతోంది ఈ వారం యిక్కడే నిశ్చింతగా గడపండి" అన్నా

డాయన. ఏనాడు నామకరణం చేశారో పెద్దలు. ఆయన్ని తల్చుకుంటే పంచమహాపాతకాలు పట్టుకొని, ఎముకల్లోకి జీర్నించి పీడించి, మసిచేసి వొదిలి పెడతాయా అనిపించింది. పైగా ఆ చిరునవ్వు చూడండి!

"ఇలా నాతోరండి" అని నన్ను వీధిలోకి తీసికెళ్ళాడు.

"అల్లా పైన చూడండి."

చూసాను.

ఏమీ కనబళ్ళేదు.

"ఇంతేనా మీ జ్ఞాపకం ఇదివరకెన్ని కోతులుండేవో మరచి పోయ్యారా తరిమేశాను."

దాంతో కత్తి నా గుండెల్లోకి పోవడం, మెలి తిప్పడం సమాప్తం. ఈ నీచుడితో నాకేలా....ఛీ. అనుకుని, ఆ సాయంత్రం యిల్లు ఖాళీ చేశాను— అంటే ఆ వారాంతం వో సాయంత్రం అన్నమాట.

ఇహ మా నాలుగో యింటాయన్ని గురించి చెప్పటానికి నాకు ఓపికా లేదు, వున్నా తీరుబడీ లేదు. ఎంచేతనంటే, ఆయనింటిలో నే నున్నది సరిగ్గా మూడు గంటలు, ఓవరాలు నాకు బాగా జ్ఞాపకం లేవు. ఆయన వ్రాసిన ఉత్తరం ముక్క చూసుకుని నేనూ మా ఆవిడే ఒక రెండెడ్ల బండిలో సామాన్లు వేసుకుని మరో ఒంటెద్దు బండిలో మేం ఎక్కి అడ్రసు ప్రకారం ఒక యింటి ముందు దిగాం. వీధి గుమ్మం మూసి వుంది—పక్కన బుల్లి కిటికీ వుంది — ఎంతలెండి యుద్ధ కాలంలో వచ్చిందే అగ్గిపెట్టె—అంత;—ఆ కిటికీలోంచి ఓ యాభై తలలు తొంగి చూశాయి.

"ఖాళీలేదు పెళ్ళండి మేం వచ్చేశాం" అని బృందగానం సాగించాయి.

"నేను యింటికోసం రాలేదు, ఇంటాయన కోసం వొచ్చాను." అన్నాను నమ్రతతో.

"ఆయన పేరు ?" అన్నాయి ఓ అరడజను తలకాయలు.

"పంచాంగం" అన్నాను.

ఆ తలకాయలు నవ్వి నవ్వి మాయమయ్యాయి. మా యింటాయన పేరు పంచాంగం. దానికి నేనా బాధ్యుణ్ణి. వారింట్లో కాపురం వుంటూ, ఆయన పేరు చెప్పేటప్పటికే విరగబడి నవ్వడమా ? ఎంత అన్యాయం !

పంచాంగంగారు ఆ వెనకవీధిలో వుంటున్నారు. బళ్ళు వెనక్కి మళ్ళించి, పంచాంగం గారింటికి చేరుకున్నాం. ఆయన అరుగుమీద కూర్చుని చుట్ట నములుతున్నాడు. ఆయన మీదికి తారాజువ్వలా వెళ్ళాను.

"ఏం పనయ్యా ఇంట్లో ప్రవేశించమని అంతక్రితమే మరొకర్ని ఆ ఇంటిలో ప్రవేశపెడతావా. ఇదేనా పెద్ద మనిషి తరహా. చూడు నీ విషయం కనుక్కుంటాను" అన్నాను. అంటే అచ్చంగా యింత కఠిన మైన మాట ప్రయోగించలేదనుకోండి. తత్తుల్యమైన భావం ప్రకటన చేశాను. పంచాంగం చుట్ట తీసి నవ్వి, "ఒసే" అని కేకేసి, పడక కుర్చీవేసి కూర్చోమన్నాడు. సగం పంచాంగం — (అంటే ఆయన భార్యలెండి) మరచెంబు; గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చింది. వీధిలోకెళ్ళి మా ఆవిణ్ని బండిలోంచి దించి, లోపలికి తీసుకెళ్ళి కాళ్ళ కడికి పసుపు పారాయణ పూసి, హారతిచ్చింది. అరిసెలు, అప్పాలు, అరడజను మొక్కజొన్న పొత్తులు వెండి పళ్ళెంలో తెచ్చి నాముందు పెట్టింది.

"ఇదిటయ్యా నువ్వు చేసేపని. చెప్పేదొకటి చేసే దొకటినా ?" అన్నాను, కోపం దిగమింగుకోలేక.

"తరువాత మనవిచేస్తా, ముందు భోంచెయ్యండి." అన్నాడు పరమ పంచాంగం.

నేను ఫలహారం చేస్తున్నా, సంస్కారం, నాగరికత గల ఆధుని కుణ్ని కాబట్టి. మరోడైతే ఆ పొత్తులు ఆయన మొహానకొట్టి మరీ వెళ్ళను.

"మీకు రాసిన ఉత్తరం ఆయనకి వెళ్ళిందిట. ఆయనదీ మీదీ వొకటే పేరుట. మీరు మళ్ళా రెండు మూడుత్తరాలు వ్రాశారు. ఓ వేళ నా ఉత్తరం అందలేదేమో అని మళ్ళా మొన్న వ్రాశాను. ఆ ఉత్తరం సరిగ్గానే చేరిందన్న మాట. పోస్టువాడు యిప్పటికేనా నిజం తెల్సుకున్నందుకు సంతోషించాల్సిందే."

"పేరువొంకని ఆ యాభై తలకాయలి కుటుంబంగాడు అందులో ప్రవేశిస్తాడా? వాణ్ని బైటకి తోలెయ్యలేరూ, యింటి యజమాన్లుగా" అన్నాను.

"పోనిస్తురూ పాపం. ఇల్లు లేక ఎంత అవస్థ పడుతున్నాడో"

"నా వొళ్ళు మండడం సాగింది. చూడండి, స్వార్థరాహిత్యం వల్ల ఎంతకీడు వాటిల్లుతోందో.

"మరి నా మాటేం చెప్పారు?"

"భగవానుడి కృపుండాలిగాని, అన్నీ చక్కపడతై. నేనన్నీ ఏర్పాటు చేస్తాగా."

"మీకు మరో యిల్లుందా?"

"మీ కెందుకు, ఆ సమస్య నాకు విడచిపెట్టండి" పంచాంగం వీధిలోకెళ్ళి నలుగురు ఉక్కులాంటి మనుషుల్ని పోగుచేసి, బండిలో సామానంతా, యింటిలో పెట్టించాడు. నాకర్థంకాక ఆశ్చర్యంతో చూస్తూ అరిసెలు తింటున్నాను.

ఇంటిలోంచి, తన సామాన్లు వొక్కొక్కటే, వీధిలోకి చేరుస్తున్నాడు మంచాలు, బల్లలు, కవ్వం; రోకలి, రెండు జల్లెళ్ళు, ఐదు ట్రంకు పెట్టెలు, గంపలు, మాసినబట్టల మూటలు సర్వమూ బైట జేరేయించాడు. మేం దిగిన రెండెడ్ల బండిలో పెట్టిస్తున్నాడు.

"ఒకసారి తమరు లోపలికి దయచేస్తారా—కాస్త శ్రమనుకోక" అన్నాడు.

అదంతా స్వప్నంలాగుంది. లోపలికెళ్ళాను. నలుగురు ఉక్కు-మనుషులు, ఆయనా కలిసి మధ్య హాల్లో భోషాణాన్ని కదల్చడానికి యత్నిస్తున్నారు. నన్నూ చేతి వెయ్యి వేయమని అడిగాడాయన. "ఇవన్నీ ఎక్కడికి చేరేస్తున్నారు ?" అన్నాను.

"నేను నిజాయితీగల పెద్ద మనిషిని. అడినమాట తప్పను. మీకు ఇల్లు యిస్తానన్నాను. యిచ్చితీరతాను. మీరు మా యింటిలో వుండండి—?"

"మీరో—"

"నా మాటకేం. భగవానుడున్నాడు. ఏ చెట్టు నీడకో చేరుకుంటా—యిల్లు మెల్లి మెల్లిగా అదే దొరుకుతుంది" అన్నాడు ఆయన.

ఇదేం కర్మ !

"అల్లా వీలులేదు. నలుగురూ ఏమనుకుంటారు ?"

"ఏమనుకుంటారు, అద్దెకోసం యజమాని వనవాసం చేస్తున్నాడనుకుంటారు. అసలందుకే యిల్లు కట్టుగోడం. తమకి తెలియందేముంది లెండి పోనీ భోషాణం యిక్కడే వుంచుతాను. తమరే వాడుకోండి."

ఆ చివరి వాక్యంతో, నా పొత్తికడుపులో బల్లెం గుచ్చినట్లైంది.

"ఇంకా నయం. మీరే వుండండి. నేను మా ఆవిణ్ని పుట్టింటికి పంపేసి, ఏదో హోటల్లో గడుపుతాను" అన్నాను.

అల్లా ఎంతమాత్రం వీలులేదు. పైగా మీ యిష్టమా! భగవానుడి ఆజ్ఞ వుండాలండోయ్...."

నేను వంటింట్లోకెళ్ళి మా ఆవిణ్ని బరబరా యీడ్చుకొచ్చి వొంటెద్దు బండిలో ఎక్కించాను.

"ఎక్కడికి ప్రయాణం ?" అన్నాడు.

"ఇప్పుడే నదిలో స్నానంచేసి వొస్తాం. తోలరా బండి." అనడంతో బండి కదిలి, అప్రతిష్టపాలవడం తప్పించుకున్నాం. నదిలో స్నానానికని ఆయనతో చెప్పినా, నాకు మళ్ళా యివతలకొచ్చే సంకల్పం

లేదు. అట్లాంటి సందర్భంలో ఆత్మహత్య తప్ప, మరి గత్యంతరంలేదు. పంచాంగం అన్నట్లు యివన్నీ మనిష్టమూ—భగవానుడి ఆజ్ఞ కావాలి. అంచేత ఆత్మహత్యలాంటి వె(్రి వె(్రి వేషాలెయ్యక, తిన్నగా ఆవిడను పుట్టింటి కంపి, నేను హోటల్లో మకాం చేశాను.

ఇది 1946 మాట పంచభూతంగారింట్లో కొత్త కాపరం—నేసూ మా ఆవిడా, వంటమనిషి, పసిపిల్లా, రెండు పిల్లులూ. అద్దె పాతిక రూపా యలు. అన్ని విధాలా మంచిల్లు. పంచభూతంగారు పక్క వీధిలో వుంటు న్నారు. పేచీలు లేకుండా కులాసాగా సంవత్సరం గడిచి పోయింది. **1947** ఆగస్టు వచ్చింది.

దేశానికి స్వతం(తంవొచ్చింది. నాకూ వో ఆడపిల్ల —ఎంతకాలం వూరుకుంటుంది చెప్పండి—కలిగింది. భూములు పుష్కలంగా పండాయి: ఉద్యోగం పెద్దదయింది. చేతిలో బోలెడంత డబ్బు. మనమే యిల్లు కడదాం, ఎంతకాలం అద్దెకొంపలు. పట్టుమంది కూడా, మా ఆవిడ. దేశ విభజనా, కాందిశీకుల సమస్య బయలుదేరిన సంగతి మీరందరూ ఎరుగు న్నదే. ఒక్కసారిగా దేశం అంతటా అద్దెలు పెరిగినయి. ఒకటో తారీకున అద్దె యివ్వడానికి పంచభూతంగారింటికి స్వయంగా వెళ్ళాను. ఆయన నలభై చేసినా యివ్వడానికి సిద్ధంగా వున్నాను. అచ్చే, ఆయన విషయం ఎత్తలేదు. వెడుతూ వెనక్కి తిరిగి అన్నాను.

"మరి....మరి....అద్దెమాట ?"

"ఇస్తిరిగా...."

"అ....సరె...." అని నవ్వుకుని వెళ్ళిపోయాను.

తర్వాత వారంరోజుల్లో మా ఇంటిని కొంత మరమ్మతు చేసాడు, ముందులాంటిది: వెనక "అవుట్ హౌస్" సరంబి, గిలాబా, అరెకకాచెట్లు. బుల్లితోట, అందులో విహరించే పక్షులు, అవి బైటకి పోకుండా చుట్టూ వైర్ నెట్టింగు.

య్యాభై యివొచ్చునని నిర్ధారణ చేసుకున్నాను. ఆ నెల ఆయనే మా యింటికొచ్చాడు. వందరూపాయల నోటిచ్చాను. పాతికా తీసుకుని మిగతా డబ్బిచ్చేశాడు.

"చాలా బాగుంది ఇల్లు యిప్పుడు" అన్నాను.

"ఏదో—చేయించాను. మీకు సంతృప్తి గలిగితే అదే చాలు."

"మరి అద్దిమాటో"

"మామూలే"

"ఎక్కువ చెయ్యరు ?"

"చెయ్యను."

"అందరూ చేస్తున్నా."

"వాళ్ళకు మతుల్లేవు. ఇచ్చేవాళ్ళకి గతుల్లేవు."

"మీరు బోలెడు డబ్బు యింటిమీద పెట్టారు. అది రాబట్టుకోరు ?"

"నా యింటిమీదే ఖర్చు పెడుతున్నాగాని, పరాయివాళ్ళ యిండ్ల మీద కాదుకదా."

"మీరు అనుభవించడం లేదుగా."

మీరనుభవిస్తే, నేననుభవించినట్టు కాదు ?"

ఈ పెద్ద మనిషి నేం జెయ్యమంటారు ? బోలెడుమంది పిల్లాజెల్లా పైగా, ఎట్లా గడుస్తుంది. నాకు జాలేసింది.

మరుసటి నెలలో వారింట్లో ఏదో కార్యం వొచ్చింది. నేనూ వెళ్ళాను. వొచ్చేస్తూ అన్నాను.

"నా మనస్సు పూరుకోడం లేదు. మీరు అద్దె ఎక్కువ చెయ్యాలి."

"చెయ్యను."

"బాగా ఆలోచించండి, రోజులు బాగాలేవు. మీకు గడవదు."

"అందరికీ గడిచినట్లే నాకూను."

"అప్పులపాలై పోతారు."

"దైవకృప"

రామదాసులా నటిస్తాడేం, ఈ పంచపిశాచంగాడు ? నాకు నిద్ర పట్టడం లేదు. బెంగతో మా ఆవిడ మంచాన పడింది. వాళ్ళింట్లో కథలూ, కార్యాలూ జరిగినప్పుడు, బహుమతులు రూపేణా వారికేదో ముట్టచెబుదాం. బెంగెట్టుకోకు; లేచి, తిరుగు—అని ఆవిణ్ని వూరడ బెట్టాను.

ఇంతలోకి మా అదృష్టవశాత్తు హైదరాబాదు సమస్య చక్కా-వచ్చింది. దేశంలో అందరూ, అద్దెలు నాలుగింతలు చేసి వూరుకున్నారు.

మా ఢాకినీభూతంగారు మాత్రం, అణాకూడా పెంచలేదు. నాకో భావం తట్టబోయి మానేసింది. అదేమిటో తరవాత మనవి చేస్తాగా.

మీ కిదంతా చదవటం విసుగని నాకు తెల్సు. కాని ఏం చెయ్యను ? ఈ నా విషాదగాధ విసుగెత్తించిందంటే ఆశ్చర్యమేమిటి ? పైగా నగ్న సత్యం ఈ రోజుల్లో ఎవరికి రుచిస్తుంది చెప్పండి. ఇంతవరకూ వోపిగ పట్టినవారు, ఈ కాస్త చదివెయ్యండి మరి. అట్టే యిదవక ! ఇదే రస వత్తర ఘట్టం.

మూడునెల్ల క్రితం, అమాంతం మా ప్రక్కింటాయన మా యింటి కొచ్చి లబోదిబోమని బుర్ర మా కొత్తగా సున్నం వేసిన గోడకి కొట్టు కున్నాడు. ఏమిటయ్యా కథ అని అడిగాను.

"ఇంకేముంది ? చిప్పా, కర్రా చేతికివ్వండి" అన్నాడు.

"నిదానించి చెప్పండి—మా గోడ చెడిపోతుంది."

"ఏం చెప్పమంటారు ? మా యింటాయన అమాంతం అద్దె నాలు గింతలు చేసాడు."

ఏం చెప్పమంటారు. హైడ్రోజెన్ బాంబ్ తయారయింది. అందు కట."

"ఎంత ధన్యుడవయ్యా—పిచ్చివాడ, సంతోషంతో పార్టీ యివ్వడం పోయి యిల్లా బెంబేలెత్తి ఎవరేనా ఏడుస్తారా ! లే, లే వెళ్ళి మొహం

కడుక్కో—" అని ఆ దీనుణ్ణి పంపించివేశాను బజాన తువ్వాలు వేసుకుని, తొందరగా పంచభూతంగారింటి కెళ్ళాను.

"ఏమండోయ్—ఇహ మీరు వూరుకుంటే లాభం లేదు. కొంప మునిగింది.

"దొంగలు గోడకి కన్నాలెట్టారా—పోసిలెండి, మళ్ళా గోడ లేట్టిద్దాం—ఈసారి డిస్టెంపర్ చెయ్యించి. ప్లాస్టిక్ షీట్స్ వేయిస్తాగా."

"అదికాదయ్యా, హైడ్రోజన్ బాంబ్ తయారైందిట."

"అవుతే !"

"మీరు అద్దెక్కువ చెయ్యరూ ?"

"దానికీ దీనికి ఏం సంబంధం ?"

"బాగానే వుంది. ఒక్క బాంబ్‌తో మీ యిల్లు భస్మం అవుతుంది. అది జరిగేలోపలే, మీ పెట్టుబడికి సొమ్ము రాబట్టుకోవాలి. అంచేత దయచేసి యింటద్ది వంద చెయ్యండి" అని బ్రతిమిలాడాను.

భూతం వికృతంగా నవ్వడం సాగించాడు. "పిచ్చివాడా బాంబ్‌లేస్తే, నేనూ, నువ్వూ మాత్రం వుంటామా ? డబ్బుంటుందా ? అందరం దుమ్ములో కలిసిపోతాం. వెళ్ళండి ! వెళ్ళి రోజూ భగవద్గీత పారాయణ చెయ్యండి." అన్నాడు. నేను సిగ్గుపడి, కొంపకి చేరుకున్నాను.

ఇందాక అన్నానే. ఒక భావం వొచ్చి మానేసిందని, ఆ భావం ఈసారి లోపలికి జొరబడింది. అదేమిటంటే ఈ సమస్య అంతర్జాతీయ సమితిముందు పెట్టి న్యాయం పొందుదామని, వెంటనే ఒక ప్రణాళిక తయారుచేశాను. అందులో నిబంధనలు చూడండి

1. ప్రతి యింటి యజమానీ ఇల్లు అద్దెకు ఇవ్వబడదని బోర్డు లి.

2. ప్రతి నెలా కాకపోయినా ప్రతి సంవత్సరమూ ఇంటద్దె ఎక్కువా ఏ విధంగా ?

అ. పాతదైన కొద్దీ అద్దె పెరుగుతుండాలి.

ఆ. గోడలు లేకపోతే గోడకి 10 రూపాయల చొప్పున.

ఇ. కప్పకపోతే 50 చొప్పున.

ఈ. నేలమట్టం లేకపోతే 100 రూ॥లు.

3. మరమ్మతులు ఎప్పుడూ తలపెట్టకూడదు. ఆ ఖర్చుతో మరో యిల్లు కట్టించి మరో సంసారం నిలబెట్టొచ్చు.

4. సాధ్యమైనంతవరకూ ఇంటాయన అద్దెకిచ్చిన వాటా దగ్గర లోనే కాపురం ఉండాలి. స్విట్జర్‌లాండ్, కైరో, అలాస్కా. మాస్కోల కేసి మకాం చెయ్యకూడదు.

5. ఇది ఆఖరు నిబంధన—

ఇంటాయన అద్దెకున్నాయన్ని ఖూనీచేస్తే ప్రపంచ కోర్టుకి మాత్రం విచారణ చేసే అధికారం వుంది. మిగతా కోర్టులకి లేదు.

అల్లాగే అద్దెకున్నాయనకి ఇంటాయన్ని ఖూనీ చెయ్యాలన్న సంకల్పం కలిగినట్లు ఋజువైతే, ఋజువిచ్చినవాడినీ, సంకల్పం కలిగిన వారినీ, వరల్డ్ కోర్టు విచారణ చేసి, ఋజువు కాకపోయినా మరణదండన విధించే హక్కుంది

ఇది తయారు చేసిన తర్వాత మా పంచభూతాన్ని చంపడానికి నిశ్చయించుకున్నాను. దైవం కలిసొచ్చింది. ఆ ఉదయమే స్టీఫెన్ లీకాక్ అనే ఒక తోటి కాపురస్తుడు. అమెరికాలో కాలేజి ప్రొఫెసర్. న్యూయార్క్ పట్నంలో, అద్దె ఎన్నిసార్లా కోరినా ఎక్కువ చెయ్యని మిషమీద, తన ఇంటి యజమానిని పిస్తోల్‌తో కాల్చి చంపేసి పోలీసులకు పట్టుబడిపోయిన సంగతి వ్రాయడం, ఆ వ్రాసింది నే చదవడం జరిగింది. ఆ వింతగాథ ఆంధ్రదేశం మినహా ప్రపంచం అంతా చదివే ఉంటుంది.

ఈ విషయంలో నేను ఆయన వ్యాసంలో సంగతులు దొంగిలించానని అనుకోవద్దని మనవి. చంపాలన్న సంకల్పం మాత్రం అది చదివిం

తర్వాత కలిగింది. మేమిద్దరం కలిసి, ఒకర్నే చంపామని కూడా అనుకో వద్దు. ఆయనకి పిస్తోల్ లైసన్సుంది. నాకు లేదు. ఆయన మిట్టమధ్యాహ్నం హత్య చేశాడు. నేను నిశిరాత్రి చేశాను. ఆయన నేరం వొప్పేసుగున్నాడు. నే వొప్పుగోను. నేను పిరికివాణ్ణి, స్వార్థపరుణ్ణి, ప్రాణంపై తీపి జాస్తి. వెళ్ళి ఎల్లాగో ఆ పంచభూతాన్ని హత్యచేసి, రక్తం చేతులు కడుక్కున్నాను.

కొంపతీసి నిజమనుకుని నా మీద కేసు పెట్టేరు! చంపలేదండి— చంపుదామన్న కసి అంతగా ఉందన్నమాట. ఆ కసి తీర్చుకోడానికి అల్లా వ్రాశాను. అంతే!

ఇప్పటికైనా తెలిసిందా, నా స్వార్థపర్వతం ఎట్లాంటిదో!

# వాడినచక్రం - వాడనిపుష్పం

నాకామధ్య కొంత డబ్బొచ్చిపడింది. దాన్ని ఒకరిక్షామీద పెట్టి లాభం పొందాలనుకున్నాను. స్నేహితులు నలుగురూ వొద్దన్నారు. రిక్షా నడిపేవాళ్ళని నమ్మడానికి వీలులేదన్నారు. ఒకరోజున నాలుగు డబ్బులు అదనంగా చేతులో పడగానే, రిక్షాని పూరవతల వొదిలేసి, గంట, లైటు సీట్లు టాపుగుడ్డ వగైరా తీసుకుని పారిపోతారట. రాత్రి ఒంటిగా నగలతో రైలు దిగిన స్త్రీని దోవమళ్ళించి, ఏ మారుమూలో హత్యచేసి నగలతో పారిపోతారు. వారంతా నేరస్థుల తెగకి చెందినవారు. ఇహ నేనెల్లాగూ సైకిల్ రిక్షా తొక్కలేనుకదా, కాబట్టి కొని ప్రయోజనం లేదు.

మరేవిధంగా యీ డబ్బు వినియోగపరచడమా అని ఆలోచిస్తూ కూర్చున్నా మండువాలో. మండువా యిల్లూ చిన్నదేకాని, ఆరుబైట స్థలం బోలెడుంది. చుట్టూ గోడ; మధ్యలో గేటు. గేటు ప్రక్కన మూలగా వొకచిన్నపాక. ఇంటివాళ్ళున్నపుడు దాన్ని పశువులపాకగా వాడేవారేమో తెలియదు. ఇప్పుడదెందుకూ పనికిరాదు. ఇప్పుడంటే టంగ్క్లీనర్లొచ్చాయికాని, నా చిన్నప్పుడైతే ఆ తాటాకులు నాలిక గీసుకునేందుకు ఉపయోగపడేవి. ఆ పాక కన్నీ కంతలే. ఈసారి పెద్ద గాలివీస్తే తప్పకుండా భూమట్టమైపోతూంది. ఆ పాకముందు వో చెట్టు దానిమీద ఎర్రపూలు వికసిస్తున్నాయి. చాలా ఎర్రనివి. జీవిత పరిణామంలో ఆ పూలకి ఆ ఎర్రదనం అబ్బివుంటుంది. కొన్ని యుగాల వెనక అంత ఎర్రగా ఉండి వుండవు. వాటికేసి చూస్తూ నా ధనార్జనకి సంబంధించిన ఆలోచనలు నాకు చిన్నతనాన్ని కలగచేశాయి. మనిషి ఆలోచనలు డబ్బు గురించేకదా....

జీవితంలో అందమైనవి, ఆనందాన్ని కలుగచేసేవి, కాని ఖర్చు

లేకుండా లభ్యమవుతాయి. పచ్చగడ్డిమీద పడుకుని ఆకాశంలో మేఘాలకేసి చూడటం, దాహమేసినప్పుడు లోతైన చెరువులో చల్లని నీళ్ళు త్రాగడం, వేసంగిలో బాగా ఆకలేసినప్పుడు కొత్తావకాయ పెరుగుఅన్నం తినడం, ఆరుబైట పడుకుని చందమామ వయ్యారం చూడటం, గాంధీగారి అంచనా ప్రకారం పాతిక రూపాయలతో నెలజీవితం ఆనందంగా గడచిపోతుంది.

ఆ ఎర్రపూలకు కొంచం దూరంగా పాకముందు, వొక రాతిబండ వుంది. ఆ బండ కానించి వొక చక్రం వుంది. బండిచక్రం లాంటిది నిన్న లేదు, ఎక్కడిది ఆ చక్రం? అసలదేమిటి?

పాకలోంచి వో నల్లటివ్యక్తి మరోచక్రం వోబండి తీసుకొచ్చాడు. బండపక్క చక్రాన్ని ఆ బండికి బిగించాడు. పూర్తయిన వాహనం రిజా. ఆ నల్లటివ్యక్తి, రాతిబండమీద కూర్చుని, గడ్డాన్ని చేతిమీద ఆనించి దేనికేసో చూస్తూ కూర్చున్నాడు. రోడిన్ అనే శిల్పి కంచులో చెక్కి పోత పోసిన మేధావి—అనే ప్రతిమలా వున్నాడు. రోడిన్ శిల్పంలో వ్యక్తికి మల్లే కండలు తిరిగిలేదు. ఈ వ్యక్తిది ముడతలుపడ్డ పల్చటినల్లటి శరీరం దానికింకా జీవితంలో పేచీ వున్నట్లు లేదు. కోతికీ, ఆదిమానవుడికీ మధ్య వొక ప్రాణి వుండేదట. ప్రాచీన మానవశాస్త్ర పరిశోధకులకి అది యింత వరకూ లభ్యంకాలేదు. ఆ ప్రాణిసంతతివాడు. ఈ వ్యక్తి రాత్రి వర్షంలో ఖాళీగా పాక కనబడితే వొచ్చాడు. అభ్యంతరం లేకపోతే వుంటాడు. నాలుగు రోజులపాటు. మధ్య నా అభ్యంతరం దేనికి? అంగీకారానికి కొంత స్వార్థం లేకపోలేదు. వాడు ఆ పాకలో రాత్రిళ్ళు వుంటే దొంగ భయం వుండదు.

వాడే దొంగేమో? అర్ధరాత్రి నన్నేమన్నా చెయ్యడు కదా....

కాని వాడు అల్పుడు; అర్భకుడు. సృష్టికర్త, తిని పారేసిన పుల్లిస్తరాకు. జంతుజాలం దిగవిడిచిన అంతిమ చిహ్నం. సంఘం వూడ్చిపారేసిన మన్నుపుట్ట. మృత్యువు వాడిచుట్టూ పుచ్చుపోసింది. ఇక లాగటం తరవాయి.

ఆ వ్యక్తి నింకేమీ ప్రశ్నించలేదు. వాడికి తల్లి దండ్రులు, కుటుంబం, కొంప లేవా ? వాడు మట్టిలోంచి రిక్షాతో సహాపుట్టాడు. అందులోనే కాపరం, అందులోనే చావు. మట్టిలో కలిసిపోతాడు. వాడి రక్తంలోంచి మరో ఎర్రనిపువ్వు పుట్టి వికసిస్తుంది. అది రిక్షాఘట్టం, రాజఘట్టంకాదు.

వాడి ఆలోచన ముగిసింది. ఆకలేసినప్పుడే వాడి ఆలోచన. చుట్ట పీకతీశాడు. నిప్పులేదు అగ్గిపుల్ల గీశాడు. ఆకలేస్తే నిప్పుతింటాడు. వెడుతున్నాడు. వెళ్ళాడు. నేలమీద పడ్డ యెర్రపువ్వు రిక్షాచక్రం కింద నలిగింది.

ఇందాక వున్నాడు, ఇప్పుడులేడు. రిక్షాచక్రాలజాడలు నలిగినపువ్వు, గాలిలో కలిసిన చుట్టను తీసి. అంతే వాడి వునికికి నిదర్శనాలు. అంతే జీవితం.

ఆర్థికవేత్తలు ఎవడు సామాన్య మానవుడు ? అని అడుగుతున్నారు. నాకింత సందేహంలేదు. వీడే ఈ రిక్షావ్యక్తి కాయకష్టంచేసి. అలసిన సామాన్యప్రేక్షకుని వినోదం కోసం చిత్రాలు తీస్తున్నాం అంటున్నారు సినిమా వ్యాపారులు. అది మధ్యతరగతి వారి భ్రాంతి వాడు వినోదించడు. వాడి బ్రతుకే వినోదం. వేరే వినోదాలకు సమయం లేదు, వోపికలేదు. సినిమాహాళ్ళముందు వందలాదిగా రిక్షాలు పడివుంటాయి. రిక్షావాళ్ళందరూ వాటిమీదనో కిందనో పడివుంటారు. మన్ను వారి వెండితెర, మట్టిలో పురుగులు వారి అభిమాన నాయికా నాయకులు, రిక్షా యెక్కేవారు వారి దర్శకులు, అణాలబేరం వారి కథావస్తువు.

ఆఫీసు టైము కాగానే యీ వింత ఆలోచనలు ముగిశాయి. నా పొట్ట నింపుకోడానికి నేనూ బయలుదేరాను.

* * *

ఆ సాయంత్రం నేను యింటికి వొస్తుండగా మా వీధి చివర వొక పెద్దగుంపు చేరింది. పెద్దలు పిన్నలు వొకరిద్దరు స్త్రీలు, వొక పోలీసు — మధ్యలో ప్రొద్దున మాయింటి ముందు చూసిన రిక్షావాడు వున్నారు. ఏదేనా

ప్రమాదం జరిగిందేమో చూద్దామని నేనూ గుంపులో చొరబడ్డాను. మనుషులు, చెమట, వేడివూపిరి, వింతధ్వనులు చుట్టుముట్టాయి. గాయపడిన మనిషిగాని, రక్తంగాని కనపడలేదు. అందరూ వింతగా చూసేవారే — మాట్లాడేవారే. విషయం యేమిటో చెప్పరు, పోలీసు ప్రక్కనేవో దవాలీ బంట్రోతు వున్నాడు. అతణ్ని ఏమిటని అడిగాను అతను సమాధానం చెప్పలేదు.

"అవుతే ఏంరా వొక మనిషి యెక్కువ బరువా, ఇద్దరు మనుషు లెక్కువ బరువా" అని అడిగాడు రిక్షావాణ్ని "ఒకరే యెక్కువ బరువు" అన్నాడు వాడు. అందరూ విరగబడి నవ్వారు. పిచ్చోడా అంటూ పిల్లలు వాణ్ని దుయ్యబట్టారు.

నవ్వడానికి బలమైన కారణం ఉంది. "పిచ్చివాడు" అనుకోవడంలో తప్పులేదు. ఇద్దరు మనుషులకంటే, ఒకరే యెక్కువ బరువన్నది సృష్టికీ, ప్రకృతికీ విరుద్ధం, యూక్లిడ్, న్యూటన్, రామానుజమ్ మొదలైన గణితశాస్త్రజ్ఞులు ముక్కుమీద వేలువేసుకోరూ, యీ "మేధావి" చేసిన సూచనకి! రెండురెళ్ళు నాలుగన్నదీ స్వయంప్రకాశమైన సత్యం. మేధావు లున్నా లేకపోయినా, దేవుడున్నా లేకపోయినా, సృష్టి అనంతంలో కలిసి పోయినా ఆ సత్యానికి చలనం లేదు. అల్లాగే ఒకటికంటె రెండు బరు వన్నది. కాని వాడు యీరోడిన్ "మేధావి" రెండు కంటే ఒకటి బరువంటే విజ్ఞానశాస్త్రం లోకజ్ఞాన జగత్తు విస్తుపోక చేసేదేముంది? నవ్వుతారు, దుయ్యబడుతారు, యిది పాకిందంటే నలుగురూ ఏకమై తంతారు. ఈ సామాన్యమానవుడు యిల్లాంటి అసామాన్యమైన సిద్ధాంతాన్ని అమాయక సంఘం నెత్తిన రుద్దుతాడా?

దవాళీ బంట్రోతు ధైర్యంగా ముందుకొచ్చి, "అది యెల్లాగో కొంచెం చూపించరా" అని రిక్షావాణ్ణి సంబోధించాడు ప్రశ్న, సమాధానం వింతగానే ఉన్నాయి. నా కుతూహలం ఎక్కువైంది. ఒక పెద్దమనిషి

అగ్గిపుల్ల కోసం అటూ, ఇటూ చూస్తున్నాడు. అగ్గిపుల్ల ముట్టించి, ఆయన్ని దూరంగా తీసికెళ్ళి యిదంత ఏమిటని అడిగాను.

గంటక్రితం ఫ్యాక్టరీ యజమాని భార్య, పనిపిల్లని తీసుకుని బజార్లోకి బైలుదేరారుట, మరో రిక్షా కనబడక చిన్న పిల్లేకదా ఫరవాలేదనుకుని యిద్దరూ వాడి రిక్షాలో యెక్కారుట. పనిపిల్లకి పది పదకొండేండ్లుంటాయిట. అమ్మగారి కాళ్ళముందు కింద గంపతో సహా కూర్చుందిట. రిక్షావాడు వాళ్ళిద్దరినీ హాయిగా, సునాయాసంగా మోసేశాడుట. మార్కెట్లో సరుకులు కొనుక్కుని గంప పిల్లనెత్తిన పెట్టి, ఇంటికి పంపించి, యజమానురాలు ఒక్కర్తీ రిక్షాలో బయలుదేరిందిట.

ఫ్యాక్టరీ దాటి వారి బంగాళా చేరువలోకి రాగానే రిక్షాపైకి వొదిలెయ్యడం, ఆవిడ రోడ్డుమీద పడిపోవడం, ఫ్యాక్టరీ జవాన్లు నలుగురూ వొచ్చి ఆవిడను ఒక జట్కాలో ఎక్కించి ఇంటికి పంపడం, రిక్షావాణ్ణి నిలేసి సంజాయిషీ అడగటం అదీ జరిగింది.

రిక్షావాడు ఆమెను పడెయ్యాలనే పడేశాడని, గుంపు తీర్మానించింది. ఈ తీర్పుకి ప్రబలమైన కారణాలున్నాయా ? వున్నాయి. రిక్షావాడొకప్పుడు ఆ ఫ్యాక్టరీలో పనిచేశాడు. ఏ కారణం చేతనో వాణ్ని పనిలోనుంచి తీసివేశారు. ఇన్నాళ్ళకి వాడు యజమాని భార్యపై పగసాధించాడు. ఓపికలేక పట్టుజారి వొదిలేశాడంటారా ? అబ్బెబ్బే యీ రిక్షావాండ్ల సంగతి మీకు తెలవదండి. వీళ్ళు ఎంతకేనా సాహసిస్తారు. అంత వోపికలేనివాడు అమ్మగారు పసిపిల్ల యిద్దరూ వుండగా పడెయ్యలేకపొయ్యాడూ అంతే కాదం డోయ్ వెళ్ళినకొద్దీ లోతుంది. ఆ పనిపిల్లకీ వాడికీ ఏదో చుట్టరికం ఉందదనా మీ ఊహ ? చూడండి చిత్రం—ఆ పిల్ల దిగింతర్వాతే, అందులో ఫ్యాక్టరీ దగ్గర్లో. యింకా ఏమిటి మీ సందేహం. ఒక్క మనిషే ఎక్కువ బరువట. అదంతా ఏమిటో తెలుసాండి. ఆవిడది స్థూలకాయం....అదంతా, ఎగ రాళ్ళన్న మాట. విన్నంత వాడి సమాధానం

అంటూనే చుట్ట అవతల పారేసి దవాలి బంట్రోతు వెనక్కి ఆసామీ జొరబడ్డాడు. ఇద్దరికంటె వొకరెల్లా ఎక్కువ బరువో యిప్పుడు చెప్పమన్నారు. రిక్షావాడు తల తడిమి చూసుకున్నాడు. చేతులు నలుపుకున్నాడు దిగులుగా నాకేసి చూశాడు. "అర్నదగండి" అన్నాడు నాకేసి చూపిస్తూ.

"రిక్షా మోసింది నువ్వైతే అర్నదగడం ఏందిరా?" అని రెండు మూడుకంఠాలు రొకాయించాయి.

"నే వెట్టాంటివోణ్నో" అన్నాడు రిక్షావాడు. నలుగురిలోనూ, నేనెల్లాగో అయిపొయ్యాను. వాణ్ణి గురించి నాకేం తెలుసు? దేవుణ్ణి గురించి నాకెంత తెలుసో వాణ్ణిగురించి అంతే దీనికంతా నేను మద్దత్తు అనుకోరు గదా....సమాధానం చెప్పకపోతే, పోలీస్ స్టేషన్ కి నడవమన్నారు.

వాడికి సమాధానం తట్టినట్లుంది. "చెప్పనాండి" ఆ పిల్ల మట్టంగా గంపతో నడుంగా కూకున్నప్పుడు, అమ్మగోరు కదలగండా, కుదిమట్టంగా కూకుండిపోయినారు, అటు యిటు కదల్టానికి లేదుగా మరీ....ఊగిసలాస్త్రానికి లేరుగామరి—రిచ్చా, సమ్మగా కదలకుండా పోద్ది, ఆ పిల్ల దిగేసరికి: ఆరొక్కరేగా. ఓ స్వేచ్ఛ! ఎనక్కి ముంగలకి సూత్రం, ఊగిసలాడతం పట్టు ఏడకవుద్ది? అందుకని ఆరిద్దరూ వుండప్పుడు లాగడమే సుకం, అన్నాడు. జనం విరగబడి నవ్వారు. అది తర్కానికతీతమైన అనుభవం, రిక్షాలాగుతేగాని తెలవదు. ఆధునిక విజ్ఞానశాస్త్రం పురోగమిస్తుంది. నిన్న అవునన్నది యివాళ కాదనడానికి ఆధారాలు దొరుకుతున్నై. కొన్ని శతాబ్దాల పాటు సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతోందని నమ్మిన ప్రజ, యిది మాత్రం ఎందుకు నమ్మకూడదు? కాంతి తిన్నగా, సూటిగా, గీట్లుగా ప్రవహిస్తుందంటారా? సూర్యుడి దగ్గరగా రాగానే, కాంతి కిరణం వొంకర తిరుగుతుంది. స్థలం, ఉంగలు చుట్టుకున్న పాముకిమల్లే వంకర తిరుగుతుంది. ఇక్కడనుంచి బైలుదేరితే, విశ్వం అంతా చుట్టి ఎప్పటి

కైనా యిక్కడికే చేరుకుంటాం. అనుభవించే వ్యక్తినిబట్టి సత్యం యొక్క స్వరూపం మారుతూంటుంది. ఈ రిక్షావాడి అనుభవం యిదీ. ఇందులోని స్వారస్యం ఐన్‌స్టయిన్‌వంటి శాస్త్రజ్ఞుల కర్థమవుతుంది.

జనంలో కొందరు వాడు చెప్పింది రైటన్నారు. పగసాధించడం వాడి వుద్దేశమైతే, రిక్షాచక్రం వూడకొట్టుకుంటాడా? లైటు బ్రద్దలు కొట్టుకుంటాడా. గంటలా మోగించే మువ్వలు పోగొట్టుకుంటాడా? అని అడిగారు.

"పోలీసుకు, డవాలి బంట్రోతుకు నమ్మకం కుదరలేదు.

"రిక్షా ఎవరిది?" అని ఎవరో అడిగారు.

"వాడిదేట—సొంతంట" అన్నారు.

రిక్షాకి లైసెన్సు ఏది? లేదు, పోలీసుకు ధైర్యం చిక్కింది. వూడిన చక్రం రిక్షాకి బిగించమన్నారు. వాడు బిగించాడు. ఫ్యాక్టరీ యజమాని బంగళాకి నడవమన్నారు. జనం పల్చబడ్డారు, మెల్లిగా జారుకున్నారు. డవాలి బంట్రోతూ, పోలీసూ ముందు, వెనక నేనూ, మధ్య వూగిసలాడుతూ రిక్షా బంగళాకేసి బైలుదేరాం.

రిక్షా కొని లాభం చెయ్యాలన్న నా సంకల్పం సన్నగిల్లింది. లైసెన్సు యిందాక అంచనా వెయ్యలేదు. దానికి దీపం, గంట, రిపేర్లు చాలా తంతు వుంది. నడిపేవాడికి జబ్బు చేస్తే, మందు యజమాని యిప్పించాలా? ప్రమాదం జరిగితే, నేరస్థుడు లాగినవాడా? యజమానా? వాడి అపస్మారకానికి యజమాని ఎల్లా బాధ్యుడు? ఇదంతా గందరగోళంగా తోచింది.

యజమాని బంగళాకి చేరుకున్నాం. ఆయనా యీలోగా ఆరాలు తీశాడు. ఈ రిక్షావాడు పనిచేసింది: వారి ఫ్యాక్టరీలో కాదట మరో ఫ్యాక్టరీలో నట. అమ్మగారికి ఏ విధమైన ప్రమాదమూ జరగలేదు, వాణ్ణి వొదిలెయ్యండి, అని డవాలీ బంట్రోతుకి వుత్తరువు చేశారు. అమ్మగారు

పందిట్లో నిలబడి వున్నారు. ఏో అన్నట్లు సంజ్ఞ చేశారు. పోలీసు "ఈసారి వాళ్ళదగ్గర పెట్టుకుని నడుపుతూండు" అని గర్జన చేసి రిక్షాని ఒక్క కుదుపు కుదిపి చక్కా వెళ్ళాడు.

ఆ కుదుపుతో రిక్షాచక్రం మళ్ళా వూడింది. ఆ చక్రం, రెండు ఆకుల నడుమ చిక్కుకున్న ఎర్రపువ్వు కిందపడింది. రిక్షావాడు ఆ పువ్వుని తీసి, దులిపి అమ్మగారి దగ్గరకొచ్చి చేతిని చాచాడు— "ఇందండి" అన్నాడు పువ్వు తీసుకోమని. ఆవిడ కళ్ళు సంతోషంతో మెరిసినై, తనకోసం అనుకుని.

"నీకేం భయంలేదు పోరా" అంది ఆవిడ, ఆ పువ్వుని తీసుకో బోతూ. "ఆ పిల్ల తల్లోదండి" అన్నాడు రిక్షావాడు. ఆవిడ కనుబొమ్మలు చిట్లించింది. దూరంగా అరుగుమీద పనిపిల్ల ఏదో సర్దుతోంది. పరుగెత్తు కుంటూ వెళ్ళి రిక్షావాడు ఆ పువ్వుని ఆ పిల్లకిచ్చాడు.

"భద్రం పూలే పారేసుకున్న దానివు, రేపు మొగుణ్ణెం పెట్టు కుంటా" అని నవ్వి వెనక్కి వచ్చి రిక్షా చక్రం బిగించుకుంటున్నాడు.

లైసెన్సు సంగతి జ్ఞాపకం వొచ్చింది గావును, పోలీసు మళ్ళా వచ్చాడు. లైసెన్సు డబ్బుకి నేను హామీ యిచ్చి అతణ్ణి పంపివేశాను. రిక్షా ఎక్కడ ఎక్కమంటాడోనని చరచరా నడుచుకుంటూ వొచ్చేశాను. నా అభిప్రాయం వొకటి తప్పని ఋజువైంది. ఏదేనా కావచ్చు గానీ, రిక్షా వాడు సామాన్య మానవుడు మాత్రంకాడు.

# దాగిలి మూతలు

అదంతా అనుకోకుండా అకస్మాత్తుగా జరిగింది. మధ్యాహ్నం నిద్ర నుండి లేచి ఆవులిస్తూ వెళ్ళి గోడనున్న అద్దంలో ముఖం చూసుకున్నాడాయన. నుదుటిమీద సన్నటి గీతలు, నల్ల వెంట్రుకల మధ్యలో తెల్లవి, కళ్ళక్రింద కాకిపాదం ఆకారంలో గీట్లు—నిజంగా కనబడినంత ముసలితనం, తనలో వుందా అని ఆశ్చర్యపడ్డాడు. ఉపాధ్యాయ వృత్తిలో వారు వృద్ధులుగా కనపడతారంటారు. ఆ ఉదయమే రామదాసు మాస్టరీ ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. ఇందుకు వో విధంగా సంఘాన్ని మరమ్మత్తు చెయ్యాలన్న ఉబలాటమే కారణం. స్కూలు నిర్వాహక వర్గంవారు, పాఠశాల అభివృద్ధికై వొసగుచేయబడ్డ విరాళాలను తమ స్వంతానికి వాడుకుంటున్నారన్న సంగతి బైట పెడతానని బెదిరించాడు. అందుకు సమాధానంగా నాస్తికత్వం, స్వేచ్ఛా ప్రేమ బోధించి పిల్లల్ని పాడుచేస్తున్నాడన్న మిషపై యీయన్ని ఉద్యోగం నుండి తొలగించడానికి నిర్వాహక వర్గంవారు సమకట్టారు. ఈతని దగ్గర తన ఫిర్యాదు రుజువు చెయ్యగల బలమైన నిదర్శనాలేవీ లేవు. ఇదివరకే తన వింత భావాలపైనా అభిప్రాయాలపైనా వ్యాఖ్యానాలున్నాయి. ఇప్పుడు వెర్రివాడుగా చెప్పుకుంటున్నారు. ఏ కొద్ది మంది విద్యార్థులో తప్ప తన వాదాన్ని బలపరచేవారు లేరు. రామదాసుకి రాజీనామా యివ్వక తప్పింది కాదు. అతని వయసు నలభై ఎనిమిది కావొచ్చు. కాని యింక స్కూలు మాష్టర్ని మాత్రం కాను, అమ్మయ్య అనుకుంటూ అద్దంలో బింబాన్ని వెక్కిరించాడు.

గది మూలనున్న పాత క్రర పెట్టి అద్దంలో కనిపించింది. వెళ్ళి ఆ పెట్టి తెరచి అందులో వొస్తువుల్ని పరిశీలించసాగాడు. వివాహమైన

కొత్తలో తను కల్యాణికి వ్రాసిన ఉత్తరాలు కొన్ని చూశాడు. ఒకదాన్ని తీసి చదివాడు. ఆనాడతనిలో వున్న శృంగార శక్తులు, రసికత్వం, ఆశ్చర్యం కలుగజేశాయి. అదంతా వృథా. కల్యాణిలో ప్రేమోద్రేకం శూన్యం. తనకేమీ పట్టనట్లు, అక్కర్లేనట్లూ యితనివద్ద నుండి ఏదో కొంత దాచినట్లు వుండేది. నిప్పుకణంపై మంచుకణం పడినట్లు యితనిలో ఉద్వేగం చప్పబడి మెల్ల మెల్లగా అనుమానానికి దారితీసింది. ఆరు సంవత్సరాల దాంపత్య జీవితం అసూయతో నిండిపోయింది. ఆమెకి సంతానం కలగపోవడం, యితని చికాకుకి మరో కారణం. అతనిలో లోటు తెలుసుకోవాలంటే మరో పెళ్ళి చేసుకోవాలి. ఇద్దరి భార్యలతో కాపరం మాటలు కాదు. రామదాసు వయస్సు అప్పటికి ముప్పై రెండు. ఆ వీధిలోనే మరో అమ్మాయితో స్నేహం కుదిరింది. ఈ విషయం భార్యతో చెప్పివేశాడు. ఆమె తగవులాడేది. ఆమెపై అతనికున్న అధికారానికి చిహ్నాలుగా వుంటున్న యీ తగాదాలు అతనికి సంతోషాన్ని కలుగజేసేవే అనాలి.

కొద్దినెలల్లో కల్యాణి న్యుమోనియా వ్యాధికి గురైంది. పరామర్శించడానికి వొచ్చిన బంధువుల్నీ, స్నేహితుల్నీ చూస్తే రామదాసుకి మండిపొయ్యేది. వాళ్ళల్లో ఎవరోఒకరితో ఆమెకి చెలిమి ఏర్పడివుండాలి. ఎవరో తెలుసుకోలేక పిచ్చెత్తినట్లుగా వుండేది. కొన్ని రోజుల్లో కల్యాణి చనిపోయింది. మళ్ళా పెళ్ళికి స్వతంత్రుడేకాని, ప్రేమించిన పిల్లకి మరొకరితో వివాహం జరిగి కాపరాని కెళ్ళిపోయింది. ఇదంతా జరిగి పదిహేను సంవత్సరాలైంది. అతను మళ్ళా ప్రేమించడం జరగలేదు. వొంటిగా జీవితం గడుపుతూ, విషాదంలో ఒక వెర్రి ఆనందాన్ని అనుభవిస్తూంటాడు. అతని వైవాహిక జీవనం భగ్నమయింది. గనక వివాహంలో విసుగుతప్ప మరేమీ లేదంటాడు.

మిగతా విషయాలపై అతని అభిప్రాయాలు, అనుభవాన్ని అనుసరించే వున్నాయి. దేశంలో జనాభాన్ని పెంచడమే కాకుండా, సంతానం

యాతనంటాడు. పురుషులంతా దగాకోర్లు, స్త్రీలంతా చెడ్డవాళ్ళు. ఈ వెర్రి విపరీత పరిణామం పొందకుండా ఉపాధ్యాయ వృత్తిలో నిమగ్నుడై అంతర్యాన్ని దిగమింగ గలిగాడు. అపనమ్మకపు సిద్ధాంతాలు అతని బోధ నలకి పదునిచ్చాయి.

ఉత్తరాలు పెట్టేసి, రామదాసు ఫోటోగ్రాఫ్‌ల ఆల్బమ్ తీశాడు. అది ఎవరో యిచ్చిన పెండ్లి బహుమానం. పెళ్ళినాటి ఆ పటంచూస్తే అతనికి దిగులేస్తుంది. అప్పుడు సన్నగా నాజూకుగా వుండేవాడు. అతనే యిత నంటే స్నేహితులు ఆశ్చర్యం ప్రకటించేవారు. గోడనుంటే చూసేవారు యిట్లాంటివనడం, తను బాధపడటం జరుగుతుందని. దాన్ని లోపల పెట్టే శాడు. అతను, పదిహేనేళ్ళ వయస్సులో తీసుకున్న మరో ఫోటో వుంది. అమాయకంగా కనబడే పెద్దకళ్ళు అవీ - విద్యార్థి దశలో ఫోటో అది. అమాయకత్వంతో వాచ్చే ప్రశాంతత అతని మనస్సులో లేకపోవడం చిత్రంగా తోస్తుంది. తనేదో పాపం చేశానన్న స్ఫురణ పదే పదే అతన్ని ఆవహిస్తుంది. అది చాలా స్వల్పవిషయం.

కల్యాణి నిమోనియాతో మంచాన పడినప్పుడు, వైద్యుని రప్పించ డంలో కాస్తంత ఆలస్యమైంది. జబ్బుఅల్లా పరిణమిస్తుందని అతనను కోలేదు. ఆమెకూడా ఫరవాలేదంది. డాక్టరు యీ ప్రస్తావన తేలేదు. ఆమె చనిపోయింది - అందుకతను బాధ్యుడన్న అనుమానం వొదలదు. గిట్టని వారు కొందరు భార్య పోవడం ఏర్పాటుగానే వుందన్నారు. ఈ అనుమా నాన్నుండి పారిపోలేడు. ఆల్బమ్ మూసేసి, దానిపై ఏదేన కప్పుదామని లోపల తడుముతుంటే, నాటకం దుస్తులు బయటపడ్డాయి. చిన్ననాటి నాట కాల సరదాల్ని జ్ఞాపకంచేసే సరంజామ అదంతా. మస్లిన్‌లో కుట్టిన రాజు వేషంకోటు, మంత్రివేషం పాగా, ముని వేషం కాషాయి జుబ్బా, గడ్డాలు- యివన్నీ మాసి, చినిగి అల్లాగే వుండిపొయ్యాయి. పాఠశాల వార్షికోత్సవం నాడు పిల్లలు నిర్వహించే నాటకాలు అతను చూసేవాడు. అతనూ అప్పు

దప్పుడు వో వేషంధరిస్తుండేవాడు- నారదుడు, అతని అభిమానపాత్ర. రామదాసు తను గొప్ప నటుడై పోవాలనుకునేవాడు. నటుడుకి కావల్సిన లక్షణాలతనిలో వున్నాయని నమ్మకం. అతని జీవితమంతా ఒక నటనగా పరిణమించింది. ఆ నటనలో ఉత్తీర్ణుడయ్యాడేమో కాని, రంగస్థలంపైకి కాలేదు. ఎందుచేతనో. భార్య పోయినతర్వాత, యోగిగా అవాలనుకునేవాడు.

రైల్లో వోమారు "యోగి" బృందంతో గోష్ఠి సలిపాడు. పరమాత్మని సందర్శించినప్పుడు కలిగే మహత్తర ఆనందం గురించి, వైరాగ్యంలోని ప్రశాంతతని గూర్చి, హిమాలయాలలో తపస్సువల్ల పొందే వెలుగును గూర్చి వారు ప్రస్తావిస్తుంటే, అతను బుద్ధుడు, రామకృష్ణ పరమహంసనీ స్మరించి, వూహించుకున్న సంతోషంలో మునిగేవాడు. రైలు నిలబడగానే, టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేసినందుకు, రైల్వేఉద్యోగి ఆ యోగిబృందాన్ని దింపి తీసుకుపోవడంతో అతని పగటికల కరిగిపోయింది.

అనుకోకుండానే, రామదాసు ఆ కాషాయవస్త్రాన్ని ధరించాడు, మొహానికి గడ్డాలు తగిలించుకున్నాడు. సమాధిలో వున్నప్పుడు యోగి చేతికింద వుంచుకునే కర్రని తీసుకుని మరోగుడ్డ పాగాచుట్టి, అద్దంలో చూసుకున్నాడు. ఆ దుస్తులు బాగా అమిరాయి. కళ్ళలో దీనత్వం, ముడివడిన కనుబొమ్మలు, గంభీరంగా ముడుచుకున్న పెదవులు, తెల్ల వెంట్రుకలలోని పరిపక్వత- అన్నివిధాలా యోగిలా వున్నాడు.

నిజంగా ఇది ఇతనికి తగ్గవేషం, నిజతత్వంకూడా ఇదే. చటుక్కున రామదాసుకి ఒక ఆలోచన తట్టింది. ఈ దుస్తులతో వీధులోకెళ్ళి సంఘాన్ని చూస్తే ఎలా వుంటుందో....! అదొక అపూర్వమైన మానసికానుభవం. నిజమన్నట్లుగా గడియారం మూడుకొట్టింది. పనిమనిషితో తనింక ఆ పూటకి రావక్కర్లేదని చెప్పాడు, మధ్యగదిలోపల గడియవేసి,

దొడ్డివైపు గదికి తాళంవేసి, వీధిలో అటూ యిటూ చూసి ఎవ్వరూ తనని చూశ్శేదని తేల్చుకుని బైటకి నడిచాడు. నాలుగడుగులు ముందుకేసి ఇంటికేసి, అదే ఆఖరుసారి చూసినట్లుగా, పరకాయించి చూసి, తొందరగా నడవడం సాగించాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు.

వీధమ్మట నడిచే వ్యక్తులకేసి చూస్తుంటే తనేదో దూరంగా ఎత్తు మీదనుండి చూస్తున్నట్లనిపించింది. పాకుతూ, మెల్లిగా ఈడ్చుకుంటూ కదలిపోతున్న దౌర్భాగ్యపు మానవులు వారందరూ - ప్రతి వ్యక్తి మనో వ్యాధి మేఘంలో మరుగుపడ్డాడు. ఇంటికి తొందరగా వెడుతున్న అతను బ్యాంకు గుమాస్తా - ఇల్లు, మరో బ్యాంకు, భార్యకి మంచం అవతల నిల బడి ఈ డబ్బు కాస్తా దాఖలు చేసుకుంటాడు; ఆ కార్లోపై ఉద్యోగం కోసం పన్నాగం పన్నుతున్న ప్రభుత్వోద్యోగి కోర్కెలు సిద్ధించిన కొద్దీ వారి ఆశయాలు పెరిగి, చివరికి మేఘం బ్రద్దలై పొందిన ఫలితాన్ని ముంచెత్తివేస్తుంది.

రామదాసు పార్కు దగ్గరికి చేరుకున్నాడు. కొందరు పిల్లలాడు కుంటున్నారు....మరికొందరు వస్తువులు అమ్ముకుంటున్నారు. ఇద్దరు సాధులు గంజాయి పడుతున్నారు. వారి ఎదుట పడకుండా, చరచరా నడిచి కాలవ గట్టుకి చేరుకున్నాడు. గట్టున గుడిసెలున్నాయి, చెట్టునీడని స్త్రీలు బుట్టలల్లుతున్నారు. తొందరగా నడిచి ఏకాంతంగా వున్న చోటుకి చేరు కున్నాడు. ఎవరో అతని వెనక నడుస్తున్నట్లనిపించి తిరిగి చూశాడు. నడి వయస్సులో వున్న ఒక వ్యక్తి దీనంగా నమస్కరించి పలకరించాడు.

విచారంతో అతని ముఖం వాడినట్లుగా వుంది; బుజాన వున్న తువ్వాలుతో కళ్ళల్లో తడిని తుడుచుకుంటున్నాడు. అతన్ని పలకరించా లేమో, రామదాసుకు చటుక్కున తట్టిందికాదు.

"ఎవరు నాయనా నువ్వు-దిగాలుగా వున్నట్లున్నావు ?"

"అవును స్వామీ - నన్ను మీ వెంట తీసుకుపొండి."

"ఎక్కడికి ?"

"ఎక్కడికైనాసరే మీరు హిమాలయాల్లో వుంటుంటారు."

కొంచెం నిదానించి, రామదాసు "అవును" అన్నాడు.

"మిమ్మల్ని ఏదీ కోరను, ఎక్కడికో దూరంగా ప్రశాంతమైన నిర్జన స్థలానికి తీసుకు వెళ్ళండి."

"కారణం ?"

"నాకు జీవితమంటే విసుగెత్తిపోయింది ..."

రామదాసు కారుణ్యం సూచిస్తూ నవ్వాడు.

"జీవితమంటే యింత మోహం మొత్తశానికి నీకు జీవితం గురించి ఏం తెల్సు నాయనా ?" అన్నాడు రామదాసు.

"సంసారం త్యజించి, ఇంట్లోనించి లేచిపోవాలనిపించేటంతగా జీవితం గురించి తెల్సు స్వామీ - నేను తిరిగి వెళ్ళను. మీతో వచ్చేస్తాను." అన్నాగా వ్యక్తి. ఇతన్ని శిష్యుడుగా దేశపర్యటన దృశ్యం వూహించి గగుర్పాటు చెందాడు రామదాసు. సరియైన వాక్యంకోసం యోచిస్తుండగా, ఆ వ్యక్తి తన కుడిచేతిని పైకెత్తి చూపించాడు.

"హిమాలయాలనుండి వచ్చిన స్వాములు మీరు—చెయ్యిచూసి విషయం చెప్పండి"....అన్నాడు. రామదాసు చకితుడయ్యాడు. చెయ్యిచూసి చెప్పడం రాదంటే ? అరచేతిని మృదువుగానొత్తి "నీకు గొప్ప భవిష్యత్తుంది" అన్నాడు. అట్లాగంటే ప్రమాదంలేదు.

"లేదు స్వామీజీ—నాకు భవిష్యత్తు లేదు. దుర్భరమైన గతం మిగిలింది. సర్వమూ త్యజించి నేను మీతో వచ్చేస్తాను." అని ఆ వ్యక్తి గట్టుమీద దిగాలుపడి కూర్చుని, మొహాన్ని చేతుల్లో దాచుకున్నాడు. పక్కన కూర్చుని బుజాన్ని తట్టుతూ, రామదాసు అతన్ని వోదారుస్తున్నాడు.

"ఏమీ తెలియని పసివాడివి నాయనా నువ్వు" అన్నాడు అతను. వు చూడనప్పుడు మాటలు సులువుగా వస్తున్నట్లు గ్రహించాడు.

"త్యజించవల్సిన వయస్సు నీకింకాలేదు. ఈ విషయాలను గూర్చి అప్పుడే ఆలోచింపకూడదు. ఇంటికివెళ్ళి, భార్యా పిల్లల్ని చూసుగుంటూ, వారి ప్రేమానురాగాలకు పాత్రుడపై యధోచితంగా సమాజసేవ చెయ్యి నాయనా. పారిపోవడంవల్ల సృష్టిలయని భంగం చేస్తున్నావు" అన్నాడు.... నిజంగా పిట్లకేమన్నా అర్థముందా అనుకుంటూ. జీవితం గూర్చి వ్యాఖ్యానించి సిద్ధాంతీకరించడంకంటె సుళువైంది మరోటి లేదనిపించింది. అనేక మార్లు ఈ సిద్ధాంతాలను పెద్దలు ప్రస్తావించగా విన్నాడు. ఎన్నోమార్లు వీటిని గురించి చదివి యివన్నీ దగా అనుకునేవాడు.

"అవును నాయనా—ఈ చికాకు క్షణికమే. బాధ కొన్నేపటికి ఉపశమిస్తుంది. ఈ జీవితం ఒక రంగస్థలం. ఎప్పుడూ ఎవరో ఒకరు దీనిపై ఉంటూనే వుంటారు. నీ పాత్ర నువ్వు నిర్వహించాలి. ఎన్నెన్నో ఘనకార్యాలు నువ్వు సాధించాలి. ఎన్నెన్నో కలలు కన్నావు, నీ పిల్లలద్వారా ఆ స్వప్నాలు నిజమవుతాయి. నువ్వు కొంత సాధించి పెడతావు. అక్కడ వారందుకుంటారు. సృష్టి నిత్యమూ సిద్ధి పొందుతూనే వుంటుంది.

ఆ వ్యక్తి మొహం పైకెత్తి కాలవకేసి చూశాడు. మళ్లాకిందికి దించి మోకాలుమీద ఆనించాడు.

"లేదు - నాకీ జీవితంలో ప్రేమలేదు."

"చెప్పు నాయనా చెప్పు, నిదానంగా చెప్పు."

"తల్చుకుంటే బాధగా ఉంటుంది. నే చెప్పలేను స్వామీ...."

"లేదు నాయనా ఇతరులతో పంచుగుంటే బాధ ఉపశమిస్తుంది. నిన్ను వోదార్చి మనశ్శాంతి గలగచేస్తానేమో యత్నిస్తాను. జీవితంలో సమాధానం కుదిరేటట్లు చెయ్యగలనేమో—నీ వృత్తాంతం చెప్పవు?"

"మీరు మహానుభావులు. పవిత్రమైన మీ మనస్సుని ఈ తుచ్ఛమైన ప్రేమగాథతో కలవరపెట్టలేను. మీముందు అల్పుడను కాలేను."

"కాదు నాయనా—అల్పుడవు కావు. భగవంతుని దృష్టిలో

అందరూ సమానులే. పరమాత్మ అన్నిటిలోనూ ఉన్నాడు. తుచ్ఛమైన ప్రేమలో కూడ — ముందు నీ గాథ వినాలని వుంది" అన్నాడు రామదాసు.

ఆ వ్యక్తి కాలవలో చిన్న చిన్న రాళ్ళు విసురుతూ తన కథ చెప్పడం సాగించాడు. "పెద్దవాళ్ళేర్పాటు చేసిన సాధారణమైన వివాహం మాది పిల్లని చూశాను. నచ్చింది. నా కప్పుడు ఇరవై నాలుగు, ఆమెకి పదహారు. కార్యమవగానే చదువుకోసం కాలేజీకు వెళ్ళిపోయాను. చదువు పూర్తిచేసుకుని ఎనిమిది నెలలకి తిరిగొచ్చాను. ఆమె వొక మగశిశువును కన్నది. హరి అని నామకరణం చేశారు. నాకు ఉద్యోగం దొరికింది. హాయిగా కాపరం చేస్తున్నాం. ఐదేళ్ళ తర్వాత మా రాధ పుట్టింది. హరి ఎప్పుడూ తల్లితోనే వుండేవాడు. రాధకి నా దగ్గర చనువు. రాధ అచ్చంగా నా పోలికే అన్నాడు వో స్నేహితుడు. హరికి ఎక్కడా నా పోలిక లేదని అప్పుడు గుర్తించాను. అసలు మా కుటుంబంలో ఎవ్వరి ఛాయలూ వాడిలో లేవు. వాడు నాకు పుట్టలేదన్న వొక పెద్ద అనుమానం పుట్టింది నాకు. పెండ్లయి పదినెలలేనా కాలేదు. నేను తండ్రి నయ్యానన్నారు...."

ఆ వ్యక్తి మౌనం దాల్చాడు.

"ఇంతేసి నెలలవకుండానే ప్రసవించడమనేది ఉంది...." అన్నాడు రామదాసు. ఎందుకన్నానా అని పెదవి కొరుక్కున్నాడు. ఆ వ్యక్తి విని పించుకోనట్లుగా మళ్ళా సాగించాడు.

"కాని పోలికల మాటేమంటారు? రోజులు గడచినకొద్దీ నా అనుమానం దృఢపడసాగింది. బంధువుల్ని, స్నేహితుల్ని పోలికల కోసం గాలించసాగాను. ఋజువు లేకుండా ఆమెపై నిందమోపే సాహసం నాకు లేదు. చిత్రం, నా అనుమానంతోపాటు ఆమె ప్రేమానురాగాలు ఎక్కువవుతూ వొచ్చాయి. ఇదంతా నన్ను మరిపించడంకోసం చేస్తున్న నటన అనుకునేవాడిని. చూచాయగా ఎత్తిపొడుస్తూ నా అనుమానం బైటపెట్టే

వాడిని. రాద్ధాంతాలయ్యేవి. ఇవన్నీ అన్యోన్యానురాగం సూచించే వోట్లి తోనూ, ప్రమాణాలతోనూ ముగిసేవి....కాని....కాని"

తడితో కళ్ళు బరువెక్కి అతడు చెప్పలేకపొయ్యాడు. మెల్లగా తేరుకున్నాడు.

"ఈ మధ్యాహ్నం నిజం కనుక్కున్నాను" అని నిట్టూర్చాడు.

"విపులంగా చెప్పు నాయనా...."

"నా కింక అనుమానంలేదు—హరి తండ్రి లక్ష్మీపతి. చిన్నప్పటి నుంచి మేమిద్దరం స్నేహితులం. ఒక వూళ్ళో కొన్ని సంవత్సరాలు పని చేశాము. నా పెళ్ళినాటికి మేమిద్దరం వో వూళ్ళోనే ఉన్నాము. తరవాత కొన్నాళ్ళకి బదిలీ అయి అతను మరో చోటికి వెళ్ళిపొయ్యాడు. ఉత్తరాలు వ్రాస్తూండేవాడు. మొన్న మమ్మల్ని చూసిపోదామనొచ్చాడు.

హరిలో అతని పోలికలున్నాయి ఉన్న రెండు రోజులూ అవిడ కూడా మాతో కలిసి సంభాషించేది. నా కర్థంకాని ఆంతరంగికం వాళ్ళ మధ్య వుండేది. వాళ్ళ మాటల్లో నాకేమీ దొరకలేదు. ఒకరికేసి వొకరూ యిద్దరూ కలిసి నాకేసి—చూసే చూపుల్లో నాకేదో కనిపించింది."

రామదాసు అప్రయత్నంగా నవ్వాడు.

"మనో చాంచల్యానికి, భ్రాంతికీ యిది మంచి ఉదాహరణ— స్నేహితుల్ని ఈ విధంగా - ఉపయోగించుకుంటున్నావా, నాయనా ?" అన్నాడు.

"అంతేకాదు స్వామీ. ఈ ఉదయం లక్ష్మీపతి వెళ్ళాడు. అతన్ని దిగవిడచి నే యింటికొచ్చేసరికి మధ్యాహ్నమైంది. రాధ నిద్రపోతోంది. హరి యింకా స్కూలునుంచి రాలేదు. హాల్లోంచి లోపలికెళ్ళి పడకగది తలుపులు తెరిచాను. ఆమె అదిరిపడింది. తలంటు పోసుకుని, ఏదో చూస్తూ

కూర్చుంది. నన్ను చూసి బెదిరినట్లు చివాలున లేచి చేతిలో వున్న కాగితాన్ని గుప్పెట్లో ముడిచేసి కొంగులో చెయ్యి దాచింది. జుట్టు గాలికి కదులుతూ మెడమట్టూ పడింది. శరీరాన వున్న తడి చీరని కొద్దిగా పట్టుకుని వుండడం మూలాన గుప్పెడు కనిపిస్తోంది.

"ఏమిటది ?".... నా ప్రశ్నకి ఆమె ఉలిక్కిపడింది.

"ఏమీ లేదు"....కంఠంలో దౌర్జన్యం ధ్వనించింది.

"ఏమిటో నాకు తెలుసు" అన్నాను.

"అవుతే నన్నడగటం దేనికి ?"

"నే అనుకున్నది సరో కాదో చూద్దామని."

"ఏమనుకున్నారో ముందు చెప్పండి."

"చెప్పను."

"చెప్పకపోతే ఇదేమిటో కూడ చెప్పను."

ఒకడుగు ముందుకేసి.... "ఆ గుప్పెట్లో దేమిటో ఇలాతే" అని ర్జించాను.

"నేనివ్వను" అని రెండడుగులు వెనక్కి వేసింది.

"నేను బలవంతంగా తీసుకోగల్ను తెలుసా."

"అబ్బో —"

"విసిగించక యిల్లాతే—ఊ—" అంటూ దగ్గరికెళ్ళి మోకాలు మీదికి జారిన ఆమె చీరకొంగు పట్టుగున్నాను.

"దూర్తంగా ఉండండి — వెళ్ళండి" అని కొంచెం బిగ్గరగా అంది.

"ఎందుకివ్వవు ?"

"మీ కి పట్టుదలెందుకు ?"

తెలుసు కాబట్టి...."

"ఏమిటా వెర్రి ధోరణి....మీకేం తెలుసు ?"

"నాకేం తెలుసో నీకు తెలీకపోతేగా ?"

"నాకేం తెలీదు" అన్నదామె.

"మొగుడికి చివ్వర్లో కాని తెలీదంటారు !" అన్నాను.

"ఆహా" అని కాస్త వెటకారంగా అని హిస్టీరియా అనిపించే అదో రకం నవ్వుని నిలుపుకుంటోంది.

"చివ్వర్లో తెలిస్తే చివర్లోనే నమ్మాలి కూడ"....అని ముగించింది. పూనకంలా వచ్చేసింది నాకు కోపం. ఆమె నోటిమీద చేత్తో వొక్కటి చరిచాను, చేతిలో వున్నదాన్ని లాక్కోడం కోసం పెనుగులాట సాగించాను. పట్టు వొదలక, మంచంబద్దీ పట్టుగుని నన్నొక్క తోపు తోసింది. నేను మంచంపైన కూలాను. వెర్రి ఆవేశంలో కొట్టడానికి ఏదేనా దొరుకుతుందేమో చూస్తూ హాల్లోకెళ్ళి పింగాణీ పూలతొట్టిని విసిరేశాను. అప్పుడే వొచ్చి గదిలో కెళ్ళబోతున్న హరికి తగిలింది. అమ్మయ్యో అని వాడు కూలడం, నే వెళ్ళబోతుంటే తలుపులు లోపల గొళ్ళెమెయ్యడం జరిగింది. "పో యిక్కడికి రాకు పో" అని వాడు గొణగడం అస్పష్టంగా అనిపించింది. కొండ శిఖరంనుండి పడినవాడిలాగైంది—అఖాతంలోకి కుంగిపోతున్నట్లుగా, అల్లా నడుచుకుంటూ యిల్లా చేరుకున్నాను. స్వామీ—మీరే నన్ను చూడాలి"

ఉద్రేకంతో ఆ వ్యక్తి పెదవులు వణికిపోతున్నాయి. పొరలి వొస్తున్న దుఃఖం మొహాన్ని వికృతంగా చేసింది. రామదాసు అతని మొహాన్ని తుడుస్తూ బుజ్జగించాడు. అతని కళ్ళలోకి తీక్షణంగా చూశాడు.

"చూడు నాయనా, 'నేనిది చేసాను,' 'నేనది చేశాను' అంటావు. ఈ "నేను" ఎక్కడుంది? లేదు నాయనా. ఆకలేస్తే అన్నం కావాలం

టావు. చక్కలిగింత పెడితే నవ్వుతావు. గిల్లితే ఏడుస్తావు మిగతావాళ్ళు ఎవ్వరూ చెయ్యనిది, ప్రత్యేకంగా నువ్వు మాత్రం చేసినది, ఇందులో ఏదుంది ? అహాంని మరచిపో— కన్నీటికీ, నవ్వుకీ, అతీతుడవవుతావు.... నీ అహం గురించి ఆలోచించి, దాన్ని ప్రేమించి తుదకు ద్వేషిస్తున్నావు. అందుకనే అహంనుండి పారిపోతున్నావు. నువ్వు నీ భార్యనీ, పిల్లవాడినీ ద్వేషించడం లేదు. నిన్ను నువ్వే ద్వేషించుకుంటున్నావు. హరి గాయపడే టట్లు నువ్వు విసిరిన పూలతొట్టి నీ పైననే విసురుకున్నావు గాయపడి పరుగెత్తుకొచ్చేశావు. ఈ సందర్భంలో ఏదేనా వో శ్లోకం చదవాలను కున్నాడు రామదాసు, కాని తప్పులు చదవడం అతనికి యిష్టంలేదు.

"నేనామెను ప్రేమించాలనుకున్నాను శీలం చెడిపోయిన స్త్రీని ప్రేమించలేను స్వామీ...."

రామదాసు చిరునవ్వు నవ్వాడు.

"పిచ్చివాడవు నాయనా....నువ్వామెను ప్రేమించలేదు, వాంఛిం చావు. వయస్సు మళ్ళడంతో వాంఛ లేనప్పుడు సాధ్యమైన ప్రేమ—నిజ మైన ప్రేమ.

"సంతోషం లేనప్పుడు ఈ ప్రేమ ఎందుకు స్వామీ...."

"ఈ మాత్రం తెలీదా ? నువ్వు అన్వేషిస్తున్నది ఆనందం కాదు. నువ్వు కోరేది కొత్త కొత్త ఇంద్రియానుభవాలు, వయస్సుతోబాటు శారీరక సుఖాలు పలచబడతాయి. హృదయం పవిత్రమైన ప్రేమతో నిండుకుంటుంది. సంసారాన్ని త్యజించడానికి నువ్వు సంసిద్ధుడవేగా ?

"ఆ...."

"సరే ఇప్పుడు నీ హృదయం లోపల చూడు, అసూయ, ద్వేషం

'అవును స్వామీ—నాకు తెలిసొస్తోంది. మనసులో ఆరాటం తగ్గుతోంది."

"నిన్ను గురించి ఆలోచించకు. నీ భార్యను గురించి, పిల్లల్ని గురించి ఆలోచించు. వారిని ప్రేమానురాగంతో ముంచివెయ్యి. వారిని సుఖపెట్టు. నువ్వు సుఖపడతావు. ఇదే వేదాలు బోధించే రహస్యం."

"ఇది నాకెల్ల సాధ్యమో చెప్పండి ?"

"ఎందుకు కాదు ?" నీ భార్య గుప్పెట్లో నువ్వు చూడలేదు. అదీ మామూలు కాగితం కావొచ్చు, ఏనాడో నువ్వామెకి వ్రాసిన జవాబు అవ్వొచ్చు. పాత జాబులు ఎంతో ఆనందాన్నిస్తాయి. ఆ జాబుని ఆమె చదువుతూ వుండొచ్చు."

"అవుతే ఆమె నాకెందుకు చూపించదు ?"

"చూడు నాయనా —ఆమెకి నీలాగే అహం ఉంది. నీ అహాన్ని నువ్వు ప్రదర్శించావు. ఆమె తన అహాన్ని బైటపెట్టింది. నీ దౌర్జన్యం, మూర్ఖత్వం ఆమెలో దౌర్జన్యాన్ని, మూర్ఖత్వాన్ని పురిగొల్పాయి. రహస్యమైన స్వార్థాల సంఘర్షణ అది. తిరిగి ఆమె దగ్గరకు వెళ్ళు: నీ మూర్ఖత్వాన్ని తెలియపరిచి, పశ్చాత్తాపపడి, ఆమెను క్షమాపణ వేడుకో. ఆమె హృదయద్వారాలు తెరచుకుంటాయి. విశ్వాన్ని సహితము ముంచివేసే ప్రేమ నీపై కురిపిస్తుంది."

"మరొకరికి పుట్టినవాణ్ణి నేనెట్లా ప్రేమించగలను స్వామీ ?"

"మనమంతరం దేవుడి బిడ్డలం. మరొకరికి పుట్టినాసరే, నువ్వు ఆ బిడ్డని ప్రేమించగలగాలి."

"నేనది చెయ్యలేను."

"నువ్వు చెయ్యగలవు. పరిస్థితులకు లొంగి, ఆమె అజ్ఞానంలో అపచారం చేసి ఉండొచ్చు. ఆమె గతాన్ని క్షమించు. మంచిగా ఉండే

టందుకు వొక్క అవకాశమివ్వు. పుట్టిననాటినుండి, చనిపోయేవరకూ మంచిగా ఉండే వ్యక్తులు మనలో ఎవ్వరూ లేరు. అజ్ఞానంలో, యౌవన చాపల్యంలో మనం తప్పటడుగులు వేస్తాం. పొరపాట్లు చేస్తాం — అప్పుడప్పుడు బోర్లగిల పడతాము. లేచి సర్దుకుని మళ్ళా బ్రతుకు సాగిస్తాం. నా కళ్ళల్లోకి చూడు. ఆమె అపచారం చేసిందంటున్నావు. అట్లాంటి అపచారం నువ్వెన్నడూ చెయ్యలేదా—నీలో నువ్వు ఆ ప్రశ్న వేసుగో...."

"కాని నేను పురుషుణ్ని...."

"ఆమె స్త్రీ—పైగా మాతృత్వం ద్వారా పరిపూర్ణత పొందవల్సిన భారం ఆమెపైనుంది.

"స్వామీజీ మీరు చెప్పింది నిజమైతే, అసలు నీతికే తావులేదు."

"ఇదొక వెర్రి నాయనా. వ్యభిచారమొక్కటే దుర్నీతి కాదు. అసత్యం, దగాకోరుతనం, అన్యాయం, లంచగొండితనం, అధికారం, అసూయ, ద్వేషం, పగ, యుద్ధం-ఎన్నెన్నో వున్నాయి ఈ లోకంలో. ఇదంతా దుర్నీతే. దీనిని నువ్వు ద్వేషించి సమాజం నుండి పారిపోవడం లేదే.... సాధించి భాగ్యవంతులైన వారిపట్ల వీటిని ఎందరో హర్షించడమే కాకుండా ఆదర్శంగా స్తుతించడంలేదా? వెక్కిరింపుగా మృత్యువులో అంతమొందే ఈ క్షణిక జీవితంలో ఇదొక అపరాధమా? అనంత విశ్వంలో, ఎడతెగని సృష్టి సమరంలో, ప్రేమలో పరాకుగా కన్నుమూతొక పాపమా! నేనొకర్నెరుగుదును...."

ఏదో చెప్పబోతూ రామదాసు పొరబాటు తెల్సుకుని, చటుక్కున నిలిచిపోయ్యాడు.

"చెప్పండి స్వామీ—చెప్పండి అనుభవం వున్నవారల్లే మాట్లాడుతున్నారు."

"లేదు నాయనా నాకేమీ అనుభవంలేదు. కాని ప్రేమంటే నాకు తెలుసు—విశ్వమంత గంభీరంగా, సృష్టంత శాశ్వతంగా వుండగలదు.

రామదాసు కళ్ళు తడిసి మెరుస్తున్నాయి. నవ్వులోకి దిగిపోయి, ఆ వ్యక్తిని లేవదీసి ముందుకు నడిపిస్తున్నాడు.

"నాతో రా నాయనా...."

"ఎక్కడికి స్వామీజీ ?"

"వైద్యుని వద్దకి. అతన్ని తీసుకుని నీ ఇంటికి వెళ్ళి, పిల్లదిని చూసుకో."

నిశ్శబ్దంగా నడవడం సాగించారు.

"క్షమార్పణ, జీవితంతో సమాధానపడటం. ప్రేమ, విశ్వాసం ఇవి అర్థంలేని ధ్వనులు కావు నాయనా...." అంటున్నాడు రామదాసు. ఇంతలో గట్టునున్న గుడిసెల దగ్గరకి చేరుకున్నారు.

బీదతనం, అనారోగ్యం, ద్వేషం, యుద్ధం—అన్నిటికంటే ముఖ్యంగా ప్రేమరాహిత్యం — ఇవి నాయనా జీవితంలో అనర్థాలు. వీటిని తొలగించడమే మానవ జీవితం యొక్క పరమార్థం. నీ ప్రేమకోసం తహతహలాడుతున్న నీ భార్యా బిడ్డల దగ్గరకు వెళ్ళు. వారికి ఉపచారం చెయ్యి అదే పరమాత్మ దర్శనం...."

ఇద్దరూ పార్కు దగ్గరకొచ్చారు. ఆ వ్యక్తి నేత్రాలు, ఉత్సాహంతో పదేపదే ముడుచుకుంటున్నాయి.

"మీరు మహానుభావులు స్వామీ—నాకు అర్థమవుతోంది. నా మనస్సు చల్లగా వుంది. ఇంక అసూయ, ద్వేషమూలేవు....నేను యింటికి వెడతాను. వైద్యుని తీసుకెడతాను....అయ్యో హరి గాయపడి ఎంతగా.... బాధపడుతున్నాడో. ఆమె పాపం....ఆమె ఎంతగా స్వామీజీ, నేను మీకేమివ్వగలను ?"

"నేను చేసిందేమీలేదు నాయనా. ఇతరులకోసం జీవించు దైవం నిన్ను కాపాడతాడు."

తొందరగా నడుస్తూ ఆ వ్యక్తి పార్కు వెనక వైపు వెళ్ళిపోయ్యాడు.

రామదాసు తనలో తాను నవ్వుకున్నాడు. జరిగిందంతా హాస్యాస్పదంగా తోచింది. వేదాంతం వేళాకోళమనీ, మనిషి దగాకోరనీ అనుకునేవాడు. ఆధ్యాత్మిక చింతనపైనా, దైవం పైనా అతని కెప్పుడూ గురి కుదరలేదు. విశ్వాసం లేని అతని పలుకులనుండి వోదార్పుపొంది, అతని మాటలు నమ్మి జీవిత విధానం మార్చి వేసుకోటానికి సంసిద్ధుడైన ఒక వ్యక్తి అతనికి తటస్థపడ్డాడు. మానవులు ఎంతటి అమాయకులు!.... గొప్పగా ధ్వనించే మాటలకీ, శూన్యమైన భావాలకీ లొంగి, మోసపోతారు... తన భాషకీ భావానికీ తనే ఉద్రేకపూరితుడై హృదయం సంచలనం కలగడం గుర్తించి రామదాసు చికాకుపడ్డాడు. నుదుటిమీద చెమట్లు కమ్ముతున్నాయి. పాగా తీసేసి, వొక పొరతీసి దానితో మొహం తుడుచుకున్నాడు. సూర్యుడు దిగిపోతున్నాడు. పొడుగాటి నీడలు పడుతున్నాయి. చెట్లు, వీధి. పడమటి ఆకాశం—వీటిపైన సంధ్య వెలుగు ఎర్రశాలువా కప్పినట్లుంది, ఇద్దరు సాధువులు సంచీలు కట్టేసుగుని, కులాసాగా కబుర్లు చెప్పుగుంటూ కాలవకేసి నడిచిపోతున్నారు. వారిలో ఒకడు వెనక్కి తిరిగి తనకేసి చూసినట్లయింది. రామదాసు వెంటనే పాగా తగిలించి, పార్కు అవతల వైపుకు వెళ్ళాడు. కుళాయి దగ్గర మొహం కడుక్కుని కాసిని నీళ్ళు తాగి ముష్టివాళ్ళ మధ్యగా నడచి పార్కుకి లోపలికి చేరుకున్నాడు. అలసటగా వుండి, కాసేపు పేద తీర్చుకుందామనుకుని, వో మూల కర్ర బెంచీమీద మోకాళ్ళు ముడుచుకుని కళ్ళుమూసుకుని కూర్చున్నాడు. కొన్ని నిమిషాలు గడిచాయి. ప్రతిధ్వనించే పిల్లల కేకలూ, నవ్వులూ వినబడ్డాయి.

పిల్లలతో ప్రమాదం, మరోచోటుకి దూరంగా వెడితే మంచిదేమో అనుకున్నాడు. కాని వాళ్ళ ఆటల్లో లీనమైపొయ్యారు. తనని గమనించి

నట్లు లేదు. వారి వొయ్యారమయిన పరుగులు, ముద్దుగొలిపే నవ్వులు, చూడ్డానికి ఆకర్షణీయంగా ఉన్నాయి. వారి సహజమయిన సంతోషం, అతన్ని సంతోషపెట్టింది—చూస్తూ కూర్చున్నాడు. ఆకాశంలో ఎరుపు కరిగి, దట్టమైన ఊదారంగు మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఫ్యాక్టరీ కూత వినబడింది. పావురాలు చెట్లమీదికి ఎగురుతున్నాయి.

అతను లెక్కపెట్టాడు. ఆరుగురు పిల్లలు దాగిలిమూత లాడు కుంటున్నారు. ఐదారేళ్ళుంటాయి—ఆ పిల్ల దొంగ: కళ్ళ మీద రుమాలు కట్టివుంది. మిగతా ఐదుగురూ దొరకకుండా అటూ యిటూ పరుగెడుతూ, మొక్కల వెనక, బెంచీలకిందా దాకుంటున్నారు. ఆ పిల్ల చేతులు చాచి, తడుముకొంటూ తిరుగుతోంది రామదాసుకి దగ్గరగా వొచ్చింది. అతను లేవబోతుండగానే అతని భుజం పట్టుగుంది. "ఇదుగో దొంగ....దొరి కాడు....అమ్మదొంగా — ఇక్కడున్నావా ?" అని కేకలేస్తూ, మొహాన ఉన్న రుమాలు లాగేసింది. మిగతా వాళ్ళందరూ నవ్వుకుంటూ ఆమెచుట్టూ మూగారు. "ఇదుగో దొంగ...." అన్నది ఆ పిల్ల. మిగతా వారందరూ రామదాసుని అటూయిటూ లాగుతున్నారు. అతని గడ్డాలు వూడి వొచ్చేస్తా యేమోనని భయపడ్డాడు. నిలబడి సర్దుకున్నాడు. ఆ పిల్ల సిగ్గుపడి, ముసి ముసిగా నవ్వుకుంటూ పరుగెత్తుకుపోయింది. మిగతావాళ్ళ ఆమె వెనకే పరుగులు సాగించారు.

రామదాసు పార్కుగేటు ముందుకి చేరుకున్నాడు. దూరంగా వో జట్కా బండి నిలిచింది. అందులోంచి, ఇందాకా ఇంటికెళ్ళిన వ్యక్తి, వో కుర్రాడు దిగి, తన వైపుకి నడచి వొస్తున్నారు.

స్వామీజీ మీరిక్కడుంటారనుకున్నాను. అదుగో నా భార్య రాధ: అదుగో ఆ బండిలో ఉన్నారు. పార్కుకేసి షికారుగా బైలుదేరాము. మీరుంటారనుకున్నాము. ఆమెకి మీ దర్శనం చేసుగుని ఆశీర్వాదం

పొందాలనుంది. వీడు హరి. చిన్నగాయమే లెండి తగిలింది. వైద్యుడు బాండేజి వేశాడు. స్వామీ, మీరు చెప్పినట్లే జరిగిందిస్వామండి! అంతా.... ఎటొచ్చి, చదువుతున్నది ఉత్తరం కాదు. నే వెళ్ళేటప్పుడికి మా పెళ్ళినాటి ఫోటో చూసుగుని, జ్ఞాపకాలని వూహించుకుంటోందిట. నే పరాయివాణ్నిగా ఆ జగత్తులో ప్రవేశించానట.... నేను మూర్ఖుణ్ని స్వామీజీ.... ఆమెతో అంతా చెప్పేసి క్షమాపణ చేసుకొన్నాను. మీరు మహానుభావులు. క్షణం ఉండండి; వాళ్ళని తీసుకొస్తాను...." అంటూ సమాధానం చెప్పనీకుండా, అతను గబగబ బండి దగ్గరకు వెళ్ళాడు. అతని భార్య, కూతురు బండి దిగడం చూశాడు రామదాసు. మెల్లగా నడుచుకుంటూ వొస్తున్నారు. వారి కేసి చూసి, చివాలున వెనక్కి తిరిగి రామదాసు నడవడం సాగించాడు. వాళ్ళు వచ్చేసరికి అతను అక్కడలేడు. వారిని అక్కడ దిగవిడిచి, ఆ వ్యక్తి పిలుస్తూ వెనకాలే నడచివెళ్ళాడు.

"స్వామీజీ—వెళ్ళిపోతున్నారా....వాళ్ళని ఆశీర్వదించరూ ?"

రామదాసు అతని కళ్ళలోకి చూశాడు.

"పరమాత్మ మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. నేను వెళ్ళాలి"

"ఎక్కడికి స్వామీ ?"

"ఇంటికి...."

"ఇంటికా ? మీకు యిల్లు లేదన్నారుగా...."

"అవును నాయనా దేవుడే నా యిల్లు." అని రామదాసు తొందరగా నడిచాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు. వెనక్కి తిరిగి చూశాడు. ఆ వ్యక్తి పార్కులోకి వెళ్ళడం చూశాడు. హరిని చూడగానే అతనే 'దొంగ'ని రామదాసుకి తెలిసిపోయింది. పదిహేనేళ్ళ విద్యార్థిగా వున్నప్పటి తన ఫోటో ఆ మధ్యాహ్నమే చూశాడు. హరి ఆ ఫోటోలో పిల్లాడిలా వున్నాడు. "దొంగ దొరికాడు" అన్న పార్కులో పిల్లమాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి. ఆ పిల్లల నవ్వు తలుపులు మూసుగున్న అతని

హృదయం పైన గుద్దినట్లుగా వుంది. తలుపులు తెరుచుకున్నాయి. వేదాంతం అంతా వేళాకోళం, మనిషి దగాకోరు అనుకునే వాడుగా....తను దగాకోరు, తన జీవితం వేళాకోళం, కళ్యాణిని ప్రేమించి క్షమించ మనగలిగాడాతను? స్కూలు వ్యవహారాలు బైట పెడతానన్నాడు నిర్వాహక వర్గం వారిపై ద్వేషం వల్లకాదా? ఎవరిపై అతనికి నమ్మకం వుంది? తన మీద తనకి నమ్మకం వుందా? కళ్యాణి జబ్బుతో మంచాన పడినప్పుడు, వైద్యుని ఎందుకు వెంటనే పిలవలేదు. చనిపోతే తన బిడ్డని దాల్చిన ఆమెని పెండ్లి చేసుకుందామనేగా?

రామదాసు, తన యిల్లు వున్న వీధికి చేరుకున్నాడు. అడుగు నీర్సంగా పడుతోంది, అస్థిపంజరం వొణుకుతోంది. కళ్ళమ్మట కన్నీరు కారుతోంది. ఆకాశంలో చందమామ మీద సన్నటి పొరలా తెల్లటి మేఘం పడింది. నక్షత్రాలకేసి చూశాడు, చందమామ మీద మేఘం తొలగింది. అతని మనస్సులో ఏదో లేతగా మెరిసినట్లయింది. వీధిలో జనం లేరు— మేడల కిటికీల్లోంచి, దీపాలు కదులుతున్నాయి. ఇంటికి చేరుకున్నాడు. అదిగో అతని యిల్లు—ఇన్నాళ్ళూ తను దాక్కున్న ఇల్లు. తనెప్పుడూ దాక్కుంటున్నాడు—ఇంట్లోనో స్కూల్లోనో గడ్డాల వెనకనో, ఇప్పుడు దొరికిపొయ్యాడు. ఇంక దాక్కోలేడు.

అకస్మికంగా రామదాసు వెనక్కి తిరిగి నడచి వీధి మొగిలో కొచ్చాడు. పెద్ద రస్తాలో తొందరగా నడచిపోతున్నాడు. పార్కు దాటి, గుడిసెలుదాటి, కాలువ గట్టంమ్మటే వెడుతున్నాడు. మొహాన తగిల్చిన గడ్డాలుపీకి, కాలవలో పారేశాడు. ఇంకా నడుస్తున్నాడు. ఇంకా దూరంగా మంచుతో, మసకగా కప్పబడిన ఆ పచ్చకొండ వేపుకి, దానవతలున్న వింతకేసి కదలిపొయ్యాడు.

